AMMA NUDI
Telugu Monthly
Vol. 1
Issue 5
Rs. 20
July 2015
Tenali, AP



తెలుగుజాతి పత్రిక
1993-2013 నడుస్తున్న చరిత్ర

# అమ్మనుడి

జూలై 2015

## తెలంగాణ సాంస్కృతిక యోధుడు, అక్షర వాచస్పతి దాశరథి రంగాచార్య

## రెండు తెలుగు రాష్ట్రాల మధ్య కుదరని సయోధ్య .. ఎడతెగని విభేదాలు

**'అమ్మనుడి'** పత్రిక మీకు నచ్చితే,
దయచేసి వెంటనే చందాదారులుగా చేరండి.

చందా సొమ్మును

- మనియార్డర్ ద్వారా పంపవచ్చు.
- ఆన్‌లైన్‌లో పంపవచ్చు.
- బ్యాంకు డి.డి. / చెక్ పంపవచ్చు.

మీకు ఎలా వీలయితే అలా పంపించవచ్చు.
వివరాలు 4వపుటలో చూడండి.
ప్రతినెలా పోస్టులో పత్రికను పంపగలము.

**జూన్** 8న కన్నుమూసిన దాశరథి రంగాచార్య జీవితం, సాహిత్యం అంతా ప్రగతిశీల ప్రజాస్వామ్య ఉద్యమాల నుంచి వచ్చిందే. తెలంగాణ సామాజిక, సాంస్కృతిక ఉద్యమాల చరిత్ర ఆయన ఆత్మకథ. తెలుగు సాహితీవేత్తలలో అత్యున్నత స్థాయికి చెందిన ఆయన మరణించటం తెలుగుజాతికి తీరనిలోటు.

..19వ పుట నుండి




## రచయితలకు సూచనలు

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగువారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి. 2. రచనలను యూనికోడ్‌లో గాని, అను ఫాంట్స్ లో గాని టైప్ చేసి లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి ammanudi@gmail.com కు పంపాలి. లేదా కొరియర్ / రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో పంపవచ్చు. 3. రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రం విధిగా, స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము. 4. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.

## కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తుంది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.

2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగువారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి.

3. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైన్ల)లకు మించకూడదు. ప్రతినెలా 4 లేక 5 కవితలకు మించి పత్రికలో చోటుండదు.

## లోపలి పుటలలో....



కైసేత: **అ. రాజ్యలక్ష్మి, శంకర్,** రేఖాచిత్రాలు: **బాలి**
పకపకలు: **సరసి**

**పత్రికలో రచయితలు వ్యక్తం చేసే అభిప్రాయాలు వారి స్వంతం. వారితో పత్రిక యాజమాన్యం, సంపాదకుడు ఏకీభవించవలసిన అవసరం లేదు.**

రచనలు, ఉత్తరప్రత్యుత్తరాలకు : డాక్టర్ సామల రమేష్‌బాబు, సంపాదకుడు, **అమ్మనుడి,**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004. e-mail : ammanudi@gmail.com
దూరవాణి: కార్యాలయం : *0866-2439466* సంపాదకుడు : *9848016136*

తెలుగుజాతి పత్రిక
# అమ్మనుడి
మాసపత్రిక

• నుడి • నాడు • నెనరు

సంపాదకుడు **డా॥ సామల రమేష్‌బాబు**

శాలివాహన శకం 1937 మన్మథ నామ సంవత్సర అధిక ఆషాఢమాసము *(కట్లాపి) శుక్ల చతుర్దశి బుధవారము నుండి నిజ ఆషాఢ *(కట్లాపి) శుక్ల పూర్ణిమ శుక్రవారము వరకు

* **కట్లాపి** = తెలుగు నెల

## చందా వివరాలు

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| శాశ్వత చందా | : | రూ.5000 | రూ.7500 | -- |
| 6 సం॥ | : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ | : | రూ. 600 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ | : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు

**'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.

**AMMA NUDI - AXIS BANK, TENALI**

అక్కౌంట్ నెం. **915020010550189**

**IFSC Code : UTIB0000556**

ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆవెంటనే దయతో - చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను, జాబుద్వారాగాని, ఫోన్ మెసేజి ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా

**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, **తెనాలి**
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com

**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంపగలము. ఇందుకోసం మీ మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

### చందాదారులకు తప్పనిసరి సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. మీ చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరు, పోస్టాపీసు పిన్‌కోడ్ నెంబరు తదితర పూర్తివివరాలు మీ చిరునామాలో తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి. మీ చిరునామా మారినట్లయితే వెంటనే తెలియజేయండి.

# 'నడుస్తున్నచరిత్ర' చందా ఉన్నవారికి సూచన

**'అమ్మనుడి'** పత్రిక ఇంతకు ముందున్న నడుస్తున్నచరిత్ర ఆశయాదర్శాలతో వస్తున్నదే. కానీ పత్రికను **'తెలుగుజాతి'** ట్రస్టు ప్రచురిస్తున్నది. అయినా, కొందరి విజ్ఞప్తి మేరకు నడుస్తున్నచరిత్రకు చందాలు మిగిలివున్న వారికి కూడా వారి చందా సొమ్ముకు సరిపడా **'అమ్మనుడి'** పత్రికను పంపించాలని తెలుగుజాతి ట్రస్టు నిర్ణయించింది. కనుక ప్రతివారికి వారి చందా సొమ్ము ఇప్పుడు **'అమ్మనుడి'** చందా వివరాల ప్రకారం ఎప్పటివరకూ సరిపోతుందో - పత్రికను పెట్టి పంపే కవరుపై చిరునామా పైన ముద్రించి వుంటుంది. దానిని చూచుకొని, దయచేసి సకాలంలో **'అమ్మనుడి'** చందాను పంపించి పత్రికకు మీ మద్దతును కొనసాగించ గోరుతున్నాము.

### వెంటనే చందాలు పంపండి

అమ్మనుడి తొలి నాలుగు సంచికలను (మార్చి, ఏప్రిల్, మే, జూన్) నడుస్తున్న చరిత్ర చందా మిగిలి ఉన్నవారికి, అయిపోయిన వారికీ కూడా పంపించాము. ఇకపై చందా మిగిలిఉన్నవారికి, కొత్త చందాదారులకు మాత్రమే పంపగలము. పైన ఇచ్చిన సూచనను కొందరు గమనించి ఉండకపోవచ్చు. చూసినప్పటికీ పనుల వత్తిడిలో చందాసొమ్మును పంపించకపోయి ఉండవచ్చు. అటువంటివారు దయచేసి వెంటనే పత్రిక చందా పంపమని మనవి.

### శాశ్వత చందాదారులకు మనవి

'నడుస్తున్నచరిత్ర'కు రు. 1000 లు చెల్లించి, శాశ్వత చందాదారులుగా చేరినవారు 'అమ్మనుడి' పత్రికకు శాశ్వతచందా రు.5000 లకు గాను రు.4000 లు మాత్రం పంపి కొత్తగా రశీదు పొంద ప్రార్థన. అలా చేయలేనివారికి ఏడాదిపాటు **'అమ్మనుడి'** పత్రికను పంపించగలం. అప్పటికీ చందాను కొనసాగించలేని వారికి పత్రికను పంపజాలమని మనవి చేస్తున్నాము. దయచేసి సహకరించగోరుతున్నాము.

### విన్నపం

'నడుస్తున్నచరిత్ర' పత్రికను అనేకమందికి ఉచితంగా పంపిస్తుండేవారము. ఇకపై ఉచితప్రతులు పంపడం వీలుపడదు. పత్రిక కావలెనని కోరుకొనే వారందరూ చందాదారులుగా చేరవలసిందిగా కోరుతున్నాము. మీ మిత్రులను కూడా ప్రోత్సహించి, చందాదారులుగా చేర్చి పత్రికను శక్తివంతం చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము. ఇంతవరకు పత్రిక పరిచయం లేనివారు మాదిరిప్రతి (శాంపుల్‌కాపి) ని కోరినచో వారికి ఉచితంగా పంపగలము.

– ప్రచురణకర్త




# తెలుగుజాతి (ట్రస్టు)

## విన్నపం

ట్రస్టుకు ఈ క్రింది విధంగా విరాళాలనిచ్చి ప్రోత్సహించగోరుతున్నాము.

| | | | |
|---|---|---|---|
| ప్రోత్సాహకులు | రు. 10,000/-లు | పోషకులు | రు. 25,000/-లు |
| విశిష్ట పోషకులు | రు. 50,000/-లు | రాజ పోషకులు | రు. 1,00,000/-లు |

వీరికి ప్రతినెలా పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.
వీరి ఫొటోతో క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి.
యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.
అకౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136

| **పారుపల్లి కోదండరామయ్య** | **డా॥వెన్నిసెట్టి సింగారావు** | **స.వెం.రమేశ్** | **సామల లక్ష్మణబాబు** |
|---|---|---|---|
| ట్రస్టీ, 9505298565 | ట్రస్టీ, 9393015584 | ట్రస్టీ, 8500548142 | ట్రస్టీ, 9440448244 |

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివశిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరుగుతున్నది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు ఈ దిశగా పనిచేస్తున్నారు. ఇందుకు తగ్గవిధంగా ఇంకా సమగ్రంగా, బలంగా ఒక పత్రికను, దానితోపాటు కొన్ని పుస్తకాలను ప్రచురించవలసిన అవసరం ఏర్పడింది. కొన్ని కార్యక్రమాల్ని కూడా చేపట్టవలసివుంది. ఇందుకోసం ఇప్పుడు 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును రిజిస్ట్రేషన్ చేయించాము. (92/2014).

తెలుగువారు అన్ని రంగాల్లో ముందడుగు వేసేందుకు తోడ్పడటమే ఈ ట్రస్టు లక్ష్యం. తెలుగు 'అమ్మనుడి'గా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది. ఆంధ్రప్రదేశ్, తెలంగాణాలలోనే కాక ఇతర రాష్ట్రాల్లోనూ, ఇతర దేశాల్లో వున్న తెలుగు ప్రజలకోసం ట్రస్టు పనిచేస్తుంది.

'నడుస్తున్న చరిత్ర' 2013 అక్టోబర్‌తో నిలిచింది. దానిని మరింత సమగ్రంగా **'అమ్మనుడి'** పేరుతో పత్రిక ప్రచురణను మొదలుపెట్టాము. **2015** మార్చి, ఏప్రిల్, మే, జూన్ సంచికలను ప్రచురించాము. ఇప్పుడు మీ చేతిలో ఉన్నది జూలై నెల సంచిక. మీ అందరి తోడ్పాటుతో పత్రిక ప్రచురణ కొనసాగుతుంది. పుస్తకాల ప్రచురణ కార్యక్రమంలో తొలుతగా స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'** విడుదల చేశాము. తక్కిన కార్యక్రమాలను కూడా కాలక్రమంలో చేపడతాము. ఇందుకోసం ఈ ట్రస్టును బలమైన పునాదులతో, వనరులతో ఏర్పరచాలని నిర్ణయించాము. ట్రస్టుకు మీ అందరి చేయూత కావాలి. 'తెలుగుజాతి' ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.

ఇదీ ముచ్చట్లు

– లవణం

# కూతురు తెలుగుదనం - తల్లి గొప్పతనం



**నేను** పెంచుకున్న అమ్మాయి రత్న వివాహం ఫిన్లండ్ దేశానికి చెందిన పెర్తి హోలోపైనన్‌తో 2000 డిశంబరులో జరిగింది. పెర్తి ఫిన్లండుకు ప్రక్కదేశమైన స్వీడన్ రాజధాని స్టాక్‌హోంలో జర్నలిస్టుగా పనిచేస్తున్నారు. వివాహం అయిన వెంటనే రత్న కూడా భర్తతో స్టాక్‌హోం వెళ్ళింది.

నేను వాళ్ళ దగ్గరకు వెళ్ళినప్పుడు – ఐదారేళ్ల వయస్సు గల నా మనుమరాలితో... సమైక్య... నేను తెలుగులోనే మాట్లాడేవాడిని. ఒకసారి టాబ్లెట్లు తీసుకురామ్మా అని అన్నాను. టాబ్లెట్లు అంటే అని అడిగింది. మెడిసిన్, మందులు అన్నాను. మళ్ళీ అంటే అంది. నేను రోజూ బిళ్ళలు వేసుకుంటాను కదా అవీ అన్నాను. 'ఔషధాలా' అంది. నేను ఆశ్చర్యపోయాను. మందులు అనే పదం కూడా కాకుండా, ఔషధం అనే పదం రత్న ఎందుకు నేర్పింది అని రత్నని అడిగాను. దానికి ఒత్తులు పలకడం కూడా రావాలి కనుక ఇలాంటి వాటికి సంస్కృత పదాలు నేర్పాను. నేనే తనతో మాట్లాడుతాను కనుక మందులకు నేను తనతో ఔషధం అనే మాట్లాడతాను అంది.

రత్న కూతురికి తెలుగు పద్యాలు, పాటలు కూడా రావాలని వేమన పద్యాలు కొన్ని నేర్పింది. ఏదీ తాతగారికి ఓ పద్యం పాడి వినిపించు అని రత్న అనగానే "ఉప్పు కప్పురంబు ఒక్క పోలిక నుండు...." అంటూ పద్యం అంతా చక్కగా ప్రతీ వత్తును పలుకుతూ తెలుగులో వినిపించింది. నేను ఆశ్చర్యపోయాను.

నేను ఇంకా ఎక్కువ ఆశ్చర్యపోయింది : తండ్రితో మాట్లాడేటప్పుడు ఫిన్నిష్ మాట్లాడేది. క్షణంలో తల్లి వైపు తిరిగి తల్లితో మాట్లాడేటప్పుడు తెలుగు మాట్లాడేది. ఫిన్నిష్-తెలుగు, తెలుగు-ఫిన్నిష్ ఇలాగ రెండు భాషలూ అటూ ఇటూ మాట్లాడుతూవుంటే నా ఆనందానికి అంతు లేకపోయింది. తండ్రి భాష, తల్లి భాష రెండూ తనకు సమానమే. అంతేకాక తెలుగులో పాటలు కూడా నేర్చుకుంది. తల్లి సినిమా కేసెట్లు, పాటల క్యేసెట్లు భారతదేశం నుంచి తీసుకువెళ్లి తరచు కూతురికి చూపించేది. దీనితో ఆ రోజుల్లో 'గోరింటాకు' అని ఒక సినిమా వచ్చింది. తనకి గోరింటాకు పెట్టుకోవటం చాలా ఇష్టం.

భారతదేశం వచ్చినపుడు వాళ్ళ పెద్దమ్మ కూతురు తాను గోరింటాకు పెట్టుకుంటూ మెహందీ పెట్టుకుంటావా అని అడిగింది. దానికి నా మనుమరాలు మెహందీ అంటావేంటి గోరింటాకు కదా అంది. నాకే కాక అక్కడ వున్న అందరికీ తెలుగుపై దానికి గల శ్రద్ధను చూసి ఆశ్చర్యం, ఆనందం రెండూ కలిగాయి.

స్వీడన్‌లో స్వీడిష్ భాష మాట్లాడుతారు. ఈ వివాహం వల్ల ఇది త్రిభాషాసంగమంగా మారింది. తెలుగు, ఫిన్నిష్, స్వీడిష్. ఈ సంగమం మనకు వాళ్ళ అమ్మాయి 'హెల్మి సమైక్య' లో కనబడుతుంది. చిన్నప్పుడు తన మీద ఎక్కువ ఫిన్నిష్ భాష ప్రభావమే వుండేది. ఎందుకంటే తండ్రి, బంధువులు తరచు వస్తూ వుండేవారు. తల్లి ఒక్కర్తే తెలుగు మనిషి కనుక తన కూతురుకు మాతృభాష కూడా రావాలని చిన్న చిన్న పదాలు, వాక్యాలు నేర్పుతూ వుండేది.

రాను రాను అమ్మాయి తనతో మాట్లాడగలిగే స్థాయికి తెలుగును తీసుకువచ్చింది. తల్లి తప్ప ఇక ఎవ్వరూ తనతో తెలుగు మాట్లాడరు కనుక తాను తరచు తెలుగుపదాలు మర్చిపోతూ వుండేది. వాళ్ళు ఇండియా వచ్చినప్పుడు ఇక్కడ అందరితోటి తెలుగు మాట్లాడటం వల్ల వెళ్ళే సమయానికి తెలుగు బాగా మాట్లాడగలిగేది.

ఒకసారి సమైక్య నాతో అంది... నాన్నగారి కుటుంబీకులు ఎక్కువమంది మా దగ్గరకు వస్తారు. మీరు ఎందుకు రారు అని అడిగింది. మేము మరి చాలా దూరంగా వున్నాం గద. మీ నాన్నగారి కుటుంబీకులు మీకు ప్రక్కనే వున్నారు. అంతేకాక మీరు కూడా తరచు అక్కడకు వెళుతూ వుంటారు కదా. ఇండియా మీరు రెండు సంవత్సరాలకు గాని రారు అనేటప్పటికి వెంటనే ఇండియా కాదు భారతదేశం అనాలి అంది. ఇలాంటివి ఎన్నో... నా మనవరాలి నోటి వెంట వింటూ వుంటే నేను తన దగ్గర ఎంత నేర్చుకోవాలో అనుకున్నాను!

విదేశంలో పుట్టి, విదేశంలో పెరుగుతున్న నా మనుమరాలు 'సమైక్య'కు తెలుగుమీద ఎంత అభిమానం, ఎంత గౌరవం. ప్రతి ఒక్కరం మన పిల్లలకు ఇలాగే తెలుగు నేర్పిస్తే, ఇక్కడ పుట్టి, ఇక్కడ పెరుగుతున్న వాళ్ళు ఇంగ్లీషు తప్ప, తెలుగు మాట్లాడలేని స్థితి రాదు కదా!

విదేశాలలో వుండి కూడా మాతృభాషయైన తెలుగును బ్రతికిస్తుంటే, ఇక్కడ మనం ఇంగ్లీషు వ్యామోహంలో పడి తెలుగును మరుగున పడేస్తున్నాం. కొంచెం ఆలోచిద్దాం.....

ఫోన్ : 9848598410

సంపుటి : 1 సంచిక : 5
అమ్మనుడి
జూలై 2015

సంపాదకీయం

# తెలుగు అభివృద్ధి - తెలుగు రాష్ట్రాల బాధ్యత

**తె**లుగు అభివృద్ధి – తెలుగు రాష్ట్రాల బాధ్యతే. కానీ, మన రెండు రాష్ట్రాల ప్రభుత్వాలు ఆ బాధ్యతను విస్మరించాయి.

భాషా రాష్ట్రాల ఏర్పాటులో భాగంగా తొలుత ఆంధ్రరాష్ట్రం ఏర్పడి, తర్వాత తెలంగాణను కలుపుకొని విశాల రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ ఏర్పడింది. ఒక భాషాజాతిగా తెలుగువారు అన్ని విధాలా ఎదగడంకోసమే ఆ ఏర్పాటు జరిగింది. తమ అమ్మనుడి తెలుగులో తమను తాము పరిపాలించుకోవాలనేది ఆ రాష్ట్రం ఏర్పాటులోని ప్రజాస్వామ్య ప్రాథమిక సూత్రం. తమ భాషను ఎంత ఎత్తుకైనా ఎదిగించుకొంటూ దానిద్వారా సర్వ విజ్ఞానాన్నీ అందుకోవాలని, అందుకు తగ్గట్లు విద్యారంగాన్ని తీర్చిదిద్దుకోవాలనేది రాజ్యాంగ బద్ధమైన లక్ష్యం. తెలిసిన భాష (అమ్మనుడి) ద్వారా తెలియని దానిని తెలుసుకోవాలనే సామాన్య సూత్రమే భాషా రాష్ట్రాల ఏర్పాటుకు పునాది.

ఈ లక్ష్యాలకే ముప్పు కలిగే విధంగా 60 ఏళ్లపాటు సాగిన ప్రభుత్వాల, వాటిని నడిపించిన పార్టీల, నాయకుల దుర్మార్గపు చర్యల వల్లనే రాష్ట్రం రెండుగా విడిపోయింది. ఒకప్రాంతపు నాయకులు స్వాభిమానాన్ని గురించి మాట్లాడితే మరొక ప్రాంతపు నాయకులు సమైక్యత గురించి మాట్లాడారు తప్ప ఇరువైపుల నేతల లక్ష్యం అధికారమే. రెండు రాష్ట్రాల ప్రభుత్వాలు ఏర్పడి ఏడాది దాటినా ఇంతవరకు ఆ నేతల తీరులో ఏమీ మార్పులేదు. తమ రాష్ట్రాల అభివృద్ధికి సంబంధించిన మౌలిక అంశాలపట్ల వారు చూపు సారించడంలేదు.

పేరుకు ఇప్పుడు తెలుగు వారికి రెండు రాష్ట్రాలున్నట్లు లెక్క. రెండు తెలుగు రాష్ట్రాలు అనే మాట వార్తా ప్రసార సాధనాల్లో ప్రతి దినమూ వినబడేమాట. జాతీయ అంతర్జాతీయ స్థాయుల్లో మంచీ చెడులేవి జరిగినా, అవి ఏ కార్యక్రమాలైనా అందులో ఈరెండు రాష్ట్రాలనుండి పాల్గొనే వారిని తెలుగువారిగానే పేర్కొంటున్నారు. కాని, ఈ రెండు రాష్ట్రాల ప్రభుత్వాలూ తమవి తెలుగు రాష్ట్రాలనే స్పృహను కోల్పోయాయి. తమ అమ్మనుడిలో పరిపాలనను గురించిగాని, విద్యారంగంతో సహా తక్కిన అన్ని రంగాలలో భాషా వినియోగం గురించి గాని, నేటి ఆధునిక అవసరాలకు తగ్గట్లు భాషను పెంపు చేసుకోవడం గురించిగాని ఈ రెండు ప్రభుత్వాల నేతలూ స్పష్టంగా ఏమీ మాట్లాడటం లేదు.

తెలుగు భాషోద్యమకారులు, ఇతర సంఘాలు చేసిన నిరంతర పోరాటంవల్ల 2013 డిసెంబరు 31న జి.ఒ.ఎం.ఎస్.నెం:909 వచ్చింది. (దానిని జూన్ సంచికలో ప్రచురించాము.) దాని ప్రకారం 'తెలుగు భాష అభివృద్ధికోసం' ప్రత్యేకంగా మంత్రిత్వశాఖను ఏర్పరిచారు. దానిపేరు 'భాష మరియు సంస్కృతిశాఖ'. 2014 ఎన్నికల తర్వాత ఏర్పడిన రెండు రాష్ట్రాల ప్రభుత్వాల్లో ఈ శాఖలు ఏర్పడ్డాయి. కాని, ఆ శాఖలకు కావలసిన విధాన నిర్ణయాలు, నిధుల కేటాయింపు, కార్యక్రమ యోజన ఇంతవరకూ జరగలేదు. అందువల్ల ఆ శాఖలు ఏర్పడి ఏడాది గడుస్తున్నా అవి పనిలేకుండా ఉన్నాయి. విచిత్రమేమిటంటే ఆంధ్రప్రదేశ్‌లో చంద్రబాబు ప్రభుత్వం ఏర్పడిన తరువాత ఇంతవరకు వచ్చిన బడ్జెట్లలో కాలం చెల్లిన 'యువజనాభివృద్ధి, పర్యాటకం, సాంస్కృతికశాఖ' పేరునే కేటాయింపులు జరిగాయి. 'భాషాసాంస్కృతిక' శాఖ ప్రత్యేకంగా ఏర్పాటయిందన్న

స్పృహ ప్రభుత్వానికి లేకపోయింది. ఆ జి.ఒ. సాధనకోసం పనిచేసిన తెలుగు భాషోద్యమ సమాఖ్య ఈ విషయమై నిరసన తెలిపినా పట్టించుకొనేవారే లేరు. ఆ ప్రభుత్వంలో బాధ్యులు ఎవరూ ఈ విషయమై నోరు విప్పలేదు. సాక్షాత్తూ ఆశాఖ మంత్రిగారే మౌనం వహించారు. మరి, ఇక ఆశాఖ పని మొదలుపెట్టేదెప్పుడు? అయితే, తెలంగాణ పరిస్థితి కూడా ఇందుకు భిన్నంగా లేదు.

తెలుగు అభివృద్ధి కావాలి అంటే నేటి అవసరాలను తీర్చగల స్థాయిలో భాష సామర్థ్యాన్ని పెంచుకోవాలి. అందుకవసరమైన వనరుల్ని, వ్యవస్థల్ని ఏర్పరచుకోవాలి. నిపుణుల నిర్వహణలో వ్యవస్థల్ని పటిష్టం చేసుకోవాలి.

పరిపాలన, విద్యారంగాల్లో – శాస్త్ర, సాంకేతిక అవసరాలకు కూడా తగ్గ విధంగా – భాషను, సాంప్రదాయక విజ్ఞానాన్ని, సంస్కృతిని ఆధునిక ప్రపంచానికి అందించగలగాలి. ఇంతటి గురిలేకుండా, ఏ కార్యక్రమాలను ఆ శాఖ చేపట్టగలుగుతుంది? స్వంతభాషను ఈ స్థాయికి పెంచుకొనే ఆలోచనలు చేయకుండా (తెలుగుకు ఆ సామర్థ్యం ఉంది), పూర్తిగా ఇంగ్లీష్‌లో తెలుగు ప్రజలందరినీ పండితుల్ని చేద్దామనుకోవడం, చెయ్యగలమనుకోవడం, అన్యభాషలే తెలుగుకు దిక్కు అనీ, తెలుగు దిక్కుమాలిన భాష అనీ అనుకోవడం ప్రజాద్రోహం. ప్రజాస్వామ్య ద్రోహం.

ప్రభుత్వాలకు భాషాభివృద్ధి బాధ్యత లేదన్నట్లు కొందరు మాట్లాడుతుంటారు. సాహిత్యాభివృద్ధి, ప్రచారం మాత్రమే తెలుగు సేవ అనుకొంటూ ఒక భ్రమలో తాము జీవిస్తూ అందరికీ అదే దారి చూపుతుంటారు. ఇది ఆత్మవంచన మాత్రమే. అన్ని రంగాల అభివృద్ధినీ సమాజంలోని అట్టడుగువర్గాలదాకా అందేట్లు చేయగలవిధంగా అమ్మనుడిని ఎదిగించే బాధ్యత ప్రభుత్వానిదే. అందుకు మేధావులను, నిపుణులను ప్రభుత్వం వినియోగించుకోవాలి. ప్రభుత్వ ప్రమేయం లేకుండా ఈ ఆధునిక యుగంలో భాషను పెంపొందించుకోగలమని చెప్పడం బాధ్యతను విస్మరించి మాట్లాడడమే.

ఇప్పుడు రెండు రాష్ట్రాల ప్రభుత్వాలూ పారిశ్రామికాభివృద్ధి గురించీ, విదేశీ పెట్టుబడుల గురించీ, నేలపై స్వర్గ సుఖాలను సృష్టించడం గురించీ ఎంతగా పోటీపడుతున్నారో – అందులో కొంత మాత్రంగానైనా తెలుగు అభివృద్ధి విషయంలో పోటీపడాలి. పోటాపోటీగా వ్యవస్థలను పటిష్టం చేసుకొంటూ అవసరమైనచోట్ల పరస్పర సహకారంతో సమన్వయంతో ముందుకు సాగాలి. ఈవిషయమై ఏమీ చేయకుండా అమరావతి రాజధానిగా ఒక అధునాతన సామ్రాజ్యాన్ని నిర్మాణం చేస్తామంటున్న చంద్రబాబుగారుగాని, తెలంగాణ ఆత్మగౌరవాన్ని, సంస్కృతిని పునరుజ్జీవింప చేస్తామంటున్న చంద్రశేఖరరావుగారుగాని– గాలిమేడల్లో తాము విహరిస్తూ – ప్రజలను ఆశలపల్లకిపైకి ఎక్కించడమే అవుతుంది తప్ప వాళ్ళ వాగ్దానాలు నిజం కాజాలవు.

తెలుగు భాషా సాంస్కృతిక మంత్రిత్వశాఖ ఏర్పాటు ఉత్తర్వులో పేర్కొన్న అంశాలు చాలా ఉన్నాయి. ముందుగా రెండు రాష్ట్ర ప్రభుత్వాలూ తమ తమ రాష్ట్రాల్లో భాషా మంత్రిత్వశాఖలు చేపట్టవలసిన కార్యక్రమం గురించి స్పష్టత కోసం, భాషా విధాన నిర్ణయంకోసం నిపుణుల సంఘాల్ని – నిర్ణీతకాలంలో ప్రతిపాదనలిచ్చేవిధంగా – నియమించాలి. వారి సిఫారసుల అమలుకు సిద్ధపడాలి. ఇందుకు ప్రభుత్వ నేతలను ఒప్పించడానికి భాషోద్యమకారులతోపాటు ప్రభుత్వంలోనూ బయటా ఉన్న భాషాభిమానులంతా ఉద్యమించాలి. ప్రభుత్వంపై ఒత్తిడి తేవాలి.

ప్రత్యేక మంత్రిత్వ శాఖను పటిష్ఠంగా పనిచేయించగలిగితేనే ఆ శాఖ ఏర్పాటు చేసిన ఫలితం దక్కుతుంది. ఉద్యమాలు చేయకుండా ప్రభుత్వాన్ని పనిచేయించగలమనుకోవడం కల మాత్రమే. భాషోద్యమాన్ని ఇప్పుడు బలంగా కొనసాగించవలసిన అగత్యం ఏర్పడింది. తెలుగును రక్షించుకోవాలనుకొనేవారంతా ఇప్పుడు సమైక్యంగా ముందుకు కదలాలి.

**3-7-2015**

సామల రమేష్‌బాబు

- శ్రీ చలసాని నరేంద్ర

# తెలుగు రాష్ట్రాలమధ్య కుదరని సయోధ్య... ఎడతెగని విభేదాలు

**తెలంగాణ ముఖ్యమంత్రి కె చంద్రశేఖర్ రావు పై ఆంధ్రప్రదేశ్ లో 87 కేసులను నమోదు చేసి, వాటి దర్యాప్తుకు ప్రత్యేక దర్యాప్తు బృందాన్ని నియమించారు. మరో వంక ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి యన్ చంద్రబాబు నాయుడు, మరో నలుగురు మంత్రులపై హైదరాబాద్‌లో కోర్టు ద్వారా కేసు నమోదు చేయించారు. సమాఖ్య విధానంలో రాష్ట్రాల మధ్య ఏర్పడే సమస్యలను పరిష్కరించుకొనే మార్గం ఇదా ? కీలక పదవుల్లో ఉన్న నాయకులు రాజకీయ విజ్ఞత ప్రదర్శించడం, బాధ్యతాయుతంగా వ్యవహరించడం ద్వారా మాత్రమే ప్రస్తుతం నెలకొన్న సందిగ్ధత నుండి బైటపడగలము.**

**రాష్ట్ర** విభజన జరిగి, రెండు తెలుగు రాష్ట్రాలు ఏర్పాటై 13 నెలలు గడిచాయి. కొత్తగా ఏర్పడుతున్న రాష్ట్రాల్లో వేగవంతమైన అభివృద్ధి సాధించి, ప్రజలు ఎదుర్కొంటున్న సమస్యలు పరిష్కరించి వారికి ఉజ్వల భవిష్యత్తు కలిగిస్తామని ఎన్నికలలో ఎన్నో ఆశలు కలిగించిన పార్టీలు రెండు రాష్ట్రాల్లో అధికారం చేబట్టాయి. విశేష రాజకీయ అనుభవం గల ఇద్దరు ముఖ్యమంత్రులు పరస్పరం అవగాహనతో, సహకార ధోరణితో రెండు రాష్ట్రాల అభివృద్ధి కోసం కృషి చేయగలరని ప్రజలు ఆశించారు. అయితే పరిస్థితులు ఉన్నకొలదీ దిగజారడం ఆందోళన కలిగిస్తున్నది.

రెండు ప్రభుత్వాల మధ్య అంతంత మాత్రంగానే ఉన్న సంబంధాలు 'నోటు కు వోటు' కేసు లో తెలంగాణ తెలుగుదేశం పార్టీ శాసనసభ్యుడు రేవంత్ రెడ్డి అరెస్ట్ అయినప్పటి నుండి మరింత విషమ పరిస్థితులకు దారితీస్తున్నాయి. రెండు తెలుగు రాష్ట్రాల ముఖ్యమంత్రులు పరిపాలనపై, ప్రజా సమస్యలపై పూర్తిగా దృష్టి పెడుతున్న దాఖలాలు కనిపించడం లేదు. పరస్పరం రాజకీయ ఎత్తుగడలతో, ఒకరిపై మరొకరు దెబ్బ తీయాలనే ఆరాటంతో, కీలక అంశాల నుండి ప్రజల చూపును మళ్ళించే ప్రయత్నాలతో కాలం గడుపుతున్నారు. పక్క రాష్ట్రం ముఖ్యమంత్రిని ఏ కేసులో ఇరికించాలా అనే వ్యూహాలతో రోజులు గడుపుతున్నారు.

రేవంత్ రెడ్డి పట్టుబట్టిన కేసుకు సంబంధించిన దర్యాప్తును పోలీస్‌లకు, కోర్టులకు వదిలి వేయకుండా రాజకీయంగా పరస్పరం ఎత్తుకు పై ఎత్తు అనే రీతిలో రెచ్చగొట్టుకొనే విధంగా చేస్తూ ఉండడంతో ఇదంతా ఒక పెద్ద రాజకీయ ఎత్తుగడల్లో భాగంగా జరిగిందా అనే అనుమానాలు కలుగుతున్నాయి. ఈ విషయమై రెండు రాష్ట్ర ప్రభుత్వాలు, అధికార పక్షాలు వ్యవహరిస్తున్న తీరు ప్రజలు హర్షించే విధంగా లేదని చెప్పవచ్చు.

చట్టం తన పని తాను చేసుకు పోతుందని పైకి అంటున్నారు. తాము రాజకీయ వత్తిడులను దర్యప్తు అధికారులపై తీసుకు రావడం లేదని అంటూనే ప్రతి రోజూ పక్క రాష్ట్రానికి చెందిన వారిపై నమోదు చేసిన, చేయవలసిన కేసుల గురించి సమీక్షల మీద సమీక్షలు జరుపుతున్నారు. రెండు రాష్ట్రాల డి జి పి లు, ఏ సి బి అధిపతులు, నిఘా విభాగ అధిపతులు, ప్రధాన కార్యదర్శులు ప్రతి రోజూ సమీక్షలు జరుపుతున్నారు. తరచూ ముఖ్యమంత్రులను కలుస్తున్నారు. ఇదంతా చూస్తుంటే రెండు ప్రభుత్వాల మధ్య అప్రకటిత యుద్ధం జరుగుతున్నట్లు అనిపిస్తున్నది.

నిన్న, మొన్నటి వరకు కలసి మెలసి పని చేసిన, ఒకే బ్యాచ్ కు చెందిన ఉన్నత అధికారులు ఇప్పుడు శత్రు శిబిరాలకు చెందిన సిపాయల వలే వ్యవహరిస్తున్నారు.

'నోటు కు వోటు' కేసు లో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి యన్ చంద్రబాబు నాయుడు ప్రధాన ముద్దాయి అని, బ్రహ్మరుద్రాదులు అడ్డు పడినా శిక్ష పడకుండా ఆయనను తప్పించలేరని తెలంగాణ ముఖ్యమంత్రి కె చంద్రశేఖర్ రావు బహిరంగంగానే హెచ్చరికలు జారీ చేస్తున్నారు.

ఆంధ్ర ప్రదేశ్ ముఖ్యమంత్రి, మంత్రులు, ఉన్నత అధికారులు, పార్టీ ప్రముఖుల ఫోన్ లను ట్యాప్ చేసిన కేసులో తెలంగాణ ముఖ్యమంత్రి పదవి పోగొట్టుకోవడం ఖాయం అంటూ ఆంధ్ర ప్రదేశ్ మంత్రులు తరచూ శాపాలు పెడుతూనే ఉన్నారు. ఇటువంటి అంశాలపై తగు సాక్ష్యాధారాలు ఉంటే న్యాయస్థానాల ముందు ఉంచవచ్చు. అట్లా చేయకుండా ప్రకటనలు చేయడం దర్యాప్తు ఏజెన్సీ లను ప్రభావితం చేయడమే అవుతుంది.

పరస్పరం తమ హోదాలు మరచి, తమ బాధ్యతలు మరచి పోయి వ్యక్తిగత ఇబ్బందులను, రాజకీయ సవాళ్ళను రెండు రాష్ట్రాల ప్రజల మధ్య వివాదాలుగా, వారి మధ్య విద్వేషాలు రెచ్చగొట్టే అంశాలుగా మార్చే ప్రయత్నం చేస్తున్నారు. రెండు ప్రభుత్వాల మధ్య ఇటువంటి

ఉద్రిక్తతలు, వివాదాలు, అపోహలు తలెత్తినప్పుడు రాజ్యాంగ పరిరక్షకునిగా వ్యవహరించవలసిన గవర్నర్ ఇ యస్ యల్ నరసింహన్ ప్రేక్షకపాత్ర వహిస్తూ ఉండటం, ప్రతి అంశాన్ని కేంద్ర ప్రభుత్వానికి నివేదించడం మాత్రమే తన కర్తవ్యం అనే విధంగా వ్యవహరిస్తూ ఉండడం మరిన్ని గందరగోళ పరిస్థితులకు దారి తీస్తున్నది.

రెండు ప్రభుత్వాల వ్యవహారాలను గమనిస్తూ, వాటి మధ్య సయోధ్య కోసం, అవగాహన కలిగించడం కోసం, సాధ్యం కాని పక్షంలో చట్టబద్ధంగా ఒక నిర్ణయం తీసుకొనే సౌలభ్యం చట్టం కల్పించినా అందుకు అవసరమైన చొరవ గవర్నర్ తీసుకోవడం లేదు. అందుకనే కేంద్ర హోం శాఖ మంత్రి రాజ్‌నాథ్ సింగ్ గవర్నర్‌ను ఢిల్లీకి పిలిపించి క్రియాత్మక పాత్ర వహించాలని, చట్టబద్ధంగా రెండు రాష్ట్రాల మధ్య సంబంధాలు ఉండే విధంగా చూడాలని సూచించినట్లు తెలుస్తున్నది.

సమాఖ్య వ్యవస్థలో రాష్ట్రాలకు స్వతంత్ర నిర్ణయాలు తీసుకొనే అవకాశాలు ఉన్నా దేశంలో మరెక్కడా లేని విధంగా ఒకే నగరం రెండు రాష్ట్రాలకు ఉమ్మడి రాజధానిగా పదేళ్ళపాటు కొనసాగే సదుపాయాన్ని చట్టబద్ధంగా కల్పించారు. ఈ సందర్భంగా ఆచరణలో కొన్ని ఇబ్బందులు ఎదురైతే గవర్నర్ చొరవ తీసుకొని వాటిని పరిష్కరించే దిశగా కృషి చేయవలసిందే. ప్రజాస్వామ్యంలో రాష్ట్రాల మధ్య ఏర్పడే వివాదాలను కేంద్ర ప్రభుత్వం జోక్యం చేసుకొని తీర్పు చెప్పే ప్రయత్నం చేయడం సాధ్యం కాదు. పరస్పరం సమాలోచనల ద్వారా మాత్రమే పరిష్కరించుకొనే ప్రయత్నం జరగాలి. అందుకు గవర్నర్ సంధాన కర్తగా వ్యవహరించాలి. చివరకు ఉన్నత న్యాయస్థానాలు తీర్పులు ఇచ్చినా రాష్ట్ర ప్రభుత్వాల సహకారం లేకుండా అమలు సాధ్యం కాదు.

హైదరాబాద్ ఉమ్మడి రాజధాని అయినా అది తెలంగాణ రాష్ట్రంలో భాగమే. అందుచేత సమస్యల పరిష్కారం కోసం కొంత ఉదారంగా వ్యవహరించవలసిన బాధ్యత ఆ రాష్ట్ర ప్రభుత్వానికి ఉంటుంది. రెండు రాష్ట్రాలు ఇచ్చిపుచ్చుకొనే ధోరణిలో వ్యవహరిస్తే ఎటువంటి సమస్యలు ఉండవు. కృష్ణా నదీ జలాలను పంచుకోవడంలో గత సంవత్సరం రెండు రాష్ట్రాల మధ్య నానా రభస జరిగింది. అయితే ఈ సంవత్సరం కేంద్ర అధికారులు రెండు రాష్ట్రాల నీటిపారుదల శాఖల అధికారులను ఢిల్లీకి పిలిపించి, రెండు రోజుల పాటు సుదీర్ఘ సమాలోచనలు జరపడంతో రెండు రాష్ట్రాలు ఒక అవగాహనకు రావడం గమనార్హం. పరస్పరం చర్చలు జరుపుకొంటే అన్ని సమస్యల పట్ల ఒక అవగాహనకు రావడం కష్టం కాదు.

అయితే పలు అంశాల్లో రెండు ప్రభుత్వాలు ఒంటెత్తు పోకడలు అవలంభిస్తూ ఉండడం వలననే రెండు రాష్ట్రాల మధ్య ఉద్రిక్త పరిస్థితులు నెలకొంటున్నాయి. దానితో సమస్యలు మరింతగా జటిలం అవుతున్నాయి. ఈ వివాదాల మధ్య అకస్మాత్తుగా సెక్షన్ 8 ఒక పెద్ద వివాదంగా మారిపోయింది. దీనిని అమలు చేయనే చేయకూడదని తెలంగాణ ప్రభుత్వ నేతలు స్పష్టం చేస్తూ ఉంటే, అమలు జరుపవలసిందే అంటూ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ నేతలు కాలు దువ్వుతున్నారు.

ఆంధ్రప్రదేశ్ పునర్విభజన చట్టం అమలులోకి రావడం వలననే రాష్ట్ర విభజన జరిగి, రెండు రాష్ట్రాలు ఏర్పడ్డాయి. అంటే ఆ చట్టంలోని అన్ని అంశాలు అమలులో ఉన్నాయని అర్థం. ప్రత్యేకంగా ఒకొక్క సెక్షన్ అమలుకు ఉత్తరువులు చేయవలసిన అవసరం లేదు. ఈ విషయాన్నే హైకోర్టు సహితం స్పష్టం చేసింది. పైగా ఈ సెక్షన్ అమలు తెలంగాణ ప్రభుత్వ సలహాలపైన గవర్నర్ అమలు చేయాలి. గవర్నర్ ప్రభుత్వ సలహాను గుడ్డిగా అమలు చేయకుండా తన విచక్షణను ఉపయోగించుకొనే సౌలభ్యం ఈ చట్టం కల్పిస్తున్నది. ఈ ప్రక్రియలో ఎక్కడా ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ ప్రస్తావన లేదు.

సెక్షన్ 8 ని తెరపైకి తీసుకు రావడం ద్వారా రేవంత్ రెడ్డి అరెస్ట్ వెనుక ఉన్న కీలకమైన రాజకీయ రుగ్మత – పార్టీ ఫిరాయింపులను ప్రోత్సహించడం – మరుగున పడుతున్నది. ఒక పార్టీ అభ్యర్థిగా ఎన్నికై బహిరంగంగానే మరో పార్టీ సభ్యుడిగా వ్యవహరిస్తూ రాజ్యాంగ నిబంధనలను తుంగలో తొక్కి ప్రజాస్వామ్యాన్నే అపహాస్యం చేస్తున్నారు. ఒక యంయల్ఏ వోటు కోసం కొంత డబ్బు ఇవ్వ జుపుతూ రేవంత్ రెడ్డి పట్టుబడితే, ఒక పార్టీ శాసన సభ్యుడు మరో పార్టీ మంత్రివర్గంలో చేరడం, గవర్నర్ అతని చేత ప్రమాణ స్వీకారం చేయించడం రాజకీయంగా పతనావస్థకు చేరుకోవడమే. ఇందుకు బాధ్యులు ఎవ్వరు?

ప్రలోభాలకు గురిచేసి పార్టీ ఫిరాయింపులను ప్రోత్సహించడంలో ఒక పార్టీని మాత్రమే నిందించలేము. 1995 నుండి అప్రతిహతంగా ఉమ్మడి ఆంధ్రప్రదేశ్‌లో జరుగుతూనే ఉన్నది. ఫిరాయింపుల నిరోధక చట్టం అమలు జరుపవలసిన శాసన సభాపతులు అధికారపక్షం అధికార ప్రతినిధుల వలె వ్యవహరిస్తూ ఆ చట్టానికి తూట్లు పొడుస్తున్నారు.

గవర్నర్ సహితం సాధ్యమైనంత వరకు ఏకాభిప్రాయ సాధనకే ప్రజాస్వామ్యంలో ప్రయత్నం చేస్తారు గాని ఏకపక్షంగా ఒక నిర్ణయం తీసుకొని రాష్ట్రాల మీద రుద్దే ప్రయత్నం చేయలేరు. తమ పరిపాలన వైఫల్యాల నుండి ప్రజల దృష్టి మళ్ళించడం కోసమే రాష్ట్ర ప్రభుత్వాలు ఈ విధంగా ఉద్రిక్త పరిస్థితుల కల్పన కోసం ప్రయత్నం చేస్తున్నాయా అనే అనుమానాలు ఈ సందర్భంగా కలుగుతున్నాయి.

విద్యుత్తు శాఖలో చట్టబద్ధంగా తెలంగాణకు చెందిన వారుగా నిర్ణయించిన ఉద్యోగులు ఆంధ్ర ప్రదేశ్‌కు వెళ్లి పోవాలని తెలంగాణ ప్రభుత్వం ఆదేశించడం, హైకోర్టు ఉత్తర్వులను లెక్క చేయకుండా వారిని రిలీవ్ చేసేసి, వారితో తమకు సంబంధం లేదని అనడం, వారిని తాము చేర్చుకొనే ప్రసక్తి లేదని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం చేతులు ఎత్తి వేయడం, దానితో వారు రోడ్లపై పడటం చూసాము. ఇటువంటి పరిస్థితులు ఎందుకు కలిగించాలి? చట్టబద్ధ వ్యవస్థలు కుప్పకూలి పోయాయా?

ఇక హైదరాబాద్ నగరంలోనే తాము పోలీస్ స్టేషన్‌లను ఏర్పాటు చేసుకొంటామని ఆంధ్రప్రదేశ్ ఉప ముఖ్యమంత్రి చిన్న రాజప్ప బెదిరించారు. ఇటువంటి వాఖ్యలు బాధ్యత గల మంత్రుల నుండి

కవిత

# కులంగాడి వాలకం!

దీన్ధుంపతెగ
ఎంత వద్దనుకున్నా...
ఈ కులంగాడి మతరోమాలవాలం
మనల్ని ఖిలం చేస్తూనే వుంది, చిలుంలా తొలిచేస్తూనే వుంది.
కట్టుకట్లుగా మనల్ని చుట్ట జుట్టి చుట్టేస్తూనేవుంది.
కాటేస్తూనేవుంది... కొర్రులా దిగుతూనే వుంది.
ఉచ్ఛనీచాల వున్మత్త వుద్రేకాలతో మనల్ని వుడికిల్లచేస్తూనే వుంది.
కదిలే ప్రపంచం... కదలని ప్రపంచం, కదిలీ కదలని ప్రపంచం
ప్రతిదీ పదార్థంనుంచే ప్రాణం పోసుకుందని
కళ్లింతచేసుకొని చదుంకుంటాం, పాదుంకుంటాం
పదార్థంలోని అర్థాన్ని మింగి పదాల్ని పెదాలమీద
పడక్కుర్చీ వేయించి... పటికాచుట్టి పండబెట్టాం!

నరుడూ, నరావతారం! ఓల్గా సే గంగా! నాలుకమీద నర్తిస్తాం
నరునిలోని నరతనం... పరతనం కింద పారేస్తాం
ఓల్గా సే గంగ లోని అలనీ అలనీ ఆపోశనపట్టాం
ఓలలాడిన మానవజీవన పరిణామక్రమాన్ని ఒడ్డునే వదిలేస్తాం!

అమరావతి అమరత్వాన్ని, బుద్ధునిలోని బుద్ధిమంతాన్ని
ఆవురావురుమని ఆకళింపు చేసుకున్నట్టే వుంటాంగాని
వర్ణవికృతిని మాత్రం పట్టుబట్టి తలమీదికెత్తుకుంటాం!

కులం-
వున్నోడికి కవచం- కరవాలమనీ,
పేదోడికి కచ్చడం-కపాలమనీ
కొన్నిసార్లు తెలివిడిగా అనుకుంటూనే వుంటాం.

కానీ ప్రతిసారీ-
ఏ దారి లేనట్టు, ఏదిక్కూతోచనట్టు
కులం, బలం కలవాడినే ఎగదోసి ఏలికను చేస్తాం-
పంచాయితీ నుంచి... పార్లమెంటుదాకా...
పాలకవర్గం పడగలకింద మనల్ని మనం పడదోసుకుంటూనే వుంటాం.

ఇక మతం సంగతి-సరేసరి!
ముళ్ళ కంప అని తెల్చినా దానికే చిక్కుకుంటాం, చిక్కుతాళం
వేసుకుంటాం.

భిన్నత్వంలో ఏకత్వానికి పురుడుపోసిన
ప్రజాస్వామ్య గణతంత్ర స్ఫూర్తికి ప్రాణంతీసే
ప్రతిసారం సర్వం పరి'శ్రమల' ప్రభావానికి ప్రతిబంధకమని
పోల్చేదెన్నడు?
కులమతాల మధ్య గీతలూ, రీతులూ గీసి,
మనిషి మనిషికి, పురెక్కించి, పగపెట్టే
ఈ చిరకాల 'చెరపట్లాట లెంతకాలం?
మానవీయ ఐక్యతా సోదరత్వానికి మడిచెక్క దున్నేదెపుడు?

చూపు ఆనినంత కిందికి దిగిన
అమ్మనుడి ఆకాశాన్ని ఒంటినిండా కప్పుకొని
ఏ ప్రాంతమైనా ఏదేశమైనా
తెలుగోడితో తెలుగోడు ముడిబడి
తొలకరి గీతం పాడేదెప్పుడు?

ఆరుబైట వెల్లకిలా పరుండి
పైరగాలి పీల్చినంత పారవశ్యంతో
తెలుగునుడి జాతీయతకు సాగు పగ్గాలందించేదెప్పుడు?

**- వెలుగు వెంకట సుబ్బారావు**
సెల్‌నం. 9290942433

ఆశించగలమా ? తెలంగాణ ముఖ్యమంత్రి కె చంద్రశేఖర్ రావుపై ఆంధ్రప్రదేశ్‌లో 87 కేసులను నమోదు చేసి, వాటి దర్యాప్తుకు ప్రత్యేక దర్యాప్తు బృందాన్ని నియమించారు. మరో వంక ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి యన్ చంద్రబాబు నాయుడు, మరో నలుగురు మంత్రులపై హైదరాబాద్‌లో కోర్టు ద్వారా కేసు నమోదు చేయించారు. సమాఖ్య విధానంలో రాష్ట్రాల మధ్య ఏర్పడే సమస్యలను పరిష్కరించుకొనే విధానం ఇదా ?

సమస్యలు ఎదురైనప్పుడు గవర్నర్ రెండు ప్రభుత్వ అధినేతలతో సమాలోచనలు జరుపాలి గాని తరచూ ప్రధాన కార్యదర్శులు, డి జి పి లు, నిఘా అధిపతులతో సమావేశాలు జరపడం విచిత్రంగా కనిపిస్తున్నది. గవర్నర్ కు కేంద్రం ఇద్దరు సలహాదారులను నియమించింది. ఉన్నత అధికారులతో వారు సమాలోచనలు జరపవచ్చు. అసలు గత సంవత్సర కాలంగా గవర్నర్ సలహాదారులు సమస్యల పరిష్కారంలో ఎటువంటి క్రియాత్మక పాత్ర వహించినట్లు కనబడటం లేదు. వారు సహితం పోస్ట్‌మెన్ పాత్రకు పరిమితం అవుతున్నట్లు కనిపిస్తున్నది.

కీలక పదవుల్లో ఉన్న నాయకులు రాజకీయ విజ్ఞత ప్రదర్శించడం, బాధ్యతాయుతంగా వ్యవహరించడం ద్వారా మాత్రమే ప్రస్తుతం నెలకొన్న సందిగ్ధత నుండి బైటపడగలము.

**రచయిత ఫోన్ : 9849569050**

వారసత్వం

- శ్రీమతి డి.పి. అనూరాధ

# తొలి విశ్వవిద్యాలయం - నాగార్జునకొండ

**అదో** మహానగరం ఈ మహానగరం చరిత్ర 150 సంవత్సరాలకు మించదు.. కానీ తెలుగు సాంస్కృతిక చరిత్రలో ఈ నగరం ఎంతో కీలకమైంది.. మూడు వైపులా పర్వతశ్రేణులు.. పశ్చిమదిశలో కృష్ణానది మధ్య దుర్భేద్యంగా వెలసిన నగరం ఇది.. శ్రీపర్వతం.. సెరిగిరి.. విజయపురిగా ప్రసిద్ధి చెందిన ఈ మహానగరమే నేటి నాగార్జునకొండ..

శ్రీపర్వతం విద్యావిజ్ఞానాల గని.. విశిష్టనిర్మాణాలకు కేరాఫ్ అడ్రస్.. నాగార్జున లోయ తవ్వకాలలో బయటపడిన అద్భుత కట్టడం రంగభూమి.. దీనిని క్రీస్తు శకం మూడో శతాబ్దిలో నిర్మించారు.. ఈ రంగభూమిలో వేయి మంది నాలుగు వైపులా కూర్చునేలా రాతిబల్లలు ఉన్నాయి.. ఇవన్నీ అంచెలంచెలుగా ఉండడం విశేషం.. ఇక్కడ మల్లయుద్ధాలు జరిగేవా? పల్నాటి సీమ కదా కోడిపందేలు జరిగేవా? ఈ విషయం గురించి అంతగా వివరాలు తెలియవు కానీ రంగభూమి ఓ అద్భుతాన్ని ఆవిష్కరిస్తోంది..

రోమ్ అనగానే ముందుగా గుర్తుకువచ్చేది కొలోజియం.. గ్లాడియేటర్ క్రీడలకు పెట్టింది పేరు.. ఆధునిక స్టేడియంలకు ఇన్స్పిరేషన్.. కొలోజియాన్ని క్రీస్తు శకం 1 వ శతాబ్దిలో నిర్మించారు..అంటే ఆ తరవాత సుమారు రెండొందల ఏళ్లకు మన తెలుగు నేల మీద ఇలాంటిదే నిర్మించడం విశేషం..

మన రంగభూమి కొలోజియమ్ అంత పెద్దది కాకపోవచ్చు కానీ ఆనాడు మన తెలుగు నేల మీద రోమన్ ప్రభావం ఎంతగా ఉండేదో ఇది స్పష్టం చేస్తోంది.. ఇటువంటి మరెన్నో విశేషాలకు వేదిక నాగార్జునకొండ.. ఈ కొండకు అంతకుముందు ఉన్న పేర్లు విజయపురి.. శ్రీపర్వతం.. సెరిగిరి.. దక్షిణభారత దేశంలో అత్యంత విశాలమైన





బౌద్ధక్షేత్రం ఇది.. 24 చదరపు కిలోమీటర్ల విస్తీర్ణం ఉన్న ఈ లోయలో ఒకప్పుడు 30 కి పైగా బౌద్ధారామాలు ఉండేవి.. ఇన్ని బౌద్ధారామాలు ఇక్కడ ఎందుకు వెలశాయి? అసలు శ్రీపర్వతంలో ఏముంది?

ఆచార్య నాగార్జునుడి బోధనలు అంతలా ఆకట్టాయా? ఆచార్య నాగార్జునుడి కంటే ముందే శ్రీపర్వం ప్రసిద్ధ బౌద్ధక్షేత్రం.. ఇక్కడి మహాచైత్యాన్ని క్రీస్తు పూర్వం రెండో శతాబ్దిలోనే నిర్మించినట్టుగా పురాతత్వ పరిశోధనలు తెలియజేస్తున్నాయి.. బుద్ధధాతువుపై మహాచైత్య నిర్మాణం జరిగిందని సమ్మా సంబుధన ధాతువర పరగహిత అనే శాసనం తెలియజేస్తోంది..

ప్రస్తుతం అతి సాధారణంగా కన్పించే ఈ స్థూప విశేషాలు పరిశీలిస్తే ఆశ్చర్యం వేస్తుంది.. ఈ మహాస్థూపానికి ఇటుకపునాదిపై చెక్కప్రాకారం ఉండేదట..ప్రాకారానికి నాలుగువైపులా సింహద్వారాలు ఉండేవి.. అందంపైన అలంకరణలున్న ఆధారాలు లేవు.. మొదట్లో పూర్తిగా నిరాడంబరం.. రాతిని ఉపయోగించలేదు.. పై నుండి కింది వరకు సున్నపు అద్దకం ఉండేది. క్రీస్తు శకం 3 వ శతాబ్దిలో ఇక్ష్వాకుల రాణి ఛాంతిసిరి స్థూపాన్ని పునర్నిర్మించి ఆయక వేదికలు నెలకొల్పింది.. ఈ సమయంలోనే సుందర శిల్పఫలకాలను అతికించారు.. బుద్ధుడి ధాతువులపై నిర్మించిన మహాస్థూపం కాబట్టి దేశీయంగానే కాకుండా అంతర్జాతీయంగా కూడా ప్రసిద్ధ బౌద్ధక్షేత్రం అయింది.. ఈ స్థూపం లోని బుద్ధుడి ధాతువులను ప్రస్తుతం ఉత్తరప్రదేశ్‌లోని సారనాథ్‌లోని మూలగంధి కుటీవిహార్ భద్రంగా దాచిపెట్టారు.. తెలుగునేల కంటే కూడా అక్కడే పదిలంగా ఉంటాయని భావించారేమో ఆనాటి పెద్దలు..

**దక్షిణ భారత పురాతత్వ గని**

శ్రీపర్వతంలో మహాస్థూపంతోపాటు సుమారు 130 పురాతత్వ

స్థలాలు .. మరెన్నో శాసనాలు బయటపడ్డాయి.. వీటి వల్ల నాగార్జున లోయ గురించి చాలా విషయాలు తెలిశాయి. శ్రీలంక.. కాశ్మీర.. గాంధార.. చిన. చిలాట.. తోసలి.. అపరాంత.. వంగ,.. వనవాస.. యవన.. తదితర దేశాల నుండి రాజులు.. పరివ్రాజికులు.. భిక్షణీభిక్షకులు.. విద్యార్థులు.. యాత్రికులు ఇక్కడికి వచ్చేవారు.. ఆయా దేశాల వారికి ప్రత్యేక విహారాలు ఉండేవి.. దీనికి ఉదాహరణగా సింహల విహారాన్ని చెప్పవచ్చు.. ఆనాడు థేరవాదులకు బుద్ధగయ ప్రసిద్ధ క్షేత్రం.. మహాయానులకు ధాన్యకటకం ప్రసిద్ధక్షేత్రం.. ఈ రెండు వర్గాల వారికీ శ్రీపర్వతం ప్రముఖ యాత్రాస్థలం.. శ్రీపర్వత లోయలో 20కి పైగా చైత్యగ్రుహాలు బయటపడ్డాయి.. అందులో ఒకటి శ్రీలంకకు చెందింది.. క్రీస్తు శకం 257లో ఉపాసిక బోధిసిరి సింహల విహారంలో ఓ చైత్య గృహాన్ని నిర్మించింది. ఈ చైత్య గృహాలను ఇటుకలతో నిర్మించారు. గోడలు మందంగా ఎత్తుగా ఉండేవి.. కిటికీలు ఉండేవి కావు. తలుపు మాత్రం ఒకటే.. తలుపు ముందు మెట్లు చంద్రశిలలు.. గోడల లోపలిపైపున నున్నగా సున్నం అద్ది ఉండేది..

పెద్ద విహారాలలో 30 మంది బౌద్ధభిక్షువులు ఉండడానికి వసతి ఉండేది.. సంఘారామ సముదాయాల్లో 450 మంది పరివ్రాజకులు ఒకేసారి ఉండడానికి వసతి ఉండేది..

శ్రీపర్వతంలోని ఓ విహారం గురించి ఇయం విహారే సవజాతా నియుత అని వర్ణించారు. అంటే స్నానశాల, పాకశాల, భోజనశాల, చర్చామంటపం, ఆరాధన శాలలతో అన్ని వసతులతో సర్వలక్షణంగా ఉందని అర్థం..

శ్రీపర్వతానికి సంబంధించి మరో ముఖ్య విషయం మురుగుపారుదల.. మురికి నీటిని నేలలో తవ్విన గుంటల్లోకి మళ్లించేవారు.. సివిల్ ఇంజనీరింగ్ కు సంబంధించి మన తెలుగు వారికి ఆనాడే ఇంత అవగాహన ఉండేదన్నమాట..

ప్రతి విహారంలోనూ ఓ స్థూపం ఉండేది.. దాదాపు 22 స్థూపాలు తవ్వకాలలో బయటపడ్డాయి.. కొన్ని స్థూపాల పైన స్వస్తిక్ ను నిర్మించడం విశేషం.. ఇదో కొత్త ఒరవడి.. స్వస్తిక బుద్ధుడికి గుర్తు.. నాగార్జునకొండలో ఆనాడు బౌద్ధానికి చెందిన 18 శాఖల వాళ్లు ఉండేవారట.. వివిధ శాఖల నిర్మాణాలు విడివిడిగా ఉండేవి. ఎంతో రమణీయంగా ఉన్న ఈ శ్రీపర్వతంలో ఉండిపోవాలని ఆచార్య నాగార్జునుడికి కోరిక కలిగిందట.. ఆచార్యుడి కోరిక మేరకు శాతవాహన రాజు యజ్ఞశ్రీ శాతకర్ణి ఇక్కడ ఓ పెద్ద విహారాన్ని నిర్మించాడు.. ఈ విహారాన్ని చైనా యాత్రికుడు పాహియాన్ పొలోయి అనీ హుయాన్ త్సాంగ్ పొలొమొలొకిలి అని పేర్కొన్నారు. ఈ విహారం గోపురాకారంలో ఉండేది. అయిదు అంతస్తులు ఉండేది.. అన్ని అంతస్తులతో కలుపుకుని మొత్తం 1500 గదులు ఉండేవి.. గాలీ వెలుతురూ పుష్కలంగా ఉండేవి.. నీటి వసతీ ఉండేది.. పై అంతస్తులో ఆచార్యుడి నివాసంతో పాటు ఆయన సేకరించిన గ్రంథాలతో పెద్ద గ్రంథాలయం ఉండేది..క్రీస్తు శకం 2 వ శతాబ్దిలో విశ్వవిద్యాలయంగా ఇది పేరు తెచ్చుకుంది.. భారతదేశంలో మొట్టమొదటి విశ్వవిద్యాలయం ఇదే.. ఎంతో ప్రఖ్యాతి చెందిన నలందా యూనివర్సిటీ క్రీస్తు శకం 5వ శతాబ్దికి చెందింది.. ఆనాడు ఇక్కడ బౌద్ధధర్మంతో పాటు జైనం వేదవేదాంగాలు.. న్యాయ



వైశేషికాది దర్శనాలు.. లలితకళలను కూడా బోధించేవారట ఇక్కడ అందరికీ ఉచిత భోజన వసతి ఉండడం విశేషం..మన దేశంలోనే కాక ఆసియా అంతా బౌద్ధ విజ్ఞానం పంచి పెట్టే గొప్ప విశ్వవిద్యాలయం ఇది.. శాతవాహనుల కాలంలో ధాన్యకటకం ఎంత గొప్ప విద్యాపీఠంగా ఉండిందో అంతకంటే ఎక్కువగా విజయపురి ఇక్ష్వాకుల కాలంలో పేరుతెచ్చుకుంది..

ఆచార్య నాగార్జునుడు, ఆర్యదేవుడు, భావవివేకుడు, బుద్ధఘోషుడు, బుద్ధపాలిత, ధర్మకీర్తి.. కుమారవిజయ ఇక్కడి విహారాలలో గడిపారు.. నేడు హైదరాబాద్ నుండి నాగార్జునసాగర్ వెళ్లడానికి మూడు గంటల ప్రయాణం.. మూడు వైపులా పర్వతసానువులు.. ఓ వైపు కృష్ణానది .. ఎంతో అందంగా కన్పించే శ్రీపర్వత లోయకు ఆనాడు అంత మంది యాత్రికులు ఎలా వచ్చేవారు క్రీస్తు శకం 8 వ శతాబ్ది వరకూ ఓ వెలుగు వెలిగిన శ్రీపర్వతం.. విజయపురి ఆ తరవాత ఎందుకు వెలుగులను కోల్పోయింది? ఇక్ష్వాకుల పతనం శ్రీపర్వత పతనానికి కూడా దోహదం చేసిందా?1926లో పశువుల కాపర్ల కంట పడకపోతే మన తెలుగు నేలమీద నాగార్జునుడు అనే వాడు ఉండేవాడనీ.. ఇక్కడో విశ్వవిద్యాలయం ఉండేదనీ ఈనాటికీ తెలిసేది కాదు.

**కాలగమనంలో ఎన్నో మార్పులు**

కాలగమనంలో నాగార్జునకొండలో వచ్చిన మార్పులు ఎన్నో.. మూడు వేల సంవత్సరాల నుంచి ఇక్కడ ఆదిమానవుడి అడుగుజాడలు ఉన్నాయి.. బృహత్ శిలాయుగం నాటి సమాధులు కూడా బయటపడ్డాయి.. క్రీస్తు పూర్వం రెండో శతాబ్దిలో ఇక్కడ మహాస్థూపాన్ని నిర్మించారు.. క్రీస్తు శకం రెండో శతాబ్దిలో ఆచార్యుడికి మహావిహారాన్ని నిర్మించారు.. ఆనాడు శ్రీపర్వతం శాతవాహనుల ఉపరాజధాని.. క్రీస్తు శకం 3 వ శతాబ్దిలో శాతవాహనుల బలం క్షీణించసాగింది.. అప్పుడే సామంతరాజు వాసిష్టీపుత్ర శ్రీచాంతమూలుడు శాతవాహన రాజును ఓడించి ఇక్ష్వాకుల రాజ్యాన్ని స్థాపించాడు.. ఇక్ష్వాకుల సమయంలోనే విజయపురి మహోన్నత శిఖరాలను అందుకుంది..వాస్తవానికి ఇక్ష్వాకుల రాజులు వైదిక మతావలంబులైతే – రాణీవాస స్త్రీలు బౌద్ధానికి పెద్ద పీటవేశారు.. శ్రీపర్వతంలో బౌద్ధ చైత్యాలతో పాటు వైదిక ఆలయాలు కూడా బయటపడడం విశేషం..

పల్లవులు.. విష్ణుకుండినులు.. చాళుక్యులు .. కాకతీయులు.. విజయనగర రాజుల ఆధీనంలో ఈ ప్రాంతం ఉన్నట్టుగా ఆధారాలు ఉన్నాయి.. విజయనగర రాజుల కాలంలోనే తొలిసారిగా నాగార్జునకొండ అనే పేరు వచ్చింది.. ఆ తరవాత గోలుకొండ నవాబుల పరిపాలనలో ఈ ప్రాంతం ఉంది.. కానీ ఎన్నడూ కూడా మునుపటి ఘనచరిత్రను తిరిగి పొందలేకపోయింది.. క్రమంగా శోభను కోల్పోయి శ్రీపర్వతం అడవుల్లో దాగిపోయింది.. మనుషులు వెళ్లడానికి కూడా దుర్భేధ్యమైనదిగా మారిపోయింది..

క్రీస్తు శకం 1926 ప్రాంతంలో పశువుల కాపర్లు ఇక్కడ రాళ్లపై ఏవో అక్షరాలు ఉన్నాయని చెప్పే వరకూ నాగార్జునకొండ గురించి ఆధునిక ప్రపంచానికి తెలియదు..1938 –40లలో పురాతత్వశాఖ తవ్వకాలు నిర్వహించింది.. ఒకటి కాదు రెండు కాదు 400 శాసనాలు ఇక్కడ బయటపడ్డాయి.. బౌద్ధ స్థూపాలు.. విహారాలు.. ఆలయాలు.. శిల్పాలు.. నాణేలు ఇలా ఎన్నో బయటపడ్డాయి.. దక్షిణ భారతదేశంలో ఇంత పెద్ద ఎత్తున పురాతత్వ విశేషాలు మరెక్కడా బయటపడలేదు..దేశమంతా విస్తుపోయి ఈ అపూర్వ ఖజానా గురించి తెలుసుకుంటున్న సమయంలో నాగార్జునసాగర్ డ్యామ్ రూపంలో ఈ ప్రాంతానికి ముప్పు ఏర్పడింది. 1954 –60 ప్రాంతంలో డాక్టర్ రాయప్రోలు సుబ్రహ్మణ్యం ఆధ్వర్యంలో 130 కిపైగా పురాతత్వ స్థలాలను గుర్తించి తవ్వకాలు జరిపి విలువైన వారసత్వ సంపదనంతా బహిర్గతం చేశారు.. కృష్ణానదిలో ఓ కృత్రిమ ద్వీపాన్ని నిర్మించి యథాతథంగా పున:ప్రతిష్టించారు..మరి కొన్నిటిని నాగార్జునసాగర్ సమీపంలోని అనుపు దగ్గర అదేమాదిరిగా తీర్చిదిద్దారు.. ఈజిప్టులో కూడా అశ్వన్ డ్యామ్ నిర్మాణ సమయంలో అబూసెంబల్ ఆలయాలను క్రేన్లసాయంతో పెకిలించి సురక్షిత ప్రాంతంలో పున:ప్రతిష్టించడం విశేషం..

నాగార్జున కొండ శిల్పాలను మాత్రం ద్వీపంలో ఉన్న మ్యూజియంలో భద్రపరచారు.. దేశంలోనే అతి పెద్ద ద్వీపప్రదర్శన శాల ఇది..ఆనాడు యుద్ధప్రాతిపదికన సాగిన వెలికితీత పనుల్లో 2000 మంది పాలుపంచుకున్నారట.. నాగార్జున సాగర్ డ్యాం నిర్మాణసమయంలో ముఖ్యమైన కట్టడాలను మాత్రమే వెలికితీశారు.. మిగిలిన వాటిని అలాగే విడిచిపెట్టారు.. వాటి నమూనాలను రూపొందించి మ్యూజియమ్ బయట ప్రదర్శనలో పెట్టారు.,.. ఇవే కాకుండా సాగర్ జలాలలో ఇంకా ఎన్ని శిథిలాలు మిగిలి ఉన్నాయో.. అండర్ వాటర్ ఆర్కియాలజీ మన దేశంలో అంతగా అభివృద్ధి కాలేదు.. ఒక వేళ పూర్తిగా అభివృద్ధిచెందితే.. సాగరగర్భ అట్లాంటిస్ లా.. ద్వారకలా.. ది లస్ట్ సిటీ ఆఫ్ నాగార్జుకొండ రాబోయే కాలాలలో బయటపడే అవకాశం లేకపోలేదు.

**రచయిత ఫోన్: 9010016555**

---

- శ్రీ బొర్రా గోవర్ధన్

## తెలుగమ్మ ఒడిలో బౌద్ధం - 5

# బౌద్ధ భావజాల - తెలుగునేల

తెలుగువారి హృదయాలు 'అహింస'కు దగ్గరవడంలో బౌద్ధం నిర్వహించిన పాత్ర గురించి, వైదికేతర జీవన విధానంలోకి మనం మళ్ళడానికి బౌద్ధం చూపిన దారి గురించి గత సంచికలో చర్చించాం. ఇప్పుడు బౌద్ధ భావజాలం మనలో ఎలా లీనమైపోయిందో కొద్దిగా తెలుసుకుందాం!

**మానవాతీతమైంది కాదు:**

బౌద్ధ భావజాలం - మానవాతీతమైంది కాదు. మానవులకు అతీతమైన మహిమల్ని అది ఎప్పుడూ చెప్పలేదు. అలాగే మూఢనమ్మకాల్నీ ప్రబోధించలేదు. ప్రోత్సహించనూలేదు. మనిషిని మరింత మానవీయంగా తీర్చిదిద్దడానికి మాత్రమే కృషి చేసింది. మనిషి మనసుని వెన్నకంటే సుతిమెత్తగా మార్చి, మానవీయ విలువలతో బ్రతికేట్టు చేయడానికే నడుం కట్టింది. ప్రకృతికి, మనిషి జీవితానికీ మధ్య మానవీయ బంధాన్ని నిర్మించింది.

ఈ భావజాలం మొదటిగా 'విలువలు' అనే వెలుగుల్ని ప్రసరింపజేసింది. ఈ వెలుగులు మన తెలుగు నేలంతటా పరుచుకున్నాయి. మన చరిత్ర, సంస్కృతి, నాగరకతలు, ఈ నాటికీ మన భావాలూ, భావనలూ- బౌద్ధ వారసత్వాన్ని తేటతెల్లం చేస్తూనే ఉన్నాయి.

**కళింగ సమాఖ్యలో బౌద్ధం:**

బుద్ధుని కాలానికి మన తెలుగు నేల మీద అశ్మక, ములక అనే రెండు రాజ్యాలున్నట్లు బౌద్ధగ్రంథాల్ని బట్టి తెలుసుకున్నాం. ఆ తర్వాత వందేళ్ళలో... మౌర్య సామ్రాజ్యం విస్తరించే నాటికి తెలుగునేల మీద ముప్పై గణరాజ్యాలున్నట్లు తెలుస్తోంది. క్రీ.పూ. 300ల్లో మౌర్య సామ్రాజ్యానికి వచ్చిన గ్రీకు దేశ రాయబారి మెగస్తనీస్ తన 'ఇండికా' గ్రంథంలో తెలుగువారికి 30 బలమైన దుర్గాలు ఉన్నట్లు రాశాడు. ఈ ముప్పై ఆ తర్వాత త్రవ్వకాల్లో దొరికిన ఆనవాళ్లను బట్టి 30 గణరాజ్యాలుగా భావించారు. నేలకొండపల్లి, కొండాపూర్, ధోళికట్ట, కోటిలింగాల, ధాన్యకటకం (అమరావతి), భట్టిప్రోలు, శాలిపురం (వడ్లమాను) చందవరం, విజయపురి, వీరాపురం మొదలైనవి.

ఇక్కడ విషయం 30 దుర్గాలా? 29 దుర్గాలా? మూడు దుర్గాలా? అనేది కాదు. ఇది ఒక ఆధారం మాత్రమే- మనం ఇక్కడ ఆలోచించాల్సింది ఇవి గణరాజ్యాలా? కాదా? అనేది మాత్రమే. ఇవి గణ రాజ్యాలే అనేది నిర్వివాదాంశం. అశోకుడు కళింగ మీదకు దండెత్తి వచ్చినప్పుడు కూడా 'కళింగ' అనేది ఒక ఏక కేంద్ర రాజ్యం కాదు. ఒక సమాఖ్య. ఒక యూనియన్. అది 'కళింగ సమాఖ్య' మహాయోధుడు, అంతకు మించి క్రూరుడైన అశోకుడు కూడా అంత తేలిగ్గా కళింగను జయించలేకపోడానికి కారణం అది 'సమాఖ్య' కావడమే!

ఎందుకంటే... ఏక కేంద్ర రాజ్యాల్లో 'రాజు' అనేవాడు ఒకడుంటాడు. వాడికి ఒక రాజ వంశం ఉంటుంది. వారిని కాపాడ్డానికే కిరాయి సైనికులు ఉంటారు. జీతాలిచ్చి సైనికుల్ని పెట్టుకొని వారితో దండయాత్రలు చేయడం ఏక కేంద్ర రాజ్యాల మనుగడలో ఒక భాగం.

కాని, గణతంత్ర రాజ్యాలలో కిరాయి సైనికులు ఉండరు. వారికి జీతాలిచ్చే రాజులూ ఉండరు. ఆ గణంలోని ప్రతి వారూ సైనికులే. తమ గణ స్వాతంత్ర్యానికి విఘాతం కలిగితే సహించరు. ప్రజలంతా వీరయోధుల్లా తిరగబడతారు. వారికి నియంతృత్వ రాజరికం రుచించదు. ఏదో ఒక రాజ వంశాన్ని రక్షించడం కోసం తెగించరు. ప్రజాస్వామ్యానికి ముప్పు కలిగినప్పుడు లేదా తమ స్వేచ్ఛకి విఘాతం కలిగిన్పుడు వెనకాముందు చూడకుండా ప్రాణాలు ధార పోస్తారు.

ప్రజాస్వామ్య విధానం, స్వేచ్ఛ, స్వాతంత్ర్యం, సమానత్వం- అనే మానవీయ విలువల్ని ప్రబోధించిన బౌద్ధం గణతంత్ర ప్రజలకు చాలా తొందరగా అందుతుంది.

అందుకే... గణతంత్ర భావజాలం నిండిన తెలుగు నేల బౌద్ధ భావజాలానికి మునుముందుగా స్వాగతం పలికింది.

అశోకుని కాలానికే కళింగ సమాఖ్యలో బౌద్ధం ఉంది అంటారు కొందరు చరిత్రకారులు. అశోకుణ్ణి కళింగ మీదకు దండెత్తకుండా నిలువరించడానికి ఆనాటి బౌద్ధ భిక్షులు కొందరు ప్రయత్నించారు కూడా. బౌద్ధ కళింగను కత్తితో గెలిచి, చివరికి 'కరుణ' ముందు ఓడిపోయాడు అశోకుడు-

ఎందుకని?

ఒక బలమైనవాడు, ఒక బలహీనుణ్ని ఎలా గెలవగలిగాడో, ఒక బలమైన భావజాలం బలహీనమైన భావజాలాన్ని అలాగే గెలవగలదు. బౌద్ధం ఒక బలమైన భావజాలం. అందుకే అశోకుణ్ణే కాదు -

భారతీయ సంస్కృతినీ గెలిచింది.

తెలుగువారి సంస్కృతే తానై నిలిచింది.

**భావజాలం అంటే :-**

మనం సంస్కృతీ, నాగరకతలు అని వేటి గురించి చెప్పుకుంటామో - అదే భావజాలం. భావజాలం సంస్కృతిలో కనిపిస్తుంది. నాగరికతను నడిపిస్తుంది. దీన్ని 'తీరు' , 'రీతి', అంటే బాగుంటుంది. మనం గతంలో బ్రతికిన తీరు, ఇప్పుడు బతుకుతున్న రీతి- ఈ రెండూ కలిసిపోయి ఉండేదే భావజాలం. ఈ చరాచర ప్రపంచంలో మనుషులకి మాత్రమే 'భావజాలం' ఉంది. ఇతర జీవ

అజీవ ప్రపంచాన్నుండి మనుషుల్ని వేరు చేసింది కూడా ఈ 'భావజాలమే'.

భావజాలం అంటే మనోస్థితి. మనో నిర్మితి. మనం 'మనస్సు మనస్సు'అనిచెప్పుకునేది భావజాలం గురించే. మన సుఖదు:ఖాలకీ, కోపతాపాలకీ, పగ ప్రేమలకి, కరుణ కాఠిన్యాలకీ మూలం 'మనస్సే' అని చెప్పుకుంటాం. నిజం చెప్పాలంటే 'మనస్సుగా' చెప్పుకునే భావజాలమే!

కళింగయుద్ధంలో లక్షలాది మంది నెత్తురులో తన కత్తి కడిగిన అశోకుడు, ఆ తర్వాత... ఆహారం కోసం... ఒక గొర్రె పిల్లను చంపించడానికి కూడా ఒప్పుకోలేదు. తల్లడిల్లాడు. విలవిల్లాడాడు. ఎందుకని?

అతని భావజాలంలో వచ్చిన మార్పే.

భావజాలం బలం మీదే మానవ సమాజాలు బ్రతుకుతాయి.

ఇన్ని రకాల ఆలోచనలకీ భావజాలమే కీలకం. కారణం.

**సమాజాలు - హింస,అహింసలు:**

ఒక ఉన్నతమైన భావజాలమే ఉన్నత సంస్కృతిగా రూపొందుతుంది. కాబట్టి ప్రపంచంలో ఆటవిక జాతులన్నీ క్రమేపీ నాగరక జాతుల్లా మారాయి. మారుతున్నాయి.మారతాయి. నాగరకత పెరిగిన కొద్దీ ఆటవిక ప్రవృత్తి తగ్గుతూ ఉంటుంది. దాని స్థానంలో మానవీయ ప్రవృత్తి పెరుగుతూ ఉంటుంది.

మానవ సమాజం ఆదిమ, ఆటవిక, అనాగరక, బానిస, రాజరిక, పెట్టుబడిదారీ సమాజ దశల్ని దాటి సమసమాజ దృక్పథం కలిగిన సామ్యవాదం (సోషలిజం) వైపుగా నడుస్తోంది. ఈ క్రమంలో ప్రతి సమాజం, దాని వెనుకటి సమాజంకంటే మెరుగైన మానవీయ లక్షణాలతో రూపొందుతుంది.

అంటే..హింసా విధానం క్రమేపీ తగ్గుతూ వస్తూందన్నమాట.

ఆదిమ, ఆటవిక సమాజాలకి 'ఇది హింస' , 'ఇది అహింస' అనేదే తెలియదు. చంపడం లేదా చావడం ఒక సహజమైన ప్రక్రియగానే ఉండేది-

ఈ మారే తీరు, మానవీయత వైపుకి నడవడం మానవ సమాజ సహజ ప్రవృత్తి.

జీవ పరిణామ క్రమంలో ఆధునిక జీవి మానవుడు. కానీ మానవుడు తల్లికడుపులో పడ్డప్పటినుండి పుట్టి పెద్దయ్యేవరకూ తనకంటే పూర్వం ఉన్న జీవుల దశలన్నీ గడుపుతాడు. ఆ దశలన్నీ మన శరీర పరిణామంలో చూడగలం.

ఏకకణ జీవి అయిన అమీబా నుండి తోక లేని కోతులైన చింపాంజీల వరకూ అన్ని రూపాలూ... మనలో ఏదో ఒక దశలో కన్పిస్తూనే ఉంటాయి-

అలాగే... ఆలోచనలు కూడా. అంటే సంస్కృతి, భావజాలం కూడా.

మనలో ప్రతివారిలో ఎంతో కొంత ఆధిపత్య ధోరణి, అహంకారం, క్రూరత్వం, హింసా తత్వం, ఇలా పశులక్షణాలు, ఆటవిక అనాగరక లక్షణాలూ ఏదో ఒక దశలో , ఏదో ఒక స్థాయిలో కన్పిస్తూనే ఉంటాయి. అలాగే ....వీటన్నింటితోపాటు 'మానవీయ లక్షణాలు' కూడా ఉంటాయి.

ఒక లక్షణం పైకి వచ్చి 'పై చేయి' సాధిస్తే మిగిలిన లక్షణాలు వెనక్కిపోతాయి. అవి అలా వెనక్కి పోయి పోయి, ఎప్పటికో అదృశ్యమై పోతాయి.

బౌద్ధం పెద్దగా చేసింది ఏమీలేదు-

మనలో మానవీయ లక్షణాలు 'పైచేయి' సాధించాలని చూసింది, ఆ విధంగా తన భావజాలాన్ని రూపొందించుకుంది. అంతే..!

ఈ ఒక్క పనికోసమే బుద్ధుడు నలభై ఐదేళ్ళు నిర్విరామంగా ప్రబోధించాడు. ఆ తర్వాత రెండున్నర వేల సంవత్సరాలుగా బౌద్ధం కృషి చేస్తుంది ఈ ఒక్క మార్పు కోసమే!

మనలో 'మానవీయత' పైచేయి సాధించాలనే!

**భావజాల బలం:-**

పై విషయాన్ని బట్టి చూస్తే ఇది ఒక సామాజిక శాస్త్రీయ విశ్లేషణ. కాబట్టి ఎప్పుడూ ఉన్నతమైన విలువలు కలిగిన విధానమే గెలుస్తుంది. నిలుస్తుంది.

'హింస' కంటే 'అహింస' ఉన్నతమైన భావం.

'అవినీతి' కంటే 'నీతి' అత్యున్నతమైన విధానం.

'మృగత్వం' కంటే 'మానవత్వం' మహోన్నతమైన అంశం.

'పగ' కంటే 'ప్రేమ'

కర్కశత్వం కంటే కరుణ- ఉన్నతోన్నతమైవి.

కాబట్టి విజయం ఎప్పుడూ ఉన్నతమైన వాటినే వరిస్తుంది.

అందుకే... బౌద్ధం ధర్మం పొడ సోకిన ఏ నేల మీదైనా అది విజేతగానే నిలబడింది.

కత్తి పట్టకుండా, నెత్తురు బొట్టు రాలకుండా ఈ ప్రపంచంలో విస్తరించిన ధర్మమో లేదా మతమో ఏదైనా ఉందంటే అది బౌద్ధం ఒక్కటే! దాని భావజాల బలం అంత అజేయమైనది.జగజ్జేయమైనది.

**పరాజిత విజేతలు:**

అంటే గెలిచి ఓడినవారు. అవును. గెలిచి ఓడినవారు ఈ చరిత్రలో ఎందరో ఉన్నారు. భారతదేశాన్ని తమ కత్తి బలంతో ఓడించిన శకులు, హూణులు, పారశీకులు, మొగలాయిలు.... ఎందరో ఈ దేశాన్ని ఓడించారు. భౌతికంగా గెలిచారు. కానీ.. భారతీయ సంస్కృతీ, నాగరకతల ముందు చివరికి ఓడిపోయారు. వారు తమ నడవడికకు, నడతకు ఆ తర్వాత భారతీయ జీవన విధానాన్నే ఎంచుకున్నారు.

ఇలా- గెలిచి ఓడిన వారందరూ- ఎంచుకొంది దాదాపుగా బౌద్ధ భావజాలాన్నే.

ఇలా విదేశీయుల మీద, వైదిక సాంప్రదాయాల్ని పాటించే స్వదేశీయులమీద బౌద్ధభావజాలం చూపించిన ప్రభావం అంతా ఇంతా కాదు. అంటే ...బౌద్ధ భావజాలం ఎంత సశాస్త్రీయమైందో అర్థమవుతుంది.

**కనిపించేవి-కనిపించనివి:**

కానీ, ఈనాడు చాలామంది

'ఐతే..ఇప్పుడు బౌద్ధం ఏది?

ఎక్కడుంది?' అని అడుగుతారు. బౌద్ధభావజాల బలాన్ని గుర్తించలేని వారే కాదు, బౌద్ధాన్ని కాచి వడపోశాం అని చెప్పుకునే బౌద్ధులు కూడా! 'బౌద్ధం నాశనం చేయబడింది. ఈ దేశం నుండి తరిమి

వేయబడింది' అని మరొకర్ని నిందిస్తారు.

ఒకరు ప్రశ్నించినా, మరొకరు నిందించినా ఇది విన్నవారికి 'నిజంగా ఇది నిజమేమో' అనిపిస్తుంది. ఎందుకని?

ఇది తెలుసుకోవాలంటే మతం, ధర్మం అనే రెండు పదాల్ని విశ్లేషించుకోవాలి.

మనం సహజంగా మతం అంటే దేవుడు, దేవుని ఆరాధనలూ, గుడిగోపురాలు, దేవాలయాలు– అనే అనుకుంటూ ఉంటాం. అందుకే వైదిక, క్రైస్తవ, ముస్లిం లాంటి మతాలు మన కంటికి 'బాగా ఉన్నట్టు' కన్పిస్తాయి. ప్రతి ఊళ్లో 'గుడి' ఉంటుంది, 'దేవుడు' ఉంటాడు, పూజలు ఉంటాయి. వీటన్నిటి మీద 'విపరీతమైన నమ్మకం' కూడా ఉంటుంది.–

అందుకే.... ఇవ్వన్నీ నమ్మకాలు.

మరి మన దేశంలో, అందునా తెలుగు నేల మీద ఎక్కడా బుద్ధుని దేవాలయాలు లేవు. బుద్ధునికి నివేదనలు కన్పించవు. పూజలు జరగవు. కాబట్టి బౌద్ధం 'లేదు', 'పోయింది' అని అనుకొంటాం.

అంటే...ఈ కనిపించే 'సామాగ్రిని' బట్టే మనం 'ఇది ఉంది, ఇది లేదు' అని అనుకొంటున్నాం.

నిజం చెప్పాలంటే.. ఇది నిజం కూడా. బౌద్ధం గుళ్ళు, గోపురాలు, జాతర్లు, పూజలు రూపంలో ఎక్కడా కన్పించదు. ఎందుకంటే వీటన్నిటినీ అది ఒప్పుకోదు. ప్రేమ పూరితమైన, దయాపూరితమైన మానవీయ జీవన విధానాన్నే అది కోరుకుంటుంది.

అంటే... బౌద్ధం నమ్మకం కాదు. జీవన విధానం.

ఒక నిజమైన నిజం.

నమ్మకం జీవిత సత్యం ఎలాకాదో రెండు విషయాలు చూద్దాం.

**ఒకటి:** ఈ దేశంలో శ్రీరాముణ్ణి కొలిచేవారికి కొదువేలేదు. అన్ని కులాల వారూ కొలుస్తారు. మొక్కుతారు. ఇది రాముడు 'దేవుడనే' నమ్మకం. మరి వాల్మీకి రామాయణం ప్రకారమే... రాముడు చదువుకొంటున్న శంభుకుడు అనే వాడి తలనరికాడు. కారణం వాడు శూద్రుడు కావడమే. మరి ఆ రాముడే ఇప్పుడు వచ్చి " చదుకొంటున్న నేరానికి గాను శూద్రుల, పంచముల తలలు నరికి ధర్మాన్ని కాపాడతాను" అంటే ఎవరు ఒప్పుకుంటారు. రాముడు దేవుడు అని నమ్మని వాళ్ళేకాదు, అనుదినం శ్రీరామనామ జపం చేసే ఏ శూద్రుడైనా, పంచముడైనా 'అలాగే శ్రీరామా! చదువు నేర్చుకోవడం నే చేసిన నేరం. పాపం. కాబట్టి ఇదిగో నా తల నరుకు' అని ఒప్పుకుంటాడా? తల ఒప్పగిస్తాడా?

**రెండు:** నిత్యం ఇద్దరు ముగ్గురు భార్యలున్న దేవుణ్ణి పూజించే స్త్రీ ఎవరైనా తన భర్తకి మరో భార్య ఉంటే అంగీకరిస్తుందా? సహజీవనం చేస్తే సహిస్తుందా? నా భర్త శ్రీకృష్ణుడంత చిలిపి, వెంకటరమణుడంత వలపి, అని సరిపెట్టు కుంటుందా? సంబరపడి పోతుందా? సంబరాలు చేసుకుంటుందా?

ఇదంతా ఎందుకంటే.... విమర్శకోసం కాదు.

'నమ్మకం' వేరు. నిజం వేరు అని చెప్పడానికే!

నమ్మకం ఎప్పుడూ జీవితం కాదు. కాబట్టి అది మన జీవితానికి 'వేరుగా' ప్రత్యేకంగా కనిపిస్తుంది. నమ్మినంత కాలం నిలబడి ఉంటుంది.

కానీ... మనం సాగించే జీవితం మనకు 'వేరుగా అనిపించదు. భిన్నంగా కన్పించదు. మనలో విలీనమైపోయి ఉంటుంది. మనలోనే ఉంటుంది. మనలాగే ఉంటుంది. కాబట్టి దాన్ని భిన్నమైనదానిగా చూడలేం.

ఎలాగంటే...

బస్సులో కూర్చొన్న మనం ఒక చోటు నుండి మరో చోటుకి నడవకుండానే, పరిగెత్తకుండానే 'అలా కూర్చొనే' చేరగలం. ఎందుకంటే.. ఆ బస్సుతోపాటే మనమూ కదిలిపోతున్నాం కాబట్టి. అంటే మనం కదులుతున్నా, ఆ కదలిక మనకు ప్రత్యక్షంగా కన్పించదు.

జీవితంలో మనం పాటించే జీవన పద్ధతులూ అంతే.. అవేవో భిన్నమైనవిగా మనకు అనిపించవు. ఒక రంగులో అదే రంగు కనపడనట్టు.....

కాబట్టి, మన భావజాలం ఏదైతే ఉందో..., అది మనకు భిన్నంగా కనిపించదు.

కాబట్టి– మన నేలమీద బౌద్ధ జీవన విధానమే కొనసాగుతున్నా అది మనకు భిన్నమైనదిగా కనిపించక పోడానికి కారణం ఇదే! అంటే అంతగా అది మనలో విలీనమై పోయిందన్నమాట!

**తెలుగునాట బౌద్ధ భావజాలం:**

తెలుగువారి జీవన విధానం బౌద్ధ జీవన విధానానికి దగ్గరగా ఉంటుంది. వైదిక భావజాలం ఒక వైపున వచ్చి పైన పడిపోతున్నా, దాని ప్రభావం ఎంతో ఉన్నప్పటికీ బౌద్ధ జీవన విధానమే పైచేయి సాధించింది.

మనకు తెలిసినా తెలియక పోయినా...మూడొంతులు మనం పాటించే జీవన విధానం బౌద్ధ విధానమే!

కొన్ని చూద్దాం.

1. బౌద్ధం స్త్రీ అణచివేతను అంగీకరించదు. తెలుగునాట పురుషాధికారమే ఉన్నప్పటికీ, ఉత్తర భారతదేశంలో వలే స్త్రీలపై అణచివేత ఉండదు. ముఖ్యంగా ఆర్యీకరించబడిన ఒకటి , రెండు అగ్ర కులాల్లో తప్పితే, మిగిలిన అశేష శూద్ర, అంటరాని కులాల్లో, స్త్రీ అణచివేత అంతగా కన్పించదు. పైగా, ఆడవారికి ఉన్నన్ని 'నిత్య జీవిత' వేడుకలు,(జాత కర్మలు) మరెక్కడా లేవు. ఆడవారికి జరిగే 'రజస్వల'(బంతి), వివాహం, శ్రీమంతం (సూడిదలు) , బారసాల ,(వాయనాలు) ఇంకా అట్లతద్ది ఇలాంటి ఉత్సవాలు, వీటిలో ఎక్కడా 'హింసా' పూరిత విధానం కనిపించదు.

2. అలాగే.. కులరాహిత్య భావం. తెలుగు నాట 'కులాలు' ఉన్నా అవి ఎప్పుడూ తీవ్రస్థాయిలో రక్తాలు పారించుకోలేదు.(ఇటీవలి ఒకటి రెండు మినహా). అంటరానితనం ఉన్నా– గ్రామాల్లో చిన్న పెద్ద కులాల వారు 'అక్కా! బావా! అన్నా! వదినా! మామా!" అంటూ వరసలు పెట్టుకుని పిలుచుకునే ఒక సుహృద్భావ వాతావరణం ఉంది. ఇది– వైదిక మతం సృష్టించిన 'కులం' మీద బౌద్ధ భావజాల ప్రభావమే!

3. అలాగే... వీరబ్రహ్మం, వేమన్నలే కాదు, చివరికి అన్నమయ్య కూడా కులభేదాలు లేని సమాజాన్ని ఆహ్వానించినవారే! వేమన్న భావాల్లో లెక్కలేనన్ని బౌద్ధ భావాలున్నాయి.

4. తెలుగు నేల మీద కడప ఒకనాటి బౌద్ధభావజాల గడప. అలాగే. కోస్తా ప్రాంతంలో పలనాడు ప్రాంతం బౌద్ధానికి పెద్ద కేంద్రం. ఈ ప్రభావం వల్లే బ్రహ్మనాయుడు చాపకూటిని ఏర్పాటు చేశాడు. కన్నమదాసుని కొడుకుగా స్వీకరించగలిగాడు.

5. మనం ఈ రోజున కూడా గ్రామాల్లో చూస్తాం. ఇద్దరు పోట్లాడుకొంటూ–

'పో! నీ పాపం నీదే! నా పాపం నాదే! అని సర్దుకుపోతారు.

అలాగే! "తిట్టుకో! నీ ఇష్టం వచ్చినట్లు తిట్టుకో! నాది తప్పైతేనే అవి నాకు తగులుతాయి. లేకపోతే... నీ తిట్లు నీకే తగులుతాయి" అనేది. ఇది కూడా సహనానికి, ఓర్పుకు సంబంధించిన సర్దుబాటే. బుద్ధుడు స్వయంగా ఇలాంటి సంఘటనలు ఎదురైనప్పుడు ఇలాగే చేశాడు. సహనంతో సరిదిద్దాడు.

6. ఆ విధంగా... ఇద్దరి మధ్య పంపకాల విషయంలో కానీ, ఇతర విషయాల్లోగానీ గొడవలు వస్తే... వాటిని మధ్యవర్తులు అటూ ఇటూ సరిచేసి తగాదా సర్దుబాటు చేస్తారు.

'ఒక మెట్టు దిగకపోతే ఎలా?' అంటూ సంధిచేస్తారు. 'మధ్యేమార్గం'గా ఇద్దరినీ ఒప్పిస్తారు. దీన్ని 'భట్టిప్రోలు పంచాయితీ' అంటారు. అంటే.. భట్టిప్రోలు ప్రసిద్ధ బౌద్ధక్షేత్రం. అతి పురాతన బౌద్ధక్షేత్రం. బౌద్ధం విరాజిల్లిన ప్రదేశం. అందుకే భట్టిప్రోలు కేంద్రంగా ఉన్న బౌద్ధమార్గం 'మధ్యమమార్గం'. బుద్ధుడు ఏ విషయంలోనూ 'అతి' కూడదు అని చెప్పాడు. ఆయన ఆ చివరో, ఈ చివరనో పట్టుకుని వ్రేళ్ళాడ లేదు. ఆరెండింటి సమన్వయంతో మధ్యమ మార్గంలో సాగాడు. అందుకే గొడవల్ని అణచడానికి ఉపయోగించే రాజీ విధానాల్ని (మధ్యేమార్గాన్ని) 'భట్టిప్రోలు పంచాయితీ' అంటారు–

అంటే సహజీవనానికి బౌద్ధం ఎంతగా తోడ్పడిందో దీన్ని బట్టి తెలుస్తుంది.

7. ఇక, అహింసా పూరిత పూజా విధానాలు, నైవేద్యాలు, గారెలు, పిండివంటలు, అరిసెలు, బూరెలు, పానకం, (బెల్లం వంటకాలు) లాంటి ఎన్నో ఆహార పదార్థాలు మాంసాహారానికి బదులుగా బౌద్ధ సంస్కృతి సృష్టించిన శాకాహార వంటకాలే–

ఈవిధంగా.. ఎన్నో జీవన విధానాల్లో బౌద్ధం సామాజికంగా, సాంస్కృతికంగా వైదిక సంప్రదాయంపై, వైదిక .జీవన విధానం పై విజయం సాధించింది.

మనం ముందే చెప్పుకొన్నట్లు ఒక ఉన్నతమైన భావజాలం మాత్రమే ఇలా విజయం పొందగలదు.

మతపరంగా, దేవుని పరంగా, గుడి గోపురాల పరంగా– బౌద్ధం ఈ నేల మీద కనిపంచక పోయినా, మన తెలుగు వారి జీవితాల్లో, సంప్రదాయాల్లో , సంస్కారాల్లో అణువణువునా బౌద్ధమే ఉంది.

అది.....

మనలోనే ఉంది.

మనతోనే ఉంది.

మనలాగే ఉంది... కాబట్టి అది ప్రత్యేకంగా వేరుపడి కనిపించదు–

నిజం చెప్పాలంటే... ఇది

అమానవీయ, అనాగరక, ఆటవిక వైదిక భావజాలం మీద మానవీయ బౌద్ధ భావజాల విజయం!

అందుకే బౌద్ధ భావజాల – మన తెలుగు నేల!

**రచయిత ఫోన్ : 9390600157**

## రూపాంతరం — పుస్తక పరిచయం — పాఠాంతరం







**ఈ** రెండు పుస్తకాలను రచించింది ప్రసిద్ధ కథా రచయిత మధురాంతకం నరేంద్రగారు. వీరు తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో ఇంగ్లీషు శాఖలో ఆచార్యుడిగా ఉన్నారు.

ఒక కథ వ్రాసి, తర్వాత దాన్ని నాటికగా రచించి, పిదప మరొక కథను సృజించే పద్ధతి పాటించి, మూడింటిని ఒకే పుస్తకంగా ప్రచురించడంలో విశేషం ఉంది. ఒకే రచయిత తన ఆలోచనా విధానంలో ఎలా కథ–నాటిక–కథ–రచయిత ఎలా రాశారో పాఠకులు గమనించడానికి 'రూపాంతరం'లో అవకాశం దొరుకుతుంది.

ఒక అంశాన్ని కథానికగా వ్రాసి, ఆ తరువాత కొంచెం కథనుపెంచి నాటికగా రచించడంలోను, కథను విస్తృతం చేయడంలోను, సంభాషణాత్మకంగా రచించడంలోను రచయిత తీసుకున్న శ్రద్ధను, ఆలోచనా విధానాన్ని పాఠాంతరంలో పాఠకులు గమనించగలరు.

పాఠాంతరం : వెల రూ.40/–; రూపాంతరం : వెల రూ.40/–; కాపీలు లభించుచోటు: కథాకోకిల ప్రచురణలు, 15–54/1, శ్రీ పద్మావతి నగర్, తిరుపతి–2. సెల్ నం.0877–2241588.

## దేశభాషలందు తెలుగు లెస్స — పుస్తక పరిచయం




**ఇది** సంకలనగ్రంథం. దీన్ని సంకలనం చేసింది డాక్టర్ ఎస్.ఎస్. చిదంబర శాస్త్రిగారు. తెలుగు, ఆంధ్రము పర్యాయ పదాలు కావున ఈ రెండు పేర్లతో 240 శీర్షికలతో ఈ పుస్తకాన్ని సంకలనగ్రంథంగా తీర్చిదిద్దడంలో శాస్త్రిగారి శ్రమను, ఉత్సుకతను పాఠకులు గమనించగలరు. ఇన్ని శీర్షికలతో కూడిన పుస్తకానికి 'దేశభాషలందు తెలుగు లెస్స' అని పేరు పెట్టడం ఆనందం కలిగిస్తుంది. ఇందులో పద్యాలతోపాటు, పాటలను చేర్చారు. శాస్త్రిగారుజగ్గయ్యపేటలోని శ్రీమతి గెంటాల శకుంతలమ్మ కళాశాలలో తెలుగు డిపార్టుమెంటులో పనిచేస్తున్నారు.

దేశభాషలందు తెలుగు లెస్స : వెల: అమూల్యం; కాపీలు లభించుచోటు: డాక్టర్ సర్వా సీతారామ చిదంబరశాస్త్రి, శ్రీమతి గెంటేల శకుంతలమ్మ కళాశాల, జగ్గయ్యపేట 521175, సెల్ నం.9885383741, 08654–222414

# తెలంగాణా సాంస్కృతిక యోధుడు, అక్షర వాచస్పతి దాశరథి రంగాచార్య

(ఆగస్టు 24, 1928 – జూన్ 8, 2015)

ఇంటర్వ్యూలు, కూర్పు : **శ్రీ ఎ.కె.ప్రభాకర్, శ్రీ కె.పి.అశోక్ కుమార్**

*నివాళి*

**దాశరథి రంగాచార్య ఆధునికత, సంప్రదాయాల మేళవింపు. మార్క్సిజం, ఆధ్యాత్మికత రెండు భిన్న భావజాలాలకు సంగమ స్థానం. ఆ రెండూ ఆయన దృష్టిలో విరుద్ధాంశాలు కావు. రెండూ మనుషుల మధ్య సమభావాన్ని పెంపొందించడానికి వుద్దేశించినవే. మార్క్స్ ఆయనకు మహర్షి. వేదాల్ని తెలుగులోకి అనువదించిన తిరుగుబాటు వేదాంతి. ప్రాచీన వేదాన్ని ఆధునిక యాంత్రిక జీవననాదంగా తర్జుమా చేయడం సాహసమే. అగ్రహారం గోడల మాటున దాగిన వేదాన్ని జాతి భేదం లేకుండా సమస్త ప్రజానీకానికీ తెలిసేలా సామ్యవాద గోపురమెక్కి వుద్ఘోషించిన మనీషి. అతి పిన్నవయస్సు నుంచి కష్టాల కొలిమిలో రాటుతేలాడు. సంప్రదాయ వాతావరణంలో పెరిగాడు. తండ్రి చండశాసనుడు. ఇంట్లో తెలుగు పలుకు నిషిద్ధం. మొదట్లో ఆర్య సమాజానికీ తర్వాత అభ్యుదయ భావాలవైపు ఆకర్షితుడయ్యాడు. 12 ఏళ్ళ ప్రాయంలోనే నిజాం నిరంకుశ పాలనకూ గ్రామీణ భూస్వామ్య దోపిడీ వ్యవస్థకూ వ్యతిరేకంగా నడిచిన తెలంగాణా రైతాంగ వుద్యమంలో భాగం వహించాడు. ఆనాటి నుంచి తిరుగుబాటు తత్త్వాన్ని రక్తగతం చేసుకొన్నాడు. అప్పటి పోరాట వూపిరినే తుదిశ్వాస దాకా కాపాడుకొన్నాడు. దాన్నే ఐదు దశాబ్దాల సాహిత్య ప్రస్థానంలో అక్షరబద్ధం చేసాడు.**



రంగాచార్య సాహితీ జీవితం యెంతో విస్తృతమైంది. నవల, కథ, వ్యాసం, జీవిత చరిత్ర, స్వీయ చరిత్ర, యాత్రా రచన, అనువాదం, వ్యాఖ్యానం ... యెంతో వైవిధ్యమున్న భిన్న ప్రక్రియల్ని చేపట్టి తెలంగాణలో ఆధునిక వచనానికి మారుపేర య్యాడు. తన అనుభవంలోకి వచ్చిన జన జీవితాల్నే కథలూ నవలలుగా మలిచాడు. కొరుకుడు పడని తాత్త్విక ఆధ్యాత్మిక గ్రంథాల్ని సరళమైన భాషలో అందించాడు. అక్షర వాచస్పతిగా అమరుడయ్యాడు. కవిత్వ పంక్తుల్ని పోలిన ఉద్వేగభరిత గంగా ప్రవాహ సదృశమైన శైలిలో ఆయన రచించిన ఆత్మకథ 'జీవన యానం' తెలుగు వచనంలో కొత్త వొరవడిని సృష్టించింది. అలతి అలతి పదాలతో, చిట్టి పొట్టి వాక్యాలతో కూడిన రచనా రీతిలో ప్రత్యేక ఆకర్షణ వుంది. పాఠకుల ఆదరణ చూరగొంది. మధ్య మధ్య వుర్దూ షాయరీలతో మాధుర్యాన్ని సంతరించుకొంది. ఆధునిక వచన రచనల్లో అది ఆణిముత్యం. అది కేవలం ఆయన ఆత్మ కథ కాదు. ఆయన జీవనాడి. డెబ్బై యేళ్ళ తెలంగాణా సామాజిక సాంస్కృతిక ఉద్యమాల చరిత్ర. ఆ ఉద్యమాల్లో కదం తొక్కిన ప్రజా సమూహాల మూకుమ్మడి కంఠ స్వరం. ఆగని వర్గ పోరాటపు అలజడి. ఆత్మీయ స్నేహాల ఆప్యాయతల గుండె తడి. గత వర్తమాన కాలాల రాజకీయ సామాజిక నైతిక విలువల్ని తూచి బేరీజు వేసిన తులాదండం. సాహిత్య బాంధవ్యాల అనుబంధాల పరిమళాల్ని జీవనయానం ప్రతి పదంలోనూ వెదజల్లుతుంది. గార్హస్థ్యమొక తపస్సని చెప్పి దాంపత్య జీవనసౌందర్యాన్ని వున్నతీకరించింది. అది నికార్సైన రంగాచార్య నిప్పులాంటి వ్యక్తిత్వానికి నిలువుటద్దం. అందువల్లే మానవీయ విలువల ఆచరణలో భావితరాలకు ఆదర్శం. ఆళ్వారుస్వామి, కృష్ణమాచార్య, కాళోజీ వంటి యెందరో సమకాలీన సాహిత్యకారుల అపురూపమైన వ్యక్తిత్వ చిత్రణ దానిలో లభిస్తుంది.



జీవితాచరణలోనూ నవలా రచనలోనూ రంగాచార్యకు వట్టికోట ఆళ్వారుస్వామి ఆదర్శం. ఒక విధంగా ప్రజలమనిషిగా అకాల మరణం చెందిన ఆళ్వారుస్వామికి ఆయన కొనసాగింపు. 'చిల్లర దేవుళ్లు' నవలలో రైతాంగ పోరాటం ముందు తెలంగాణ పల్లెల్లోని వాతావరణాన్ని– ముఖ్యంగా భూస్వామ్య వ్యవస్థలోని అమానవీయతనీ, దొరల గడీల్లో అమలయ్యే దౌష్ట్యాన్నీ, వాటికి బలైన ప్రజల వేదననీ, తిరుగుబాటు బీజాల్నీ – 'మోదుగుపూలు' నవలలో తెలంగాణ సాయుధ పోరాటకాలం నాటి పరిస్థితుల్నీ, 'జనపదం'లో పోరాటం తర్వాత చోటుచేసుకొన్న రాజకీయ పరిణామాల్నీ – తాను స్వయంగా భాగస్వామి అయిన వుజ్జ్వలమైన చరిత్రకి కాల్పనికతని జోడించి – అక్షరీకరించారు. అన్న నీడన బతికాడు గానీ అన్నకు నీడ కాలేదు. ఒకరు సూర్యుడూ మరొకరు చంద్రుడూ కాదు. ఇద్దరూ సూర్యులే. స్వయంప్రకాశకత్వం అన్నది రంగాచార్య విషయంలో అక్షరాలా నిజం. బడి చదువులు అంతగా లేకపోయినా గురుశుశ్రూష చేయకున్నా స్వయంగా తెలుగు, వుర్దూ, హిందీ, సంస్కృతం, ఇంగ్లీషు భాషల్లో లోతైన పాండిత్యం సంపాదించు కొని, అన్న దాశరథి కృష్ణమాచార్య నడిచిన దారిలో తన జీవితానుభవాల సారానికి మార్క్సిజం సూత్రాలను అన్వయించుకొని రంగాచార్య రాసిన గ్రంథాలు 60 కి పైనే. అంపశయ్య మీద భీష్ముడిలా కథనం కదనం ఆయన విడువలేదు. అనారోగ్యంలో సైతం కలం గళం ముడువలేదు. ఆయన వృత్తి రచయిత కాదు: ప్రవృత్తి రచయిత. దాదాపు 38000 పుటలకు మించిన రంగాచార్య సాహిత్యం మేరునగోన్నతం. ఆయన సాహిత్య జీవిత వ్యక్తిత్వాలపై యెన్నో పరిశోధనలు జరిగాయి, జరుగుతున్నాయి.

'నా రచనలు మెప్పు పొందాయంటే అది నా గొప్పదనం కాదు. నేను వర్ణించిన జీవితం తెలంగాణ ప్రజలది. పోరాటం తెలంగాణ ప్రజలది. భాష తెలంగాణ ప్రజలది. పాత్రలూ తెలంగాణా ప్రజలే. నేను చేసింది కూర్పు మాత్రమే. తెలంగాణ నేలపై మొలచిన ప్రజా వుద్యమాలే తనను రచయితగా మలిచాయి అని చెప్పుకొనే రంగాచార్య కడవరకూ అన్నికాల ప్రగతి శీల ఉద్యమాలకు దన్నుగా నిలిచాడు. పాలకవర్గ రాజకీయాల్ని చీదరించుకొన్నాడు. ఉద్యోగ జీవితంలోకూడా యెవరికీతలవంచలేదు. యూనియన్ కార్యక్రమాల్లో క్రియాశీల పాత్రని పోషించాడు. పౌరహక్కులకు భాగం వాటిల్లడాన్ని చూసి యెన్నడూ మౌనం వహించలేదు. ప్రతిఫలాన్ని ఆశించకుండా సామాజిక కర్తవ్యాల్ని నిర్వహించాడు. రాజకీయ కారణాలతో ప్రలోభపరిచే అవార్డుల్నీ సన్మానాల్నీ తిరస్కరించాడు. నిక్కచ్చిగా నిరాడంబరంగా బతికాడు. వ్యక్తిగా సాహిత్యకారుడిగా ప్రజల పక్షమే వున్నాడు. ప్రత్యేక తెలంగాణా వుద్యమ ఫలితాల్ని మళ్ళీ శక్తులు సొంతం చేసుకోవచ్చని హెచ్చరించాడు. సాహిత్య జీవితం పౌర జీవితం వేరుగా వుండవని ప్రబోధించాడు. రాతలకూ చేతలకూ పొంతనలేని సాహిత్య రాజకీయ వాతావరణంలో రాసిందాన్నే ఆచరించాడు.

తెలంగాణాకి యెటువంటి ప్రత్యేక ప్రతిపత్తి లేకపోయినా పోరాట ప్రతిపత్తి వున్నదని విశ్వసించాడు. దాన్నే శ్వాసించాడు. అన్న దాశరథి కాంగ్రెసు రాజకీయాలను నమ్మాడు, తెలుగు జాతి సమైక్యతని కోరాడు. తమ్ముడు మాత్రం కమ్యూనిజాన్ని పాటించి ప్రత్యేక రాష్ట్ర నినాదాన్ని అందుకొన్నాడు. అదే కాలంలో సమాంతరంగా వేదానువాదాన్నీ ఉపనిషద్ వ్యాఖ్యానాల్నీ వొక నిష్ఠతో చేసాడు. తన సాహిత్యాచరణలోని యీ వైరుధ్యం ప్రజోద్యమాల్లో అగ్ర భాగాన నడవడానికి ఆటంకం కాలేదు. తెలంగాణ సాంస్కృతికోద్యమంలో అక్షర సైనికుడై నిలిచాడు. ఆ పోరాటంలోనే నిశ్శబ్దంగా నిష్క్రమించాడు.

*'తెలుగు చచ్చిపోతుందేమోనని చాలామంది అంటున్నారు. అసలు చస్తుందని నమ్మకమేమిటి అంటాన్నేను. భాష చావదు. భాషంటే విశ్వాసం. భాష కూడా ఒక విశ్వాసం'.* (పాలపిట్ట : 2013 డిసెంబర్)

### రంగాచార్య రచనల జాబితా :

**నవలలు :**
- చిల్లర దేవుళ్ళు
- మోదుగుపూలు
- జనపదం
- రానున్నది ఏది నిజం?
- అమృతంగమయ
- మాయ జలతారు
- సంకల్పం
- పావని
- మానవత
- శరతల్పం

**కథాసంకలనాలు :**
- నల్లనాగు
- రణరంగం
- కెరటాలు

**ఆత్మకథలు :**
- జీవనయానం
- యాత్రాజీవనం

**అనువాదాలు :**
- నాలుగు వేదాలు
- ఉమ్రావ్ జాన్ అదా
- దేవుని పేరిట
- కేదారం
- అనువాద కథలు
- సోనార్ బంగ్లా నాటికలు
- ఉర్దూ మదిర
- ఇఖ్బాల్ కవితలు

**కవిత్వం**
- మానస కవిత
- జనరంగం
- రణభేరీ
- భారత సూక్తము

**జీవిత చరిత్ర రచనలు**
- రామానుజ చరితామృతం
- బుద్ధుని కథ
- శంకర జీవిత సారథి
- ప్రేమ్ చంద్
- మహాత్ముడు

**సరళవచనాలు :**
- శ్రీమద్రామాయణం
- శ్రీ మహాభారతం

**వ్యాస సంకలనాలు :**
- శబ్దశ్వాస
- వేదం-జీవననాదం
- అక్షర మందాకినీ
- శతాబ్ది

ఆయన విశ్వాసాన్ని కాపాడటం మన బాధ్యత. ఇవ్వాళ తెలుగుజాతి ముందున్న కర్తవ్యం. అది కూడా దాశరథి రంగాచార్యకు మనమిచ్చే నివాళిలో భాగమే.



**రంగాచార్య పొందిన అవార్డులు, పురస్కారాలు, బహుమతులు:**
- చిల్లర దేవుళ్ళు నవలకు ఆంధ్ర ప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డ్ 1970
- సాహితి హారతి , ఖమ్మం - వెండి కిరీటం 1994
- గురజాడ అవార్డ్ 1997
- గౌరవ డి.లిట్. కాకతీయ విశ్వవిద్యాలయం 1998
- అక్షర వాచస్పతి అవార్డ్ - యువకళావాహిని 1999
- అన్నపూర్ణ గండపెండేరం , విజయవాడ 2001
- సిద్ధార్థ అవార్డ్ , విజయవాడ 2001
- పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం స్పెషల్ అవార్డ్ 2001
- అన్నమయ్య ఆధ్యాత్మిక ఆంధ్రరత్న అవార్డ్ 2004
- ఆంధ్ర ప్రదేశ్ హంస అవార్డ్ 2006
- ఆంధ్ర ప్రదేశ్ రాజీవ్ ప్రతిభా అవార్డ్ 2009
- అ జో - వి భో - కందాళం ఫౌండేషన్ , ప్రతిభామూర్తి జీవితకాల సాఫల్య పురస్కారం 2010 ఇంకా యెన్నో .... .... ...

## పుస్తక పరిచయం - మొదటితరంరాయలసీమ కథలు



**తె**లుగు సాహిత్యంలో కథ, కథానిక ప్రక్రియలు విస్తృతంగా పాఠకులను ఆకట్టుకుంటున్నాయి. కథల సంపుటాలు వెలువడుతున్నాయి. కాని, డాక్టర్ అప్పిరెడ్డి హరినాథరెడ్డి సంపాదకత్వంలో మొదటితరం రాయలసీమ కథలు - 62 సంవత్సరాల్లో వెలువడిన రాయలసీమ ప్రాంతంలోని 42 కథల్ని వివిధ పత్రికలనుండి సేకరించి ఒక గ్రంథంగా ప్రచురించడం సంతోషదాయకం. డాక్టర్ అప్పిరెడ్డి హరినాథరెడ్డి భాషోపాధ్యాయులు, పరిశోధకులు, రచయితగా ప్రసిద్ధులు.

మొదటతరం రాయలసీమ కథలు : వెల రూ.200/-; కాపీలు లభించుచోటు: కె. మురళీమోహన్, 9111, బ్లాక్ 9ఎ, జనప్రియ మహానగర్, మీర్‌పేట, హైదరాబాద్-500097, సెల్ నం.9701371256

## స్వర్ణయాగం - పుస్తక పరిచయం



**ఇది** బంగారు ఆభరణాల అతిమోజుపై వేముల ప్రభాకర్ వ్యంగ్యాస్త్రాలతో రచించిన త్రిశతి. వేములప్రభాకర్ యిప్పటికే కథలు, కవితలు వ్రాసి ప్రసిద్ధులైన వ్యక్తి. లోకంలో ఉన్న బంగారంపై మోజు-అనే అంశంపై సామాజిక కోణంలో చురకలవంటి కవితలు అందించారు. తన కుటుంబంలోని స్వానుభవం ప్రభాకర్‌గారు ఈ త్రిశతి వ్రాయడానికి ప్రేరణ అయింది.

స్వర్ణయాగం : వెల రూ.60/-; కాపీలు లభించుచోటు: వేముల రోహిత్, అడ్వకేట్, ప్లాట్ నెం.01, జయదర్శిని ఎన్‌క్లేవ్, దేవరాయంజల్ పోస్టు, సికింద్రాబాద్ - 500078, సెల్ నం.9247040332.

- శ్రీ అంపశయ్య నవీన్

# నవలాకారులముగా దాశరథి రంగాచార్య, నేను



ఏ నవలాకారుడి కైనా తన మొదటి నవలను రచించటానికి ఒక బలమైన ప్రోత్సాహకం లేదా మోటివేషన్ ఉంటుందనుకుంటాను. ఇదివరకు ఎవరూ చెప్పని ఒక కొత్త విషయాన్ని చెప్పాలనో లేక ఇదివరకెవరూ అనుసరించని రచనా సంవిధానాన్ని అనుసరించాలనో ఆ నవలాకారుడు అనుకుంటాడు. ఈ కారణం వల్లనే ఒక నవలాకారుడి మొదటి నవలకు కొన్ని ప్రత్యేకతలుంటాయనిపిస్తుంది. తెలుగులో ఇదివరకెవరూ నవలలు రాయలేదన్న కారణం కందుకూరి వీరేశలింగాన్ని "రాజశేఖర చరిత్ర"ను రచించేలా చేసింది. బుచ్చిబాబు రచించిన "చివరకు మిగిలేది" కావచ్చు, రా.వి.శాస్త్రి "అల్పజీవి" కావొచ్చు, వద్దెర చండీదాసు "హిమజ్వాల" కావొచ్చు, కేశవరెడ్డి "అతడు అడవిని జయించాడు" కావొచ్చు... వీటన్నింటికీ ఎన్నో ప్రత్యేకతలున్నాయి.

దాశరథి రంగాచార్య రచించిన మొదటి నవల "చిల్లరదేవుళ్లు". ఈ నవలను రచించటానికి తనను ప్రేరేపించిన అంశాలేమిటో రంగాచార్య ఇలా చెప్పాడు.

"ఇంతటి విశాల ఉద్యమం (1946 నాటి తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం), ఇంతటి మహత్తర పోరాటం, ఇంతటి మహోన్నత సమరం, మహామహా మేధావులను కదిలించింది. కళాకారులు కదనరంగంలోకి దూకి కోకొల్లలుగా పాటలు, అనేక నాటకాలు రచించారు. పాబ్లో నెరూడా ఈ పోరాటానికి స్పందించి పాటలు రాశాడని అంటారు. కిషన్‌చందర్ ఉర్దూలో "జబ్ ఖేత్ జాగే" అనే గొప్ప నవల రాశాడు.

ఈ పోరాటంలో వచ్చినంత సాహిత్యం మరే పోరాటంలో రాలేదన్నది వాస్తవ సత్యం.

పోరాటం జరుగుతున్నప్పుడు నవలలు రావడం కష్టం. అందువల్ల సామాజిక స్థితిగతులు స్థిరపడిన తర్వాతనే తెలంగాణ సాయుధ పోరాట విషయకంగా నవలలు రావడం ప్రారంభమయ్యింది.

వట్టికోట ఆళ్వారుస్వామివారు (నాకు) ఆత్మబంధువు. సాహిత్య బంధువు. వారు 'ప్రజలమనిషి' అనే నెపంతో ప్రారంభించి యావత్తు పోరాటాన్ని కొన్ని నవలలుగా రచించటానికి ఒక ప్రణాళిక సిద్ధం చేసుకున్నాడు. అయితే 'గంగు' నవల రాస్తూ అది అసంపూర్ణంగా వదిలి, 1961, ఫిబ్రవరి 5న వారు పరమపదించారు. వారు ప్రారంభించిన ఈ నవలా రచన ఉద్యమాన్ని ఎవరయినా కొనసాగిస్తారని, మహోజ్వలం అయిన పోరాట గాథను భావితరాల వారికి అందిస్తారని ఆశించాను. ఎదురుచూచాను. ఎవరూ ముందుకు వచ్చినట్టు కనిపించలేదు. వచ్చే జాడలు కూడా స్ఫురించలేదు.



అలాంటి తరుణంలో నేను నవలా రచనను ఉద్యమంగా కొనసాగించటానికి సంకల్పించుకున్నాను. 1963 నుండి నవలా రచనను గురించి అధ్యయనం చెయ్యటం ప్రారంభించాను. తెలంగాణాలో నేను చూచినవి, విన్నవి, పాల్గొన్న పోరాటాల్ని స్మరణకు తెచ్చుకున్నాను. 13-10-1964న "చిల్లరదేవుళ్ళు" రచన ప్రారంభించి 10-11-1964 నాడు ముగించాను"

పాత్రల మనస్సంచారాన్ని లోతుగా చిత్రించిన నవలలు తెలుగులో రాలేదనీ, కొన్ని సంవత్సరాల్లో జరిగిన సంఘటనల్ని కాకుండా కొన్ని గంటల్లో జరిగిన సంఘటనల ఆధారంగా రచించిన నవలలు రాలేదనీ, ఒక రచయిత జీవితంలో యధార్థంగా జరిగిన సంఘటనల్నే నవలలుగా మలచిన ఉదంతాలు కూడా లేవనీ, అలాంటి నవలొకటి రాయాలన్న ఒక బలమైన సంకల్పమే నన్ను "అంపశయ్య" రాయటానికి పురికొల్పింది. ఆశ్చర్యంగా "చిల్లరదేవుళ్ళు", "అంపశయ్య" 1969లోనే వెలువడటం యాధృచ్ఛికం. "చిల్లరదేవుళ్ళు" చదివి నేను దాశరథి రంగాచార్య గారికి అభిమానినయ్యాను. అలాగే "అంపశయ్య" చదివి రంగాచార్య నాకు అభిమానయ్యాడు. 1972లో మేమిద్దరం హైదరాబాద్‌లో మొదటిసారి కలుసుకున్న మరుక్షణం నుండే మా ఇద్దరి మధ్య బలీయమైన సాన్నిహిత్యం యేర్పడింది. అయితే "చిల్లరదేవుళ్ళు"కు, "అంపశయ్య"కు పోలికలేమైనా ఉన్నాయా అంటే పెద్దగా లేవనే చెప్పాలి.

రంగాచార్యది ప్రధానంగా చారిత్రక దృష్టి. నాది ప్రధానంగా మానసిక దృక్కోణం. తెలంగాణా చరిత్రలోని కొన్ని ముఖ్య ఘట్టాలను చిత్రించటానికే దాశరథి రంగాచార్య "చిల్లరదేవుళ్ళు", "మోదుగుపూలు", "జనపదం" ఈ మూడు నవలల్ని ఒకదానికొకటి కొనసాగింపుగా రచించాడు. నేను పాత్రల బాహ్య రూపాలను, బాహ్య ప్రవర్తనను కాకుండా వాళ్ళ అంతరంగంలో యేం జరుగుతున్నదో చిత్రించే ప్రయత్నం చేశాను. వ్యక్తుల లోపలి మనుష్యులకు బొమ్మ కట్టే ప్రయత్నం నాది.

ఎన్నో సంవత్సరాల్లో జరిగిన చారిత్రక సంఘటనల్ని రంగాచార్య నవలలుగా రచిస్తే నేను కొన్ని గంటలలో వ్యక్తుల మనస్సుల్లో చెలరేగే అనేక ఆలోచనలకు, సంఘర్షణలకు నవలా రూపం ఇచ్చే ప్రయత్నం చేశాను. రంగాచార్యలోని చారిత్రక దృష్టి నాకు నచ్చితే నాలోని మానసిక విశ్లేషణాదృష్టి రంగాచార్యకు నచ్చింది.

# అగ్రశ్రేణి రచయితలలో ప్రముఖుడు

దాశరథి రంగాచార్య దాశరథి కృష్ణమాచార్య తమ్ముడే గానీ, అన్నని అనుసరించలేదు. కృష్ణమాచార్య మహాకవి. ఆయన నాకు అగ్రజుడు లాంటివాడు. రంగాచార్య కావాలనే కవిత్వం వైపు వెళ్ళలేదు. అతను నవలలు రచించాడు. చిల్లర దేవుళ్ళు అద్భుతమైన నవల. మోదుగు పూలు, జనపదం నవలల ద్వారా అతని కీర్తి ఇనుమడించింది. ఆ తర్వాత ఎన్నో రచనలు చేసినా మలిదశలో ఆధ్యాత్మిక రచనా రంగం వైపు వెళ్ళాడు. అక్కడ నుంచి ఆయన ధోరణి మారింది. వేషం మారింది. ధోవతి , పైన అంగవస్త్రం మాత్రం ధరించాడు.

దాశరథి రంగాచార్య అంటే ప్రధానంగా చిల్లర దేవుళ్ళు నవలే గుర్తుకు వస్తుంది. దాన్ని సినిమాగా కూడా చేసారు. కొందరికి ఆధ్యాత్మిక దృష్టి వున్నవాళ్ళకి అతని వేదానువాదాలపైనే మొగ్గు. ఒక్కమాటలో చెప్పాలంటే తెలంగాణలో ఆవిర్భవించిన అగ్రశ్రేణి రచయితలలో రంగాచార్య ప్రముఖుడు. ఆయన మరణం తెలంగాణ సాంస్కృతికోద్యమానికి తీరని లోటు.




పద్మభూషణ్
**ఆచార్య సి.నారాయణ రెడ్డి**
జ్ఞానపీఠ అవార్డు గ్రహీత
ఫోన్ నెం: 040-23548451


నాకు చాలా ఆశ్చర్యాన్ని కల్గించిన అంశేమేమిటంటే రంగాచార్య "చిల్లరదేవుళ్ళు"ను, "మోదుగుపూలు" ను చాలా వేగంగా పూర్తిచెయ్యడం. "చిల్లరదేవుళ్ళు"ను 13-10-1964 నాడు మొదలెట్టి, 10-11-1964 నాడు ముగించాడట. అంటే ఆ నవలను పూర్తి చెయ్యటానికి ఆయనకు నెలరోజులు కూడా పట్టలేదు. అలాగే "మోదుగుపూలు"ను 7-2-1970 నాడు ప్రారంభించి 18-5-1970న ముగించాడు. ఈ నవలను పూర్తి చెయ్యడానికి ఆయనకు మూడు నెలలు మాత్రమే పట్టింది. ఇంత తక్కువ కాలంలో నేను యే నవలనూ పూర్తి చెయ్యలేదు. "అంపశయ్య"ను రాయటానికి నాకు నాలుగేళ్ళు పట్టింది. (1964లో మొదలెట్టి 1968లో పూర్తి చేశాను.) మేం స్నేహితులమైన కొత్తలో రంగాచార్య గారు నాకో విషయం చెబుతుండేవారు: తనేదన్న నవల రాస్తే దాన్ని ఒకసారే రాసేస్తానని, మళ్లీ దానివైపు చూడనని అంటుండేవాడు. అందుక్కారణం: రాసిన దానిమీద ఆయనకు సంపూర్ణమైన సాధికారత ఉండటం అనుకుంటాను. మొదలే పాత్రల విషయంలో, సంఘటనల విషయంలో, సంభాషణల విషయంలో కట్టుదిట్టమైన ప్రణాళికను రూపొందించుకొని రచనకు పూనుకోవడం వల్ల ఒకసారి రాసిన ఆ రచనను మళ్ళీమళ్ళీ చదవటం, కొన్ని మార్పులు చేర్పులు చెయ్యడం లాంటివి అవసరం ఉండక పోవచ్చు.

కానీ నాకు యే రచననైనా ఒకసారి రాసేస్తే తృప్తి ఉండదు. మరోసారి చదవాలి. మార్పులు, చేర్పులు చెయ్యాలి. అప్పుడే దాన్ని యేదైనా పత్రికకు పంపించటమో లేక ప్రింటింగుకు ఇవ్వడమో జరుగుతుండేది. "అంపశయ్య"ను నేను మూడుసార్లు రాశాను. మొదటిసారి రాసినప్పుడు నా చేతిరాతలో వెయ్యి పేజీలదాకా సాగింది. ప్రధాన పాత్ర మనస్సులో చెలరేగే అసంఖ్యాకమైన ఆలోచనలను, జ్ఞాపకాలను యధాతథంగా చిత్రించే ప్రయత్నం వల్ల నవల సైజు విపరీతంగా పెరిగిపోయింది. రెండోసారి రాసినప్పుడు "ఇది బాగాలేదు" అనుకున్నప్పుడు ఆ భాగాల్ని తీసేసి, వెయ్యిపేజీలను 600 పేజీలకు కుదించాను. మరోసారి దాన్నింకా – నాల్గువందల పేజీలకు కుదించాను. ఈ విషయాన్ని నేను రంగాచార్య గార్కి చెబితే "అలాంటి పని నేనెప్పుడూ చెయ్యను. మొదటిసారి రాసిందే ఫైనల్" అన్నారు.

"చిల్లరదేవుళ్ళు"లో నాకు బాగా నచ్చిన అంశం: సంభాషణల్లో తెలంగాణా మాండలికాన్ని వాడటం. ఇది ఆరోజుల్లో గొప్ప సాహసమే! ఎందుకంటే తెలంగాణా మాండలికాన్ని వాడిన రచనల్ని ఆనాటి పత్రికలవాళ్ళు ప్రచురించే వాళ్ళు కాదు. అయితే తను సంభాషణల్లో వాడిన చాలా ఉర్దూ మాటలకు, తెలంగాణాకే ప్రత్యేకమైన పలుకుబళ్ళకు రంగాచార్య ఫుట్‌నోట్స్‌లో వివరణలు ఇవ్వాల్సి వచ్చింది. "చిల్లర దేవుళ్ళు"లో రంగాచార్య చేసిన ఈ ప్రయోగాన్ని చూశాక నేను చాలా థ్రిల్లయ్యాను. "అంపశయ్య"లో నేను కొన్నిచోట్ల సంభాషణల్లో తెలంగాణాలో వాడుకలో ఉన్న చాలా మాటల్ని వాడాను. కానీ రంగాచార్య వాడినంత విరివిగా నేనూ సంభాషణల్లో తెలంగాణా మాండలికాన్ని వాడలేకపోయానే అనుకున్నాను.

ఇక్కడొక ముఖ్యమైన విషయాన్ని తెలుగు యువ రచయితలకు చెప్పాలి. తెలుగు మాట్లాడే ఆయా ప్రాంతాల్లో వాడుకలో ఉన్న మాండలికాల్ని ఆయా ప్రాంతాల్లో ప్రజలెలా మాట్లాడ్తారో చెప్పడానికి మాండలికాల్ని సంభాషణల్లో వాడండి. అంతేగాని మొత్తం కథనంతా మాండలికాల్లోనే రాయాలనుకోవడం సరిఅయిన పద్ధతి కాదు. గిడుగు రామమూర్తి పుణ్యమా అని తెలుగుకొక వ్యావహారిక భాష అనేది స్థిరపడింది. నవల లేక కథలోని కథా కథనాన్ని వ్యావహారికభాషలో సాగించి సంభాషణల్లో మాత్రం – ఆయా ప్రాంతాల్లో జరుగుతున్న కథాస్థలాలను బట్టి, ఆయా ప్రాంతాల మాండలికాల్ని వాడండి. వట్టికోట ఆళ్వారుస్వామి గానీ, దాశరథి రంగాచార్య గానీ, నేను గానీ ఇదే పద్ధతిని అనుసరించాం.

"చిల్లరదేవుళ్ళు" నవలంతా చాలా బాగా రూపొందింది. కానీ ఈ నవలను రంగాచార్య ముగించిన విధానం మాత్రం నాకు నచ్చలేదు. నవల ప్రారంభంలోనే సంగీతం మేష్టారుగా రామారెడ్డి ఇంటికొచ్చిన సారంగపాణిని చివర్లో రెడ్డికి మేనల్లుణ్ణి చెయ్యడం – దొర రామారెడ్డి కూతురు మంజరికి సంగీతం నేర్పిస్తున్న సారంగపాణిని మంజరి ప్రేమిస్తుంది. ఎక్కన్నించో– అంటే విజయనగరం నుండి తెలంగాణా కొచ్చి సంగీతం పాఠాలు చెప్పుకుంటూ బతుకుతున్న సారంగపాణిని మంజరి ప్రేమించటమేమిటి? వాళ్ళిద్దరు పెళ్ళి చేసుకోవటాన్ని రెడ్డి కనీసం

ఊహించనైనా ఊహించడు. కాబట్టి వాళ్ళ పెళ్లి జరగటానికి వీల్లేదు అని అనుకుంటాడు. వాళ్ళు పెళ్లి చేసుకోకుండానే నవలను ముగిస్తే బావుందనుకొని- నిజానికి సారంగపాణి రెడ్డి గారి అక్కకొడుకేనని, అతని బాల్యంలో కృష్ణా నదికి జరిగిన తిరనాలప్పుడు తప్పిపోయాడని చెప్పి సారంగపాణి-మంజరిలకు మేనబావ, మేన మరదలు వరస కలిపేసి వాళ్ళ పెళ్ళికి ఎలాంటి అడ్డంకులు లేకుండా చేశాడు రచయిత. ఇలాంటి సినిమాటిక్ ముగింపు బాగాలేదని, ఇలా ఎందుకు చేశారని నేను రంగాచార్య గారిని అడిగాను. ఆయన చెప్పిన సమాధానం నన్ను ఆశ్చర్యపరచింది.

"ఈ నవలను మొట్టమొదలు చదివింది నాకు అత్యంత ఆత్మీయుడైన నార్ల చిరంజీవి. నేను సారంగపాణికి, మంజరికి పెళ్ళి జరిగే అవకాశం లేదన్నట్టుగానే ముగించాను. నార్ల చిరంజీవి ఈ ముగింపు బాగాలేదు. పాణి రెడ్డిగారి మేనల్లుడే అన్నట్టుగా ముగిస్తే రేపెవరైనా ఈ నవలను సినిమాగా నిర్మించే అవకాశం ఉంటుందని చెప్పి, మీరన్నట్టు ఆ నవలను ఇట్లా సినిమాటిక్‌గా ముగించేలా చేశాడు. నార్ల చిరంజీవి నాకు భాయిజాన్... "చిల్లరదేవుళ్ళు" అని పేరు పెట్టింది ఆయనే. ఆయన మాట వినకుండా ఎలా ఉంటాను'' అన్నాడు రంగాచార్యగారు. నిజమే! ఈ నవలకు ''చిల్లరదేవుళ్ళు'' అన్న అద్భుతమైన, అర్థవంతమైన పేరు పెట్టినందుకు నార్ల చిరంజీవిని అభినందించాలో, లేక ఇలాంటి సినిమాటిక్ ముగింపును సూచించి నందుకు బాధపడాలో నాకర్థంకాలేదు.

"మోదుగుపూలు" కూడా ఇంచుమించు "చిల్లరదేవుళ్ళు"లాగే ప్రారంభమౌతుంది. మొదటి నవలలో పాణి వయలిన్ కేసు చేతిలో పట్టుకొని రెడ్డిగారి గడీకొస్తాడు. "మోదుగుపూలు"లో రఘు అక్బార్‌ను (వార్తాపత్రిక) చేతిలో పట్టుకొని ట్రెయిన్ దిగి వాళ్ళ మేనమామ వీరయ్య ఇంటికొస్తాడు. జాగీరుగా ఉన్న ఊర్లోకి అక్బార్ తెచ్చినందుకు అమీన్ (సబ్‌ఇన్‌స్పెక్టర్) రఘును చెంపదెబ్బ కొడ్తాడు. "చిల్లరదేవుళ్ళు"లోనూ, "మోదుగుపూలు"లోను ఒకటే వాతావరణం - యేడో నిజాం రాజు హైదరాబాద్ సంస్థానాన్ని పాలిస్తున్న రోజుల్లో గ్రామాధికారులైన దొరలు, పట్వారీలు, పటేళ్ళు, అమీన్లు, తాసీల్దార్లు బడుగు బలహీనవర్గాల వారి మీద ఎంత అమానుషమైన దౌర్జన్యాన్ని, దోపిడీని చేస్తుండేవాళ్ళో - ఈ రెండు నవలల్లోనూ రంగాచార్య చిత్రించాడు. "చిల్లరదేవుళ్ళు"లో ఈ దౌర్జన్యానికి ప్రతిఘటన ఉంటుంది. "మోదుగుపూలు"లో ఈ ప్రతిఘటన సాయుధ పోరాటంగా మారుతుంది. ఈ రెండు నవలల్లోను ముఖ్యపాత్రల నన్నింటినీ వ్యక్తిగతంగా మంచివాళ్ళు చెడ్డవాళ్ళు అని కాకుండా ఆనాటి వ్యవస్థకు ప్రతినిధులన్నట్టుగా, వ్యవస్థను బట్టే మనుష్యుల ప్రవర్తన ఉంటుందన్నట్టుగా రచయిత మనకు పదేపదే చెబుతుంటాడు. వ్యవస్థ మంచిదయినప్పుడు ప్రతి వ్యక్తిలోనూ మంచితనం ఉంటుందంటాడు రంగాచార్య. రంగాచార్యలోని మార్క్సిస్టు అవగాహనే ఆయన వ్యవస్థకింత ప్రాధాన్యం ఇవ్వటానికి కారణం.

"చిల్లరదేవుళ్ళు, మోదుగుపూలు, జనపదం" - ఈ మూడు నవలల్ని ఒకదానికొకటి కొనసాగింపుగా రాశానని రంగాచార్య చెప్పాడు. నేను కూడా ఇలాంటి ప్రయోగమే చేశాను. ''అంపశయ్య''కు కొనసాగింపుగా ''ముళ్ళపొదలు'', దానికి కొనసాగింపుగా "అంతఃస్రవంతి" - ఇలా ఒక త్రయనవలని- (ట్రిలోజిని) పాఠకుల ముందుంచాను. అయితే రంగాచార్య రచించిన ఈ మూడు నవలల్లోని పాత్రలు వేర్వేరుగా కనిపిస్తారు. నేను రచించిన ఈ మూడు నవలల్లోను మొదటి నవలలో ఉన్న పాత్రలే ఉంటాయి. రంగాచార్య రచించిన మూడు నవలల్లోను చారిత్రక దృష్టి ప్రధానమైతే నేను రచించిన ఈ మూడు నవలల్లో మానసిక విశ్లేషణా దృష్టి ప్రధానం. అయితే ఇక్కడొక విషయం చెప్పాలి. నేను కూడా ప్రధానంగా చారిత్రక దృష్టితో "కాలరేఖలు", దానికి కొనసాగింపుగా "చెదిరిన స్వప్నాలు"ను, దానికి కొనసాగింపుగా "బాంధవ్యాలు"ను, దానికి కొనసాగింపుగా "ఏ వెలుగులకీ ప్రస్థానం" నవలల్ని రచించాను. "కాలరేఖలు" నవలకు రంగాచార్య రచించిన "మోదుగుపూలు", "జనపదం" నవలలకు కొన్ని పోలికలున్నాయి. 2002లో "కాలరేఖలు" నవలను ఆవిష్కరిస్తూ రంగాచార్య "తెలంగాణా రైతాంగ సాయుధ పోరాటం" రచయితలకు, కళాకారులకు గొప్ప ఉత్తేజాన్ని కల్గించింది. కళల సృష్టికి అదొక తరగని గని. ఇప్పుడు నేను ఆవిష్కరిస్తున్న ఈ కాలరేఖలు నవలలో కూడా నవీన్ ప్రధానంగా తెలంగాణ రైతాంగ సాయుధ పోరాట చిత్రణతో పాటు ఆనాడు రజాకార్లు సాగించిన దురాగతాల్ని కూడా చిత్రించాడు" అన్నాడు.

"జనపదం"లో 1948లో పోలీసు యాక్షన్ జరిగి హైదరాబాద్ సంస్థానాన్ని ఇండియన్ యూనియన్‌లో విలీనం చెయ్యడం, 1951లో కమ్యూనిస్టులు సాయుధ పోరాటాన్ని విరమించి సార్వత్రిక ఎన్నికల్లో పాల్గొనటం, నగరాలకు వెళ్లిపోయిన దొరలంతా కాంగ్రెసు టోపీలు పెట్టుకొని తిరిగి పల్లెటూళ్లకొచ్చి కమ్యూనిస్టులు పేదలకు పంచిన వాళ్ళ భూముల్ని తిరిగి స్వాధీనం చేసుకోవటం - మొదలైన సంఘటనలన్నీ చిత్రితమయ్యాయి. 1951లో కమ్యూనిస్టులు (సంగపోళ్ళు) సాయుధ పోరాటాన్ని విరమించటంతో "జనపదం" నవల ప్రారంభమై 1967లో నక్సలైట్లు తిరిగి సాయుధ పోరాటాన్ని ప్రారంభించటంతో ముగుస్తుంది. ముఖ్యంగా ఎన్నికల పేరుతో, పంచవర్ష ప్రణాళికల పేరుతో ఉన్నవాడే ఇంకా ఉన్నవాడుగా మారటం, లేనివాడు ఇంకా లేనివాడుగా మారటం, పైరవీకారులు, బ్రోకర్లు విచ్చలవిడిగా డబ్బులు సంపాదించటం - విద్యా వ్యవస్థ కూడా రౌడీలకు నిలయంగా మారటం - ఈ వాతావరణం "జనపదం"లో చిత్రించబడింది.

"కాలరేఖలు" 1944లో జరిగిన పదకొండో ఆంధ్ర మహాసభతో ప్రారంభమౌతుంది. ఆంధ్ర మహాసభ ఉద్యమం కమ్యూనిస్టుల చేతుల్లోకి వెళ్లడంతో, 1946లో దొడ్డి కొమురయ్య హత్య తర్వాత సాయుధ పోరాటం ప్రారంభం కావడం, 1947లో దేశానికి స్వాతంత్రియం వచ్చినా హైదరాబాద్ సంస్థానాన్ని యేడో నిజాం రాజు భారతదేశంలో విలీనం చెయ్యటానికి అంగీకరించకపోవటం, దాంతో కాశింరజ్వీ నాయకత్వంలోని రజకార్లు తెలంగాణాలో మారణహోమాన్ని సృష్టించటం, పోలీసుయాక్షన్ తర్వాత యూనియన్ పోలీసులు కమ్యూనిస్టుల్ని ఊచకోత కోయటం, 1951లో కమ్యూనిస్టులు సాయుధ పోరాటాన్ని విరమించటం - తర్వాత జరిగిన ఎన్నికలు - ఇలా 1956లో తెలుగు మాట్లాడే వాళ్ళందర్నీ ఒకగొడుగు కిందకు చేర్చి ఆంధ్రప్రదేశ్‌ను ఏర్పాటు చెయ్యటంతో "కాలరేఖలు" నవల ముగుస్తుంది.

ఇలా "జనపదం" నవల సృష్టించిన ఒరవడిలోనే "కాలరేఖలు" నవల సాగింది. "జనపదం" నవలను రచించాక రంగాచార్య గారు ఆ నవల రాత ప్రతిని చదవండని నాకిచ్చాడు. దాన్ని చదివి నేనాయనకు

# వచన రచయితలకు పెద్ద దిక్కు

రంగాచార్య పేరు చెప్పగానే స్ఫురించే నవలలు : చిల్లరదేవుళ్ళు, మోదుగుపూలు, జనపదం. తెలంగాణా పోరాట నవలల్లో వాటికి విశిష్ట స్థానం వుంది. అవి గ్రామీణ నేపథ్యంలోంచి వచ్చినవి. కాల్పనికత పాలు అవసరాన్ని మించి వుండడం వల్ల వాటిని పూర్తి పోరాట నవలలని చెప్పలేం. ఆ తర్వాతి కాలంలో పట్టణ మధ్య తరగతి జీవితాల్ని తీసుకొని ఆయన చేసిన రచనలు వాస్తవికతకి దగ్గరగా ఉంటాయి. కానీ విమర్శకులు వాటి గురించి తక్కువ మాట్లాడతారు. అన్న కవిత్వాన్నీ, తమ్ముడు వచనాన్నీ పంచుకొన్నారన్నట్లు దాశరథి సోదరులు సాహిత్య తెలంగాణ మలిదశ ఉద్యమంలో వచన రచయితలకి ఒక విధంగా దాశరథి రంగాచార్య పెద్దదిక్కుగా కనిపించారు. ఆయన్ని ఆలంబన చేసుకొని తెలంగాణ కథా నవలా రచయితలు సమీకృతమయ్యే ప్రయత్నాలు జరిగాయి. 1995 – 2000 సం.ల మధ్య కాలంలో ఆయన సమక్షంలో తెలంగాణ రచయితల సమావేశాలు అనేకం జరిగాయి. అదే కాలంలో ఆయన ఆధ్యాత్మిక రచనలు సమాంతరంగా నడిచాయి. తెలంగాణలో శ్రీ వైష్ణవ సంప్రదాయంలోని రచయితలు భిన్నమైన రాజకీయాభి ప్రాయాలు కల్గి ఉండటం, వాటి మధ్య వైరుధ్యాన్ని పాటించక పోవడం చాలా మంది విషయంలో గమనిస్తాం. శ్రీ వైష్ణవంలోని తొలినాటి సామాజిక సమానత్వ సిద్ధాంతాన్ని రంగాచార్య కూడా అభిమానించి, ఆచరించారు. ఆయన భార్యకు షష్టిపూర్తి చేశారు. అంతేకాదు ప్రతి సంవత్సరం అడుగు వర్గాలనుంచి వచ్చిన రచయితలను సన్మానించడం ఆనవాయితీగా పెట్టుకొన్నారు. ప్రగతిశీల శిబిరాలకు తలలో నాలుకలా మెలిగారు. ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని కూడా విమర్శనాత్మకంగానే సమర్థించారు. గత 15 – 20 సంవత్సరాలు ఆయన రచయితగానే కాకుండా వ్యక్తిగా కూడా తెలంగాణ సమాజంపై బలమైన ముద్ర వేశారు.




**డా. కె. శ్రీనివాస్**
**సాహిత్య పరిశోధకుడు,**
**సంపాదకుడు, ఆంధ్రజ్యోతి**
**ఫోన్: 9985411077**


కొన్ని సూచనలు చేశాను. ఉదాహరణకు మంగమ్మ పాత్ర చిత్రణ సరిగ్గా జరగలేదని, దాన్ని మార్చాలని నేనాయనకు సూచించాను. మంగమ్మ ఈ నవలలో చాలా ముఖ్యమైన పాత్ర. పోరాటంలో మరణించిన జగ్గయ్య భార్య మంగమ్మ. అజ్ఞానదశలో ఉన్న మంగమ్మను రామయ్య మోసగించి అనుభవిస్తాడు. ఆత్మహత్య చేసుకోబోతున్న మంగమ్మను వీరభద్రం రక్షిస్తాడు. ఆమె కడుపులో పెరుగుతున్న రామయ్య బిడ్డకు తాను తండ్రినౌతానంటాడు. వీరభద్రం సాహచర్యంలో మంగమ్మ విజ్ఞానవంతురాలౌతుంది. రామయ్యలాంటి దుర్మార్గునికి వ్యతిరేకంగా ప్రజలు జరుపుతున్న ఎన్నో పోరాటాలకు మంగమ్మ నాయకత్వం వహిస్తుంది. కాని మంగమ్మ పాత్రకు రచయిత చాలా అన్యాయం చేశాడనిపించింది. ఎన్నికల్లో రామయ్యకు వ్యతిరేకంగా పోటీచెయ్యటానికి మంగమ్మ అంగీకరిస్తుంది. మంగమ్మతో పోటీచేసి తాను గెలవలేనని తెలుసుకున్న రామయ్య ఓ అర్ధరాత్రి మంగమ్మ ఇంటికొచ్చి నువ్వు నాతో పోటీ చేస్తే ఈ బావిలోకి దూకి చస్తాన'ని బెదిరిస్తాడు. మంగమ్మను విరమింపజేయటానికి రామయ్య ఈ ఎత్తు వేశాడని తెలుస్తూనే ఉంది. మంగమ్మ తాను పోటీ చెయ్యనని రామయ్యకు మాట ఇవ్వటం మనల్ని ఆశ్చర్యపరుస్తుంది. ఎన్నో ప్రజా పోరాటాలకు నాయకత్వం వహించిన మంగమ్మ, రామయ్యలాంటి పచ్చి దుర్మార్గుడికోసం, తనను నమ్ముకున్న ప్రజల్ని మోసగించి ఎన్నికల్లో నిలబడకుండా తప్పించుకుంటుందా? అలాగే కొన్ని మహిమల్లాంటివి (సరస్వతి పాత్ర) కూడా నవలలో ఉన్నాయని, వాటిని కూడా తీసెయ్యాలని చెప్పాను. కానీ రంగాచార్య సాధారణంగా ఒకసారి రాసిన నవలను మళ్లీ మార్చడని నాకు తెలుసు. యేదీ యేమైనా ఆయనా నేనూ కొంతకాలం ఒకే పడవలో పయనించి నవలల్ని రచించామని చెప్పడానికే ఈ వ్యాసం. 1990ల నుండి ఆయన పూర్తిగా ఆధ్యాత్మికం వైపు వెళ్ళాడు. వేదాలను అనువదించే పనిలో మునిగాడు. అప్పట్నించి నేనాయనను ఇదివరకటిలా తరచుగా కలుసుకోవడం తగ్గిపోయింది.

... అయిదారు నెలల క్రితం మిత్రుడు ముకుంద రామారావు సప్తతి ఉత్సవ కార్యక్రమంలో పాల్గోడానికి హైదరాబాద్ వెళ్ళినపుడు రంగాచార్య కుమారుడు విరించి కలిశాడు (ముకుంద రామారావు 'ఆకాశ యానం' కవిత్వాన్ని రంగాచార్యకి అంకితం చేస్తే తండ్రిగారి తరపున తొలి ప్రతి స్వీకరించడానికి వచ్చాడు) . నాన్న యెలా వున్నారని అడిగితే బాగాలేరని చెప్పాడు. నేను నాన్నగార్ని చూడాలని అనగానే 'నాతో రండి సార్' అంటూ తన కారులో వాళ్లింటికి తీసుకెళ్ళాడు. అక్కడ రంగాచార్యని చూడగానే నా గుండె వొక్కసారే బరువెక్కింది. పరాకు మాటలు , మాటల్లో పొంతన లేనితనం , ఎవర్నీ గుర్తుపట్టలేని పరిస్థితి.

'నన్ను గుర్తుపట్టారా' అని అడిగితే కాసేపు తేరిపారా చూసి 'మిమ్మల్ని గుర్తుపట్టక పోవడం ఏమిటి?' అన్నాడేగానీ గుర్తుపట్టినట్లు నాకన్పించలేదు. అంపశయ్య నవీన్ గారు అని విరించి నన్ను చూపించినా ఆయనలో స్పందన లేదు. ఆయన శ్రీమతి కమల కళ్ళ నీళ్ళు తీసుకొని 'ఆయన అన్నీ మర్చిపోయాడు. అందర్నీ మర్చిపోయాడు' అంది.అదే చివరి చూపు అవుతుందని నేనూ అనుకోలేదు. తన రచనల ద్వారా తెలంగాణనే శ్వాసించిన మహా రచయిత అలా వెళ్ళిపోయాడు. ఆ మహా రచయితకి నా జోహార్లు.


**కేంద్ర సాహిత్య అకాడెమీ పురస్కార గ్రహీత**
**ఫోన్ : 9989291299**

దాశరథి ప్రత్యేకం

డా॥ జయధీర్ తిరుమలరావు

# విలక్షణతకి మారుపేరు



సాహిత్య కళారంగాలలో తమదైన ముద్రవేసి కూడా, జీవితంలో తమదైన వ్యక్తిత్వం లేనివారు చాలా మంది ఉంటారు.

ఈ రెండు రంగాలలో తన విలక్షణతనిచాటి చెప్పినవారు దాశరథి రంగాచార్య (24-8-1928 - 8-6-2015).

నలభయ్యో ఏట, ఆలస్యం గానే అయినా చిల్లరదేవుళ్ళు' రచన మొదలుపెట్టాడు. ఇరవై ముప్పై ఏళ్ళక్రితం తాను కళ్ళారా చూసిన తెలంగాణా ప్రజోద్యమాన్ని పాఠకుల హృదయాలమీద చెక్కు చెదరకుండా ముద్రించాడు.

చిల్లర రాళ్ళకు మొక్కుతు ఉంటే చెడిపోదువురా ఒరే ఒరే అన్నట్లుగా భూస్వాములకూ, జమీందారులకూ, జాగీరుదారులకు, దొరలకు, కరణాల వంటి చిల్లర దేవుళ్ళకు భయపడకురా ఒరే ఒరే అని చెప్పడం కోసమే చిల్లర దేవుళ్ళు నవల రాశాడు. అలా నాలుగు దశాబ్దాల పాటు రాస్తూ వచ్చాడు. ఈ నవలలో 1938 ప్రాంతాలనుండి తెలంగాణాలోని ఓ గ్రామంలో జరిగిన రాజకీయ సామాజిక ఆర్థిక దోపిడీ విధానం, దొరల దోపిడీకి సహకరించిన గ్రామాధికారుల దౌష్ట్యాన్ని చిత్రించాడు. ఈ దోపిడీ విధానాన్ని ఎదిరించే ప్రజలలో వెల్లివిరిసిన చైతన్యాన్ని సంఘటనలవారిగా రాశాడు. ఈ నవలలో మొదటిసారిగా గ్రామం, గ్రామీణ జీవితం వాస్తవికంగా చిత్రించబడింది. తెలంగాణ రైతాంగ ఉద్యమంపై తెలంగాణ రచయితలు, ఇతర ప్రాంత రచయితలు అందరూ కలసి మొత్తం 21 నవలలు రాశారు. వాటన్నింటిలోకెల్లా చిల్లర దేవుళ్ళలో గ్రామీణ వ్యవస్థని ప్రజాజీవితం కోణంలోంచి కులాలవారిగా నిర్దిష్టంగా అర్థం చేయించారు. దొరలుగా రెడ్లు, వెలమలు, కొందరు కరణాలూ ఉండేవారు. ఈ దొరల గడీలలో జరిగే అకృత్యాలనే కాదు గ్రామాధికారులుగా పనిచేసే కులాల దోపిడి విధానాలను ఉన్నది ఉన్నట్లుగా రాశారు. చిల్లర దేవుళ్ళు నవలలో కథానాయకుడు సారంగపాణి ముందే ఆ ఊరి కరణం దొంగలెక్కలు రాసి లంబాడీలను మోసం చేసాడు. పైగా వారు ప్రశ్నిస్తే వారితోనే తామే దొమ్మీకి పోయామని బలవంతంగా పోలీసులముందు చెప్పిస్తాడు కరణం. తన బిడ్డ మంగమ్మను ఇచ్చి సారంగపాణికి పెళ్ళి చేయాలని చూస్తాడు.



కానీ అది సాధ్యంకాదు. కరణం విశృంఖల స్త్రీలోలత్వం వల్ల ఎందరో మహిళలకు అన్యాయం చేస్తాడు. కూతురు మంగమ్మ ఓ మగవాడి కామానికి బలై రోడ్డున పడుతుంది. కరణం లైంగిక దోపిడి, లైంగికేచ్ఛల ప్రభావం తన కూతురుపై పడింది. బయటి స్త్రీలు, ఇంటి వాళ్ళ జీవితాలు భయానక బాధలకు గురికావడానికి తెలంగాణాలోని ఓ కరణం పంతులు ఎలా కారణభూతుడయ్యాడో రచయిత స్పష్టంగా రాశాడు. ఇలాంటి అంశం తెలుగు సాహిత్యంలో కొత్తది. అపరిమిత అధికారాల వల్ల, పెద్ద కులాలకి తైనాతీలుగా, కింది కులాల వారి పట్ల, బలహీనుల పట్ల వారి ప్రవర్తన ఎలా ఉంటుందో వివరంగా తెలిపారు. ఈ కులం వారే తెలంగాణాలో ప్రగతిశీల రంగం ఎదుగుబొదుగు లేకుండా ఇంకా తమ పెత్తనాన్ని ఎలా కొనసాగిస్తున్నారో ఇప్పుడు తేటతెల్లం అవుతుంది. ఇది రంగాచార్య దార్శనికతగా భావించవచ్చును.

'మోదుగు పూలు' నవలలో నైజాం ప్రభువుల కింద పనిచేసే అధికారులు, ఉద్యోగుల దోపిడిని కూడా చిత్రించారు. ఈ నవలకు భూమిక ఖమ్మం జిల్లాలోని 'గార్ల' గ్రామం. కథానాయకుడు రఘు దినపత్రిక పట్టుకున్నందుకు మొహత్‌మీన్ చెంపదెబ్బ వేస్తాడు. ఆ తరువాత రజాకార్ల దాడి జరుగుతుంది. ఈ నవలలో ముస్లిం అయిన తహసిల్‌దారు. చిల్లర దేవుళ్ళలో హిందువు అయిన ఊరి కరణం లైంగిక దాడులు చేసి స్త్రీల ధన మాన ప్రాణాలు హరించడం ఒక్కటే. ఇక్కడ మతాలు అడ్డురాలేదని రంగాచార్య అన్యాపదేశంగా చెప్పాడు.

మూడో నవల 'జనపదం' సంఘనాయకుడు వీరభద్రం. 1948లో పోలీసు చర్య తదుపరి 1968 వరకు అసంతృప్తితో రగిలిన యువత పరిస్థితి ఇందులో చిత్రితమైంది. స్వాతంత్ర్యం తదుపరి, నైజాం భూస్వామ్య పాలన అంతమైన తదుపరి మారిన గ్రామ జీవన విధానం, స్వరూప స్వభావాలను, మారని శ్రమజీవుల బాధలను చిత్రించింది.

ఈ మూడు నవలల్లో ఒక అంతస్సూత్రం ఉంది. వెరసి తెలంగాణా బతుకు చిత్రం. ఈ రకమైన నవలాత్రయాన్ని రాసి తన ప్రత్యేకత నిలుపుకున్నాడు. ఇతివృత్తంలో కింది వర్గాల, కులాల జీవితాన్ని తెలిసిన మేర నిజాయితీగా చిత్రించాడు.

అలా ఎనిమిది నవలలు, రెండు ఆత్మచరిత్రలు, మూడు కథా సంపుటాలు, నాలుగు జీవిత చరిత్రలు, రెండు కవితా సంపుటాలు,



నాలుగు విమర్శ గ్రంథాలు, నాలుగు అనువాద గ్రంథాలు రచించాడు. వేదాలు, ఇతిహాసాలను చక్కని తెలుగులోకి అనువదించాడు. అలా అనేక రకాల సాహిత్య ప్రక్రియలలో కృషి చేశాడు. ఈ రచనలలో అప్పటివరకు ప్రాపంచిక దృక్పథంలో అతను విప్లవవాది. అభ్యుదయ రచయితల సంఘంలో క్రియాశీల కార్యకర్త. ఒక పక్కా మార్క్సిస్టు పదవీ విరమణ (1988) పొందేవరకు ఇదే ధోరణి.

ఆ తరువాత ఆహార్యంలో మార్పు వచ్చింది. పేంటు, బుషర్ట్ స్థానంలోనే మడిచి కట్టిన ధోవతి, భుజాలపై ఉత్తరీయం వీపులో జందెం, నుదుటినిండా పొడవైన పట్టెనామాలు. ఈ ఆహార్యంతోనే బయటకు వచ్చేవారు. కమ్యూనిస్టు సభల్లో పౌరహక్కుల సభల్లో సైతం అలాగే పాల్గొనేవారు.

రంగాచార్య గొంతుకూడా ఎంతో విలక్షణంగా ఉంటుంది. ఒక జీర వినిపించినా అది వినడానికి ఎంతో ఆకర్షణీయంగా ఉండేది. తనదైన భాష, మాట్లాడే శైలి. శ్రోతలను బాగా ఆకట్టుకోగలిగిన రీతిలో ఆయన ప్రసంగించే వారు. పాలకులనీ, రాజ్యాన్ని విమర్శించడంలో ఎప్పుడూ వెనుకంజవేయలేదు. పౌర, మానవ హక్కులకు భంగం కలిగితే ఏనాడూ సహించలేదు.

తెలంగాణా ప్రజాపోరాట వారసత్వాన్ని భావజాలపరంగా కొనసాగించాడు. అదే అతనిని రచయితగా, చైతన్యవంతమైన మనిషిగా నిలిపింది. ఆ చైతన్యమే 'జీవన యానం' రచనలో కనిపించింది.

నేను మొదట కమ్యూనిస్టుని అని ప్రకటించుకునే రంగాచార్య రానురాను ఆధ్యాత్మిక వాదంవైపు అడుగులు వేశారు. ఐనా రెంటికీ నడుమ ఒక లింకు ఏర్పరచాలని ప్రయత్నిండాడు. కాని అది రానురాను ఆయనకి భారం కలిగించిందేమో. అభ్యుదయ సభలకి రావడం ఆగిపోయింది. జన విజ్ఞాన వేదిక, హేతువాద కార్యక్రమాలకి, విప్లవ సాంస్కృతిక సభలకి రావడం తగ్గిపోయింది. బొట్టు, జందెం వంటివి మార్క్సిస్టు సంకేతాలు కావు. భౌతికవాదం, భావ వాదం మధ్య, హేతువు, కల్పనల మధ్య వైరుధ్యం. 'జీవన యానం'లో మనిషిని, సమాజాన్ని విశ్లేషించే రూపులో భారత రామాయణాలు, వేదాల అనువాదం తనకి తనకే కొంత ఎడం కనుపించిందేమో. దానికి తోడు అనారోగ్యం ఆవహించింది. వేదానువాదం వల్ల ఆర్థికంగా కొంత నిలదొక్కుకున్నాడు. ఆ పుస్తకాలు రికార్డుస్థాయిలో అమ్ముడుపోయాయి. ప్రచురణకర్తలు ఖుషీ అయ్యారు. కాని రంగాచార్య వ్యక్తిగా, రచయితగా పూర్వపు పునాది నుండి కదిలిపోయారు.

ఆ పొట్టి మనిషిలోని గట్టిదనం తగ్గింది. కాలంలో దాగిన జనశక్తి స్థానంలోనే ఆధ్యాత్మిక భావన చోటుచేసుకుంది. ఆయన మతపరంగా శ్రీ వైష్ణవుడు. హృదయపరంగా మానవతావాది. అంతరాంతరాలలో మనిషిని ప్రేమించే తత్వం నిండుగా ఉంది. అక్కడే రంగాచార్య తన వ్యక్తిత్వాన్ని నిలుపుకున్నాడు.

సైద్ధాంతిక చట్రంలోంచి స్వేచ్ఛగా బయటపడి ఎన్నో రచనలు చేశాడు. బుద్ధుడి మీద, సుప్రసిద్ధ రచయిత ప్రేమ్‌చంద్ మీద జీవిత చరిత్రలు రాశాడు. భూస్వామ్య సాహిత్య సంగీత నృత్య కళారంగంలో భాయిజీగా ఉంటూ తన వ్యక్తిత్వం నిలుపుకోవడంకోసం ఉమ్రావ్‌జాన్ పోరాడింది. తెలుగులోకి 'ఉమ్రావ్ జాన్ అదా' జీవిత గ్రంథాన్ని అనువదించాడు.

రంగాచార్య బతికిన చివరి పదేళ్లలో జరిగిన సంఘటనలు,మార్పులని పరిశీలించి పరిశోధనాత్మక నవల రాస్తే, ఒక రచయిత పడిన భావ సంఘర్షణ తెలియవచ్చే వీలుంది. ఏది ఏమైనా రంగాచార్య మార్క్సిజానికి దడి కట్టకుండా, ఆధ్యాత్మికతని గుడి చేయకుండా తనదైన రీతిలో జీవించాడు. అవార్డులకు వ్యతిరేకం కాదు. కాని వాటికోసం వెంపర్లాడలేదు. సమాజంలోని నిస్సారతని ఎదిరించి ఎంతో కొంత చైతన్యాన్ని పొందుతూ, దానిని సమాజానికి అందించాడు. అదే అతని ప్రత్యేకత.

ప్రత్యేక రాష్ట్రం పొందాక అతనికి దక్కవలసిన ఫలితం చవి చూడకుండానే ఆవలితీరం దాటడం అదృష్టమో, దురదృష్టమో తెలీదు. రాజు రాకుండా, రాజ్యం అధికారికంగా అంత్యక్రియలు నిర్వహింప బడడం చూసి ఉంటే ఆ ధోరణిని రంగాచార్య హర్షించేవాడు కాదు.

రంగాచార్య తెలంగాణా తేజం.

కాని ముందుగా అతను తెలుగు సాహిత్యం మొత్తానికి అగ్రగామి.

ఒక భోళా మనిషి, చిల్లర రాజకీయాలు తెలియనివాడు. ఈర్ష్యా అసూయలు లేని వ్యక్తి. అపరిపూర్ణతలో పరిపూర్ణత సాధించిన రచయిత. అలాంటివాడు మరణించడం బాధాకరం. ఇప్పుడున్న వృద్ధతరంలో ఒక పెద్దదిక్కుని కోల్పోవడం సాహిత్య ప్రపంచానికి లోటే.

*రచయిత ఫోన్: 9951942242*

*(ఆంధ్రభూమి దినపత్రిక సౌజన్యంతో)*

- శ్రీ సిహెచ్. లక్ష్మణ చక్రవర్తి

# దాశరథి రంగాచార్య - ఆధునిక సనాతనుడు



దాశరథి రంగాచార్యులు చరిత్రలో నాలుగు వేద సంహితలను వచనంలో తొలిసారిగా అందించిన ఆద్యులు. ఒక బ్రాహ్మణం, పది ఉపనిషత్తులను వచనంలో అందించిన ఒక ఋషి. భారతీయ తాత్వికతను సకల జనులకు అందజేయాలని పరితపించిన ఒక తపస్వి. తెలంగాణ సాయుధ పోరాటంలో పాల్గొని తెలంగాణ జన జీవనాన్ని నవలలుగా అందించిన అక్షరవాచస్పతి. సాయుధ పోరాటంలో పాల్గొన్న రోజులలో తనను తాను కమ్యూనిస్టు గా చెప్పుకున్నా దైవం పట్ల విశ్వాసం ఆయనకు ఉందనడానికి నిదర్శనం తాను రాసిన నవలకు చిల్లరదేవుళ్ళు అని పేరు పెట్టడం. పోరాట వాదిగా, ఆదర్శవాదిగా, మానవతావాదిగా, ఆధ్యాత్మిక వాదిగా ఎదిగిన ఆయనలో ఒక ఆంతరిక చైతన్యవికాసం కనిపిస్తుంది. అది రచనలలో ప్రతిబింబించడం మన భాగ్యం.

ఈ ఆంతరిక ఆధ్యాత్మిక చైతన్యవికాసంతో రంగాచార్యులు భాగవత, రామాయణ, మహాభారతాలను సరళవచనంతో రచించారు. తొలిసారిగా నాలుగు వేదాలను తెలుగులోనికి అనువదించారు. వేదాలకు ప్రవేశికగా వేదాలు మానవజాతి అభివృద్ధిపై ఎలాంటి ప్రభావం చూపాయో తెలుపుతూ నేటి యాంత్రిక నాగరికతకు వేదసాహిత్యంలో ఎటువంటి సమాధానాలు ఉన్నాయో వివరిస్తూ వేదం-జీవననాదం అందించారు. ఋగ్వేదదర్శనంలో ఋగ్వేదంలో 1017 సూత్రాలు, 10,580 ఋక్కులు, 1,53,826 శబ్దాలు, 4,32,000 అక్షరాలు ఉన్నటువంటి మంత్రాలను సంపూర్ణజ్యోతితో దర్శించడానికి రంగాచార్య రోజుకు 10 గంటలకు పైగా పరిశ్రమించి తొమ్మిది నెలల్లో 6 వేల పేజీలు చదివి తెలుగులోకి అనువదించారు. చిన్నతనంలో 'దంతాన్ ధావయేత్రాతః పలాశవటపిప్పలై' అంటూ తండ్రిగారు చదివే వేదమంత్రం విని మానవుని దంతధావనం మొదలు సమస్తం నేర్పించే వేదం ఎలా ఉంటుందో అనే ఆసక్తితో వేదాన్వేషణ మొదలుపెట్టి నేనేమిటి వేదాన్ని గురించి ఆలోచించడమేమిటి,వేదాన్ని వ్రాయడమేమిటి అంటూనే వేదనాదంతో వేదాలను దర్శింప జేశారు.అనన్తావై వేదాః అంటూ వేదానికి అపరిమితం అని అర్థం చెప్పారు.

వేదసంహితను పరిచయం చేస్తూ వేదం మనిషి మలినాన్ని దూరంచేసి దైవత్వపు అంచులకు కొనిపోయేది కాబట్టి పదానికి గల బాహ్య అర్థంతో మాత్రమే అర్థం చేసుకోవడం,పరిమిత జ్ఞానంతో పరిశీలించడం సమంజసం కాదు అన్నారు. పాశ్చాత్యులు భారతదేశానికి యాత్రికులుగా వచ్చి సాంస్కృతిక సంపదను, రత్నరాసులను కొల్లగొట్టారు కానీ భారతదేశానికి అసలు సంపదలైన వేదాలు, ఉపనిషత్తులు, రామాయణ, భారత, భాగవతాలు, అనంతమైన సాహిత్యశిల్ప సంపదలు దోచుకోలేకపోయారు. అవి భారతదేశ అక్షయ సంపదలు,అనంతమైన సంపదలు అని కొనియాడారు.



ఒక పరిపుష్టమైన సంస్కృతము వంటి భాషకు జన్మనిచ్చిన మహోన్నత సంస్కారం గల సమాజం వేదకాలపు సమాజమని, సంస్కృతం అన్న పదంలోనే ఎంతో సంస్కారముంది సంస్కారంతో ప్రారంభమైన భాష మరొకటి లేదన్నారు. సంస్కృత లిపి దేవనాగరి యొక్క అక్షరమాల పరిపూర్ణమైనదని, భారతభాషలన్నీ ఈ లిపినే అవలంబించాయని అటువంటి లిపి లేనిదే అనంతమైన వేదాలను భద్రపరచడం సాధ్యం కాదని వేదకాలం నాటి భాష, లిపులను కొనియాడాడు. వేదం యొక్క శృతి వినసొంపుగా స్వరయక్తంగా ఉంటుందని, స్వరబద్ధమైన వేదం మనసును కదిలించి శాంతిని ప్రసాదిస్తుందని వివరించారు.

ఋషులు వేద ద్రష్టలని వారు అపౌరుషేయమైన వేదాన్ని దర్శించి మన కందించారని, మానవ సమాజానికి హితం చేకూర్చిన వారిని దేవతలు అనవచ్చని, దేవతలను పరిచయంచేసి, వేదార్థానికి వ్యాఖ్యలు చేసిన ప్రాచ్య, పాశ్చాత్యులను పరిచయం చేశాడు. ఋగ్వేదం ఒక పరిపూర్ణ, శాంతియుత, స్వయంసమృద్ధ సమాజాన్ని సృష్టించిందని అయోమయంలో కొట్టుమిట్టాడుతున్న నేటి ప్రపంచ మానవ సమాజానికి ఆదర్శప్రాయమైనదని నిరూపించారు. దేవతల గుణగణాలను స్తుతించే ఋగ్వేద సంహితను, యజుర్వేద సంహితలోని కృష్ణయజుర్వేద, శుక్ల యజుర్వేద సంహితలను వివరించారు. దేవతలను ప్రసన్నం చేసే గానవిధిని వివరించే సామవేదాన్ని, బ్రహ్మజ్ఞాన సహితంగా అనేక లౌకిక విషయాలను వివరించే అథర్వణ వేద సంహితను దర్శింపజేశారు. అథర్వణ వేద సంహితలో భృగు, అంగీరసులు బ్రహ్మ నుంచి అయోనిజులుగా ఆవిర్భవించడాన్ని వివరిస్తూ కృత్రిమ సంతానం ఆధునిక సైన్సు కనుగొన్నది కాదని భారత ఇతిహాసంలో ఏనాటినుంచో అప్రాకృత కృత్రిమ సంతానం ఉన్నదని కుమారస్వామి, ద్రోణుడు, కౌరవులు అంతా కృత్రిమ సంతానమే అన్నాడు. శస్త్ర చికిత్స భారతవైద్యంలో అనాదిగా

ఉండేదని అశ్వినులు భోజరాజు మెదడుకు శస్త్రచికిత్స చేస్తే, దక్షునికి మేకతల, వినాయకునికి ఏనుగు తల అమర్చిన ఘనత భారత వైద్యానిదే నన్నాడు. యువనాశ్వుడు పురుషుడే అయినా స్త్రీ సంపర్కం లేకుండా అతనికి గర్భం కలిగించి మాంధాతను పుట్టించింది భారత వైద్య శాస్త్రమని అది భారతప్రజలకు గర్వించదగిన విషయం అని ఆ విధంగా బ్రహ్మ అధర్వ, అంగీరసులకు దర్శింపజేసిన అధర్వణ వేదాన్ని మనకు దర్శింపజేసాడు.

వేదం కేవలం సంహిత మాత్రమే కాదు. సంహిత, బ్రాహ్మణము, ఆరణ్యకములు, ఉపనిషత్తులతో కలిసింది మాత్రమే సంపూర్ణ వేదం అవుతుంది. ఋగ్వేద సంహిత మంత్ర భాగమైతే శాంఖాయన, ఐతరేయ బ్రాహ్మణాలు కర్మ భాగాలు, వ్యాఖ్యానాలు. ఉపనిషత్తులు జ్ఞానభాగములు.

ఈ జ్ఞానభాగాలైన ఉపనిషత్తులు అమృతమయములు అంటూ వేదం కర్మ అయితే ఉపనిషత్తు జ్ఞానాన్ని, తత్వాన్ని ప్రబోధించే వేదాంతం అన్నాడు. ఈశ యజుర్వేదానికి అంతములో ఉన్నందున వేదాంతం అయ్యిందని, ఇక్కడ వేదాంతం అంటే వైరాగ్యం కాదని తెలియజేస్తూ ఈశం, కేనం, కఠం, తైత్తరీయం, ఐతరేయం, ముండకం, మాండూక్యం, ప్రశ్నం, ఛాందోగ్యం, బృహదారణ్యకం నమామి అంటూ జగద్గురు ఆది శంకరాచార్యులు అద్వైత భాష్యం చెప్పిన పది ఉపనిషత్తులను దర్శింపజేశాడు. శుక్ల యజుర్వేద సంహిత చివరలో ప్రారంభమైన ఈశ వేదాంతమైంది, జీవితం జీవించడానికే అంటూ అనంతమైన తాత్వికతను ప్రబోధించేదే ఈశోపనిషత్తు. కేనోపనిషత్తు బ్రహ్మను తెలియజేయడానికి ప్రయత్నిస్తే కఠం ఉపదేశాన్ని, కృష్ణ యజుర్వేదంలో అంతర్భాగంగా ఐతరేయం నియమాలను తెలియజేస్తుంది. అహం త్యజించి వేదాన్ని అధ్యయనం చేయాలని ముండకం, ప్రధాన ప్రణవాన్ని (ఓంకారాన్ని) మాండూక్యం ప్రవచిస్తుంది. బీజం వంటి ప్రశ్నను విశదపరిచేదే ప్రశ్నోపనిషత్తు.

మన సాహిత్యం అనాదినుండి సమాజ శ్రేయస్సును కోరేదిగా, అందుకు మార్గాన్ని అన్వేషించేదిగా, పథనిర్దేశం చేసేదిగా ఉందని సీతాచరితం ఆలోచనామృతంలో అభిప్రాయపడాడు. వాల్మీకి ఆనాటి సమాజాన్ని సూక్ష్మాతి సూక్ష్మంగా పరిశీలించి రామాయణాన్ని ఒక లౌకిక కావ్యంగా తీర్చిదిద్దాడని నిరూపించాడు. మహాభారత ఇతిహాసము జ్వాజ్వల్యమానమై వెలిగే దీపం. ఇది మోహాంధకారాలను దూరం చేసి, మానవుల అంతఃకరణాలను పునీతం చేసి, జ్ఞానజ్యోతిని వెలిగిస్తుంది అని మహాభారతం మానవ ఇతిహాసం అన్నారు దాశరథి రంగాచార్య. అనంత హింసాకాండ అనంతరం ఉద్భవించిన శాంతి, భక్తిసందేశ ప్రబోధం భాగవత మనీ భాగవతం భక్తి ప్రాతిపదికయైన మహాపురాణ మైనా ఒక చరిత్రగా పలు రంగాలలో ప్రగతిని సూచించే చారిత్రక గ్రంథం అవుతుందన్నారు.

భారతీయ సనాతన సంప్రదాయంలో వేద, వేదాంత, ఇతిహాస, పురాణాలన్న క్రమం ఉంది. వేదసారం ఉపనిషత్తులు. ఉపనిషత్తులు చెప్పిన సత్యంవద, ధర్మంచర, మాతృదేవ, పితృదేవోభవ వంటి మాటలకు ఇతిహాసపురాణాలు కథారూపమైన వ్యాఖ్యానాన్ని అందించి మిత్ర సమ్మితాలయ్యాయి. వేదసారం వేదాంతమైతే దాని వ్యాఖ్యానాలు ఇతిహాస పురాణాలు. దాశరథి రంగాచార్య వేదాల అనువాదం మొదలుపెట్టి ఇతిహాస పురాణాలకు రాలేదు. ఇతిహాసపురాణాలనుండి ఉపనిషత్తులు వేదాలవైపు వెళ్ళారు. ఈ క్రమాన్ని ఆయన పాటించడం వలన వేదాల విషయంలో కొంత దగ్గరగా ఆలోచించడానికి, స్వతంత్రదృష్టితో ఆలోచనామృతాన్ని అందించడానికి వీలుపడిందనిపిస్తుంది. వేదంలోనే సకలమూ, సమస్తమూ సర్వమూ ఉందనే సనాతనులున్నారు. వేదంలో ఏమిలేదు. అదంతా అవాస్తవం మిథ్యదోపిడీ అనే ప్రగతివాదులూ ఉన్నారు. ఉభయుల్లో ఎవరూ వేదం చదివి ఈ నిర్ణయానికి రాలేదని నా అభిప్రాయం అని స్పష్టంగా నిర్ణయించుకున్న ఆయన వాటిని వివరించడంలో ఆధునికతను చూపాడు. వేదంలో ఏమి ఉందో చెప్పారు. వేదాన్ని, అందులోని తాత్వికతను ఇతిహాసపురాణాలు, కావ్యాలు తమ పద్ధతిలో చెప్పాయి. అవి చెప్పిన పద్ధతికి, దాశరథి రంగాచార్య వివరించిన తీరుకు చాలా తేడా ఉంది. ఏ విషయానికి సంబంధించిన భావనలైనా అందరికీ అందాలన్న భావన ఉన్న ఆధునిక సనాతనుడు దాశరథి రంగాచార్య.

**రచయిత ఫోన్ : 9849714261**

**కవిత**

# అన్ని తరాల వారధి

అతను
చిల్లర దేవుళ్లకు దేవుడు
తెలుగింటి వేదవ్యాసుడు

అతనికి
సనాతనం పునాదులు
మార్క్స్ మహర్షి
ఆధ్యాత్మికం, మానవీయం.
సాంస్కృతిక దేశం ఆశయం
సామాన్యుడు మాన్యుడు

రచన ఒక తపస్సు
తెలిసింది పంచుకోవటం ధ్యేయం

ఒక మూర్తీభవించిన భారత తత్వం
అతనిముందు ఎవరైనా విద్యార్థే

యాభయి సంవత్సరాలుగా
ఎడతెరిపిలేని సాహిత్య వర్షం
ఎనిమిది పదుల ఆనందమూర్తి
మన దాశరథి
అన్ని తరాల వారధి

**వై. ముకుంద రామారావు**
**ఫోన్: 9908347273**

- డా. పెండ్యాల వరవరరావు

# లౌకిక ప్రజాస్వామ్య సంస్కృతీ ప్రతీక



**దా**శరథి రంగాచార్య గురించి చెప్పాలంటే సాధారణంగా ఫ్యూడల్ పెత్తందారీకి వ్యతిరేకంగా ఆయన రచించిన పుస్తకాలని పేర్కొంటాం. అయితే నిజాం కాలం నాటి దుర్మార్గపు భూస్వామ్య వ్యవస్థను ఆయన ఎంత బలంగా వ్యతిరేకించాడో అంతే బలంగా జర్మనీ సామ్రాజ్యవాద ఫాసిజాన్నీ వ్యతిరేకించాడు. ఇవ్వాళ అమెరికా నయా సామ్రాజ్య వాదాన్నీ ప్రపంచీకరణనీ అలాగే చూసాడు. వాటిని నిరసించే సందర్భాల్లో ఆయన గొంతులో అదే తీవ్రత వినిపించింది. తెలంగాణలోని ఆనాటి ఫ్యూడల్ దొరలను ఆయన చిల్లరదేవుళ్ళని పేర్కొన్నాడు. వాళ్ళని చిల్లరదేవుళ్ళని అనడానికి కారణం ఆ పిరమిడ్ పై భాగాన లేదా మూలవిరాట్ గానో నిజాం రాజు ఉన్నాడని చెప్పదల్చుకోవడమే. ఆ చిల్లర దేవుళ్ళ అండదండలతో నడిచిందే నిజాం పాలన. వీళ్ళంతా గ్రామాల్లో ఎక్కువ భాగం హిందూ అగ్రవర్ణ భూస్వాములే. ఇవ్వాల్టికీ వాళ్ళు ఎన్ని వేషాలు మార్చి అనుత్పాదక క్రియ నుంచి వ్యాపారాల్లోకి రాజకీయాల్లోకి పారిశ్రామిక పెట్టుబడుల్లోకి వచ్చినా పెత్తందారీ స్వభావం పోలేదు అనుకోవడమే ఆయన్ను ఈ ప్రభుత్వాలకూ పాలక వర్గాలకూ దూరంగా ఉంచింది. కాళోజీ అయినా అప్పుడప్పుడూ మంత్రుల సభల్లో పాల్గొన్నాడు, రంగాచార్య మాత్రం అటువంటి సభలకు దూరంగా ఉండాలనే నియమాన్ని ఒక నిష్ఠగా పాటించాడు.

రంగాచార్య కమ్యూనిస్టు పార్టీ నాయకత్వంలోని రైతాంగ సాయుధ పోరాటంలో పాల్గొన్నాడు. అరసంలో క్రియాశీలంగా పనిచేసాడు. 68-69ల్లో గానీ 97 తర్వాత గానీ ప్రత్యేక తెలంగాణ ఉద్యమాన్ని బలపరిచాడు. ఆయన అన్న దాశరథి కృష్ణమాచార్య చివరిదాకా సమైక్యవాదిగానే ఉన్నాడు. కృష్ణమాచార్య ఉద్యమ జీవితం 48 లేదా 51తో ముగిసింది. కానీ రంగాచార్య ఉద్యమజీవితం కడదాకా కొనసాగింది.

ఆయనతో నా అనుబంధం గురించి చెప్పాలంటే – క్లింటన్ ఇండియా కొచ్చిన సందర్భంలోగానీ, ఇరాక్ పై అమెరికా దాడి సందర్భంలో గానీ, 2004లో ప్రభుత్వంతో మావోయిస్టు పార్టీ చర్చల సందర్భంలో గానీ ఆయన మాతో కలసి నడిచాడు. మాకు అండగా అన్ని ప్రజా రాజకీయ కార్యక్రమాల్లో పాల్గొన్నాడు. ఆయన ఆధ్యాత్మిక వాదం – రామాయణ భారతానువాదాలు వేదాల అనువాదం వరకు – అటువంటి వైరుధ్యాలేవీ సాంస్కృతికోద్యమ కార్యక్రమాల్ని సమర్థించడానికి అడ్డురాలేదు. నా 'బాగ్దాద్ చంద్రవంక' కవితకి ఆయనే ప్రేరణ. ప్రజా ఉద్యమాల్ని బలపర్చే సందర్భాల్లో తన ఆధ్యాత్మిక భావజాలాన్ని ప్రస్తావనకు తెచ్చేవారు కాదు. ఆయన ఆహార్యం తప్ప సభల్లో గానీ సంభాషణల్లో గానీ మా కలయికలో ఆయన మాట ఏదీ అభ్యంతరకరంగా అన్పించేది కాదు.

ఉర్దూ భాష పట్ల ఆయనకు చాలా అభిమానం. ఉమ్రావ్ జాన్ అదాని ఆయన అనువదించడానికి ఎంచుకోవడంలోనే ఆయన దృక్పథం తెలుస్తుంది. విచ్ఛిన్నమౌతోన్న మొఘల్ రాచరిక వ్యవస్థ, ఉత్తరభారతంలో ఆ కాలంలో ఫ్యూడల్ వ్యవస్థకి వ్యతిరేకంగా ప్రజల వ్యతిరేకత, బ్రిటిష్ వలస సామ్రాజ్యవాద ప్రవేశం – ఆ నవల్లో వర్ణించిన ఆ నేపథ్యమే ఆయన్ను ఆకర్షించిన అంశం (ఆయన అనువాదం చదివాకే నేను సినిమా చూసాను. అది నాకు చాలా ఇష్టమైన సినిమా).



లౌకిక ప్రజాస్వామ్య భావాల విషయంలో కూడా కాళోజీ తర్వాత చెప్పవలసిన పేరు దాశరథి రంగాచార్యే. నిజాం నవాబు పట్ల, రజాకార్ల పట్ల ఆయన వ్యతిరేకత – ముఖ్యంగా స్వయంగా అనుభవించిన రాజ్యహింస పట్ల వ్యతిరేకత – ముస్లింల పట్ల ఆయన ప్రేమను ప్రభావితం చేయలేదు. ఇవాల్టి తెలంగాణ వాదంలో ముస్లింలకు అనుకూలంగా ఉండడమంటే నిజాంని ప్రస్తుతించడం అనే ధోరణి ఒకటి గమనిస్తాం. కానీ రంగాచార్య బందగీ, మగ్దూం, షోయబుల్లాఖాన్‌లను లౌకిక ప్రజాస్వామ్యానికి ప్రతీకలుగా చూసాడు. ఒక్కమాటలో చెప్పాలంటే – ఆయన చాలా ఆలస్యంగా (1969లో) నవలా రచనకు ఉపక్రమించినా ఆయన జీర్ణించుకొన్న సంస్కృతి 1936-45 మధ్యన ప్రేమ్‌చంద్, సజ్జద్ జహీర్, అరసం, ఇప్టాలు అందించిన సంస్కృతే. అందుకే ఆయన దేశ విభజన సందర్భంగా జరిగిన మారణ కాండను, బాబ్రీ విధ్వంసాన్నీ, పంజాబ్ లో సిక్కుల ఊచకోతనూ, గుజరాత్ హింసాకాండనూ, ఇవ్వాళ ముస్లిం మైనార్టీ మీద జరిగే దాడులనూ అదే దృక్పథంతో తీవ్రంగా ఖండించాడు. తెలంగాణ ఉద్యమంలో ప్రజాస్వామిక భావజాలం, కార్మిక వర్గ అనుకూలత కొరవడ్డాయని ఆయన చాలా ఆవేదన చెందేవాడు.

రచయితగా – ఆయన నవలల్లో చిల్లరదేవుళ్ళు చిన్నదైనా చాలా మంచి నవల. ఆయనకి ఆదర్శం వట్టికోట ఆళ్వారుస్వామి. ఆళ్వారు స్వామితో తనకున్న సాన్నిహిత్యంతో ఆయన అసంపూర్తిగా వదిలి వెళ్ళిన సాహిత్య వ్యాసంగాన్ని రంగాచార్య కొనసాగించాడు. తెలంగాణ జీవితం, వాతావరణం, భాషా సంస్కృతి అందులోనూ అట్టడుగు ప్రజలది, దొరల దౌష్ట్యాలతో సహా, కళ్ళకి కట్టినట్లు చిత్రించాడు. అయితే కవిగా ప్రారంభం అయ్యాడు. కాబట్టి ఆయనలో కొంత కవిత్వాంశ ఉంటుంది, నాటకీయత ఉంటుంది.

ఎన్ని వైరుధ్యాలున్నప్పటికీ సన్నిహితంగా చూసినప్పుడు – ముఖ్యంగా ఇవ్వాళ సామ్రాజ్యవాద ప్రపంచీకరణ, కాషాయీకరణ, రాజకీయ సామాజిక వాతావరణంలో ఎంతో అవసరమైన లౌకిక ప్రజాస్వామ్య సంస్కృతిని తన రచనల ద్వారా వ్యక్తిత్వం ద్వారా ఉద్యమ జీవితం ద్వారా అందించిన దాశరథి రంగాచార్య కాళోజీ వలెనే ఒక నిండు జీవితాన్ని తెలంగాణకి అంకితం చేసి మన ముందు కొన్ని విలువల్నీ లక్ష్యాలనీ వదిలి వెళ్ళారు. అందిపుచ్చుకోవడమే మన కర్తవ్యం.

**విప్లవ కవి , విప్లవ రచయితల సంఘం సభ్యుడు**

**ఫోన్: 9676541715**

# మనకు వేదాలు పెద్ద వరం: దాశరథి

**తెలంగాణ జీవితానికి అద్దం పట్టిన ప్రముఖ నవలా రచయిత, అభ్యుదయ దృక్పథము, సనాతన ధర్మనిష్ఠ, సంప్రదాయప్రీతి కలిగినవారు, వేదాలను, ఉపనిషత్తులను, బ్రాహ్మణాలను, భారత, రామాయణాలను ఆంధ్రీకరించినవారు దాశరథి రంగాచార్యగారు. 80వ పుట్టినరోజు జరుపుకుంటున్న రంగాచార్యగారితో పెన్నా శివరామకృష్ణ, వై. ముకుందరావులు 2008 ఆగస్టులో జరిపిన ఇష్టాగోష్ఠి సారాంశమిది.**

పోరాటంలో పాల్గొనే సందర్భంలో మా నాన్నను ఎదిరించాల్సి వచ్చింది. అప్పట్లో మా పాఠ్యగ్రంథంలో గౌతమబుద్ధుడిని గూర్చి ఒక పాఠముండేది. ఆ ప్రస్తావన వచ్చినప్పుడు - బుద్ధుడు నాస్తికుడు, విగ్రహారాధనకు వ్యతిరేకి అంటూ నిరసనగా మాట్లాడాడు. నాకు ఎందుకో బుద్ధుడంటే ఏర్పడిన గౌరవం వల్ల మా నాన్న మీద కోపమొచ్చింది. మా సంప్రదాయం ప్రకారం మడి కట్టుకున్నప్పుడు సంస్కృతం లేదా ద్రావిడంలోనే మాట్లాడాలి. తెలుగులో కూడా మాట్లాడకూడదు. తెలుగు వాడకం మా తండ్రిగారికి ఇష్టం ఉండేదికాదు. మా సంప్రదాయానికి విరుద్ధం కనుక శివాలయానికి వెళ్ళడం నిషేధం. మా నాన్న బుద్ధుడిని తిట్టినందుకు శివాలయానికి వెళ్ళి శివలింగం ముందు కూర్చుని నా నిరసన తెలిపాను. తండ్రి శాసించేవారు. ఆ సప్రెషన్ నుండి బయటపడటానికి ఉద్యమస్ఫూర్తి బాగా పనికొచ్చింది.

✦✦✦

మా అమ్మ గొప్ప విదుషీమణి. గోర్కీ అమ్మలాంటిది. మా అన్నయ్యకు (దాశరథి కృష్ణమాచార్యులు) 'అప్పకవీయం' మా అమ్మే బోధించింది. గోర్కీ 'అమ్మ'ను దృష్టిలో పెట్టుకొని మాతోటి కార్యకర్తలందరూ మా అమ్మను 'అమ్మ' అనే పిలిచేవారు.

✦✦✦

అజ్ఞాతం నుంచి మా అమ్మను చూడడానికి వచ్చి పోలీసులకు పట్టుబడ్డాను. మా అన్నయ్య కూడా అలాగే పట్టుబడ్డాడు. 1946-47 ప్రాంతంలో పోలీసు సూపరింటెండెంట్ నన్ను కాల్చి వేయాలనుకున్నాడు. ఖాసిం అనే పోలీసు కట్టె విరిగేటట్టు కొట్టాడు. కాని నేను ఏడవలేదు. ఆ పోలీసు పక్కకు వెళ్ళగానే ఆఫ్జల్ అనే ఇంకో పోలీసు, నువ్వు బతికుండడం మాఅదృష్టం అని చెప్పి టిఫిన్ పెట్టించి ఓదార్చాడు. అప్పుడు ఏడ్చేశాను. ఇద్దరూ పోలీసులే మరి. కులాలు, మతాలు, పార్టీలు పక్కన పెడితే ప్రతివాడిలో అంతర్గతంగా మానవత్వం తొణికిసలాడే మనిషి ఉంటాడు. ఉద్యమం మాకెన్నో నేర్పింది. ఒక ఉద్యమం వంద పుస్తకాలు నేర్పలేని అనుభవాలను నేర్పుతుంది.

✦✦✦

'స్వతంత్ర'లో ఖాసా సుబ్బారావుగారు తెలంగాణ పట్ల అనవగాహనతో సంపాదకీయం రాశారు. ఆయన సంపాదకీయాన్ని ఖండిస్తూ తెలంగాణా భౌగోళిక సామాజిక రాజకీయ పరిస్థితులను వివరిస్తూ పెద్దలేఖ రాశాను. తర్వాత సంచికలో ఆయన సంపాదకీయం పక్కన నా లేఖను అచ్చువేశారు. నాటి పాత్రికేయ విలువలు అలా ఉండేవి. ఈ విధంగా నా సాహిత్యం ప్రవేశం లేఖతో మొదలయ్యింది. ఆ తరువాత వ్యాసాలు. రామాయణం మొదటి రచన ఇప్పటికీ పునర్ముద్రణ పొందుతూనే ఉంది. చిల్లరదేవుళ్లు మొదటి నవల.

పోరాటాల తర్వాత, స్వాతంత్ర్యం వచ్చిన తర్వాత, ఆంధ్రప్రదేశ్ ఏర్పడిన తర్వాత ఏ మార్పూ లేదు. నాయకుల బట్టలలో తప్ప. విసుగు, ఏవగింపు కలిగి రాజకీయాలను వదిలేశాను. పార్టీలో ఉండగా పార్టీ నియమాలకు కట్టుబడే ఉన్నాను.

✦✦✦

అంతకు ముందు సంప్రదాయాలను, పురాణాలను నిందించినవాడినే. 32 ఏళ్ళ వయస్సులో తిరిగి రామాయణాన్ని చదివిన తర్వాత నేను ఏమిపోగొట్టుకున్నానో తెలిసింది. రామాయణాన్ని తెలుగు వచనంలో రాశాను. ఆ పుస్తక ఆవిష్కరణ సభలో రాళ్ళపల్లి అనంతకృష్ణశర్మ. తెన్నేటి విశ్వనాథం. దీపాల పిచ్చయ్యశాస్త్రి, దివాకర్ల మొదలైన మహామహులు ప్రసంగించారు.

✦✦✦

ఆళ్వారుస్వామిగారు ప్రణాళికాబద్ధంగా నాలుగు నవలలు రాయాలనుకున్నారు. 1961లో మరణించారు. ఆ బాధ్యత నేను తీసుకోవాలనుకున్నాను. నేను నవలాకారుణ్ణి కావడం అనుకోకుండా జరిగిందే. నవల అయితే సంపూర్ణమైన జీవితాన్ని విస్తృతమైన సమాజాన్ని చిత్రించడానికి వీలవుతుందని అనుకున్నాను. నవలను గురించి రెండు సంవత్సరాలు అధ్యయనం చేశాను. 'How to read' మొదలైన పుస్తకాలు చదివాను.

✦✦✦

1966 ఆరంభంలో ఐదు వారాలలో 'చిల్లర దేవుళ్ళు' నవల రాశాను. నాటి తెలంగాణా జీవితాన్ని తెలంగాణా భాషలో రాస్తున్నానని తెలిసి 'మనవాళ్లతోటి మమ్మల్నే తిట్టిస్తవా?' అని కొందరు దొరలు రాయవద్దన్నారు. పాత్రోచితమైన తెలంగాణా భాష వాడాను. కథనానికి సాధారణ వ్యవహారిక భాషనే ఉపయోగించాను. 'ఆంధ్రప్రభ' నవలా

పోటీకి పంపాను. వారు తిప్పి పంపారు. సరే, తెలంగాణ వారితోపాటు కొన్ని పదాలు అర్థంకాకపోయినా ఆంధ్రప్రాంతంవారు ఈ నవలను బాగా చదివారు. 1971లో ఈ నవలకు ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీ అవార్డు వచ్చింది. ఇంగ్లీషు, హిందీలలోకి అనువదించబడింది. కొన్ని యూనివర్సిటీలలో పాఠ్యాంశంగా నిర్ణయింపబడింది. రేడియో ద్వారా నాటకంగా ప్రసారమైంది. నాటకీకరణ, దర్శకత్వం కూడా నేనే. రేడియోలో వనజ పాత్ర శ్రీమతి శారదా శ్రీనివాసన్‌గారు ఎంతో ప్రతిభావంతంగా పోషించారు. బహుశా సంపూర్ణంగా తెలంగాణ భాషలో ప్రసారమైన మొదటి నాటకం ఇదేనేమో!

నేను రచయితగా మారడానికి కారణం ఉద్యమం. పోరాటం నాటి పరిస్థితులు. రచయిత కావాలని అనుకుని అయినవాణ్ణి కాను. ఆనాడు మమల్ని అన్ని రకాలుగా ప్రభావితం చేసింది. నాటి కమ్యూనిస్టు పార్టీ. నాటి నాయకులకు జీవితం తెలుసు. పోరాటం తెలుసు. నాటి మహానాయకులు రావి నారాయణరెడ్డి, బద్దం ఎల్లారెడ్డి మొదలైనవారంతా త్యాగధనులు. తమ సర్వస్వాన్ని ఉద్యమానికే అప్పగించారు. అంకితం చేశారు. అది త్యాగాల కాలం. ఇప్పటిది భోగాలకాలం.

'మీ జాన్' అనే త్రిభాషా పత్రిక కూడ ఆనాడు పోరాటానికి సహాయపడింది. 1944-45 ప్రాంతంలో 'మీ జాన్' పత్రికకు 'గార్ల జాగీరులో చక్కెర కరువు' అనే శీర్షికతో ఒక లేఖ రాశాను. బహుశా అదే నా తొలి రచన. ఆ లేఖ సంచలనం కలిగించింది. లోకల్ డీలర్‌ను తొలగించారు.

ఆ తర్వాత చాలా వ్యాసాలు రాశాను. 'ప్రజాశక్తి' వారపత్రికలో కొన్ని అచ్చయినాయి. సుందరయ్యగారు 'ప్రజాశక్తి'ని దినపత్రికగా మార్చారు. పత్రికను నెత్తిన పెట్టుకుని బాజాలతో ఊరేగింపు జరిపాం. ప్రజాశక్తి ప్రచురణాలయం గొప్ప పుస్తకాలనెన్నింటినో ప్రచురించింది.

మా అన్నయ్య మహాకవి. మేం సాహిత్యాన్ని పంచుకున్నాం. మా అన్నయ్య పద్యానికి అంకితమైనాడు. నేను వచనానికి. ఆయనకు ఛందస్సు మీద గొప్ప అధికారముంది. కొందరు ఆయనను సినీకవిగానే మాత్రం చూడడం బాధకలిగిస్తుంది. ఆయన వచనాన్ని, గేయాలను కూడా పద్యాల్లో రాయగలడు. జైల్లో ఉండి తన దేశపు రాజును ఉద్దేశించి 'మా నిజాం రాజు తరతరాల బూజు', 'ముసలి నక్కకు రాజరికంబు దక్కునే' అని గర్జించిన సాహసి. 'తెలంగాణ' పేరుకు ప్రశస్తిని, ప్రచారాన్ని కల్పించాడు.

✦✦✦

**దా**శరథి పేరుతో ఇబ్బంది లేకుండా అన్నయ్య, దాశరథి కవిత్వానికి, నేను వచనానికి పరిమితమయ్యాం.

నాకు బాగా దుఃఖాన్ని కలిగించిన మూడవ సంఘటన మా అన్నయ్య మరణం.

గాంధీ మరణం, సోవియెట్ సోషలిస్టు రిపబ్లిక్ విచ్ఛిన్నం కావడం మొదటి రెండు ఘటనలు.

✦✦✦

నా జీవితాన్ని, నా రచనలను ఆనాటి సామాజిక పరిస్థితులు, ఉద్యమశీలత ప్రభావితం చేశాయే తప్ప ఏ రచయితలూ, కవులూ, నన్ను ప్రభావితం చెయ్యలేదు. వాల్మీకి, వ్యాసుడు, కాళిదాసు, టాల్‌స్టాయ్, గోర్కీ, ప్రేమ్‌చంద్ మొదలయిన వారిని నేటికీ నేను అభిమానిస్తాను. యిప్పటికి 50 ఏళ్లుగా నా సాహిత్య కృషి కొనసాగుతూనే ఉంది.

✦✦✦

యాభై సంవత్సరాల నా సాహిత్య జీవితంలో 64 పుస్తకాలు వ్రాశాను. 34 వేల పేజీలు రాశాను. ఏది రాసినా బాధ్యతగా భావించే రాశాను. ఏ రకమైన గుర్తింపునూ ఆశించి రాయలేదు. గౌరవంతో మాత్రమే కాదు. ఆత్మీయతతో 'మా దాశరథి' అని ప్రజలు నన్ను గుండెలకు హత్తుకున్నారు. అంతకంటే నాకేం కావాలి? ఒక రచయిత తన జీవిత కాలంలో చెయ్యలేనన్ని వైవిధ్యభరితమైన రచనలు చేశాను.

✦✦✦

ఇంకా సోషలిజం వస్తుందనుకోవడం వెర్రి. పెట్టుబడిదారీ వ్యవస్థ పక్కన గొయ్యి తానే తవ్వుకుంటుందన్నాడు మార్క్స్. ఈ వ్యవస్థపోతే ఏ వ్యవస్త వస్తుందో తెలియదు. కాని ఇంతకంటే మంచి వ్యవస్థే వస్తుంది.

✦✦✦

సనాతనకుటుంబ వాతావరణం నుండి, మార్క్సిస్టు భావజాలంవైపు. ఆ తరువాత ఆధ్యాత్మిక ప్రస్థానం వేపు సాగిన వివిధ దశల్లో పెద్ద భేదం ఉందని భావించటంలేదు. మార్క్స్ మహర్షి, అది పరిస్థితుల ప్రభావం మూలంగా ఏర్పడ్డది. భారతీయ తాత్వికతకు మూలం మనిషి, విశ్వమానవ కళ్యాణం మూలం.

✦✦✦

వేదంలో అసమానతలు లేవు. వేదంకంటే ప్రాచీనం. పురాతనం మరొకటి లేదు. మనకు వేదాలు పెద్ద వరం. ఇది సూర్యుడి దేశం. వేదమంటే వెలుగు. వేదం చెప్పటమే కాదు. చేసి చూపించింది. వేదాలు, రామాయణ, భారత, భాగవతాలు ఇవే మానవ భవిష్యత్తుకు మార్గనిర్దేశనం చేసేవి.

✦✦✦

వేదాల అనువాదంలో నేను సాయణ భాష్యాన్ని అనుసరించాను. చతుర్వేదాలకు భాష్యం రాసిన సాయణుడు ఆంధ్రుడు. వేదాలకు, భారతీయ సంస్కృతికి మాక్స్‌ముల్లర్ చేసిన అపచారం మరెవ్వరూ చెయ్యలేదు.

✦✦✦

హనుమకొండలో నేను ఒక సభకు హాజరు కావాల్సి ఉండింది. అక్కడ నన్ను గుర్తుపట్టిన ఒక ఆటోడ్రైవర్ వేదాలు చదివానని చెప్పి, నన్ను సభాస్థలికి చేర్చి, ఆటోచార్జీలు కూడ తీసుకోలేదు. నా వేదానువాదాలను అనేక మంది స్త్రీలు కూడా చదివారు. ఒకప్పుడు బ్రాహ్మణస్త్రీలు కూడా వేదాలను వినకూడదనే, చదవకూడదనే నిషేధాలుండేవి కదా!

✦✦✦

నా నినాదమే సాంస్కృతిక తెలంగాణ. ఒక భాష. యాస ప్రజలను ఐక్యం చేస్తుందని నేననుకోను. వర్ధిల్లవలసింది సంస్కృతి. సాంస్కృతిక ఐక్యత. సాంస్కృతిక ఐక్యత అవసరాన్ని గ్రహించని రాజకీయం మనిషిని రాక్షసుడిని చేస్తుంది. సమైక్యత భాష, మతం మూలంగా రావు; ప్రేమ

# గుండెలో మార్క్సిజం... గొంతులో వేదాంతం

వేదాలను ఉపనిషత్తులను ఒక చేత్తో, మార్క్సిజం మౌలిక సూత్రాలను మరో చేత్తో సమానాభిని వేశంతో అధ్యయనం చేసిన అతి తక్కువమంది విద్వాంసులలో దాశరథి రంగాచార్య ప్రముఖులు. ఇది రాంభట్ల కృష్ణమూర్తి గారి ఒరవడి. అలాగే దాదాపు 70 సంవత్సరాలనాటి తెలంగాణ ప్రజల దయనీయమైన స్థితిగతులను, భూస్వాముల దౌర్జన్యాలను, నిరంకుశ నిజాం నవాబు రాజరిక దుష్టవ్యవస్థను, వెట్టిచాకిరిని ఒక ఇతిహాసంగా మలచిన ప్రతిభావంతుడైన రచయిత దాశరథి రంగాచార్య. ఇది వట్టికోట ఆళ్వారుస్వామి వారసత్వం. 'రానున్నది ఏది నిజం – అది ఒకటే సోషలిజం' అని త్రికరణ శుద్ధిగా నమ్మిన తాత్త్వికత. తమ అన్నగారైన దాశరథి కృష్ణమాచార్య గారి నుండి లభించిన ప్రేరణ. అభ్యుదయ సాహిత్యోద్యమంతో పెనవేసుకుపోయిన సాహిత్యానుబంధం ఆయనది.

అక్షర వాచస్పతిగా, ఆధునిక వ్యాసుడిగా, తెలుగు ప్రజల గోర్కీగా ప్రముఖుల ప్రశంసలు పొందిన అరుదైన సాహిత్య వ్యక్తిత్వం రంగాచార్య గారిది. పరిచయమైన ప్రతివారినీ నిండుమనస్సుతో ప్రేమించిన అమృత హృదయుడు. నమ్మిన ఆదర్శాలను యధాతథంగా ప్రకటించిన వాస్తవికతావాది. ఆహార్యంలో సాంప్రదాయికంగా కనపడుతూనే సంప్రదాయ నిరసనను అణువణువునా జీర్ణించుకొన్నాడు. కాబట్టే ఊహ తెలియని రోజుల్లోనే బాల్యవివాహం చేసుకొన్న ఆదర్శ సహధర్మచారిణి కమలగారి షష్టిపూర్తి, సప్తతిపూర్తి ఉత్సవాలను ఘనంగా నిర్వహించారు. కాళిదాసు శ్లోకంలో వర్ణించిన వాగర్థాల వలె బతికిన అన్యోన్య ఆదర్శ దాంపత్యం వారిది. తమ జన్మ దినోత్సవాలను, కమలగారి జన్మ దినోత్సవాలను నిర్వహిస్తూ అనేకమంది దళిత బహుజన ప్రగతిశీల రచయితల దంపతులను సత్కరించారు. గుండెలో మార్క్సిజాన్ని శ్వాసగా నింపుకొని గొంతులో వేదాంతాన్ని ప్రవహింపచేసారు. ఈ రెండిటికీ భేదం లేదని బలంగా నమ్మారు. ఈ రెండూ ప్రపంచ మానవాళి కన్నీళ్లను తుడవటానికి, కష్టాలను తొలగించడానికి ఒక ఉదాత్త సమాజ నిర్మాణానికి మార్గనిర్దేశం చేసేవే అని సోపపత్తికంగా వాదించారు. మతం వారి విశ్వాసం. సామ్యవాదం వారి జీవనయానం. జీవిత ప్రస్థానమంతా అతి సామాన్య ప్రజానీకంతోనే కలిసి నడిచారు. ఒక చిన్న ప్రభుత్వ క్వార్టర్ లోనే నిరాడంబరంగా సాదా సీదా జీవితం గడిపారు.

బహుశా తెలుగులో అభ్యుదయ ఆధ్యాత్మిక రంగాల్లో అత్యధిక పేజీల వచనాన్ని రాసిన సాహిత్య సవ్యసాచి రంగాచార్య. వేదాలు సామాన్య మానవులకి అర్థం కావాలనే దృష్టితో తేట తెలుగు వచనంలోకి అనువదించి జాతికి అందించారు. 'అన్నీ వేదాల్లోనే ఉన్నాయిష' అనేవారికీ 'వేదాల్లో ఏమున్నది – అంతా ట్రాష్' అనేవారికీ ఏకకాలంలో సమాధానం వీరి వేదానువాదాలు. భారతీయత తన విశ్వాసం. అంతర్జాతీయత తన ఆదర్శం. ఈ రెండిటికీ వైరుధ్యం లేదని వాదించాడు. ఎక్కడా ద్వంద్వ విలువలు పాటించలేదు. నమ్మినదానినే బహిరంగంగా వ్యక్తపరిచాడు. ఎక్కడా దేన్నీ దాచుకోలేదు. వేదికలకు అనుకూలంగా ఎన్నడూ మాట్లాడలేదు.

దాశరథి సోదరుల పోరాట సాహిత్య వారసత్వం, వారి ఉద్యమ శీలత, ఉత్తమ హృదయ సంస్కారం, ఉదాత్తమైన జీవన విధానం నేటి తరానికీ రానున్న తరాలకూ స్ఫూర్తి దాయకం, ఆదర్శప్రాయం, అనుసరణీయం. తెలంగాణ రాష్ట్ర ప్రభుత్వం ఎంతో గౌరవ పూర్వకంగా ఆ మహా రచయితకు అంతిమ వీడ్కోలు పలికింది. పత్రికలు పతాక శీర్షికలై ప్రకాశించాయి. ప్రచార సాధనాలు ప్రధానమైన కథనాలను ప్రసారం చేసాయి. నిజంగా ఇది తెలుగు భాషకు, వాఙ్మయానికీ లభించిన అరుదైన గుర్తింపు, గౌరవం. వారి స్మృతికి నివాళి అర్పిస్తున్నాను.




**డా. యస్వీ సత్యనారాయణ**
**విశ్రాంత ఆచార్యుడు –**
**ఉస్మానియా విశ్వవిద్యాలయం**
**అఖిలభారత అభ్యుదయ రచయితల**
**సంఘం అధ్యక్షవర్గ సభ్యుడు**
**ఫోన్: 9618032390**


అభిమానాలతో తప్ప, విభజించి పాలించేవి రాజకీయాలు. సాంస్కృతిక రాజ్యం మానవీయం; రాజకీయ రాజ్యం రాక్షసం.

✦✦✦

రామానుజుడు – శంకరుడు– బుద్ధుడు ఈ ముగ్గురి గూర్చి మిగతా రాయాలనుకున్నాను. రామానుజుని గూర్చి, బుద్ధుని గూర్చి నా రచనలు రెండు వేరు వేరు పత్రికలలో అచ్చవుతున్నాయి. శంకరుని గూర్చిన నా రచన ఇంకో పత్రికలో ప్రచురణ ఆరంభం కావలసి ఉంది.

✦✦✦

ఎన్ని వ్యామోహాలున్నా నేటి యువతలో ఒక తేజస్సు కనబడుతోంది. నేటి యువతకు జ్ఞానతృష్ణ ఉన్నది. మన దేశం గొప్పదనే భావం బలపడుతోంది. మన ప్రాచీన సాహిత్యాన్ని గూర్చి, సంస్కృతులను సంప్రదాయాలను గూర్చి తెలుసుకోవాలన్న కుతూహలం వారికుంది. తగిన పద్ధతిలో తగిన విధంగా మనం సమాచారం అందించలేక పోతున్నాం.

✦✦✦

నాలుగు పుస్తకాల నటునుండి నిటువైపు
తిరుగవేసి ఒకడు కవిగ మారె
పట్టుశాలువ కొరకు పరుగెత్తి సభలకు
విశ్వజనులవాణి వినుర రంగ

'ఏక్ ఖత్రా జిందగీ కో సిఖాతా హై సబక్
కభీ షబ్నం బనా, కభీ గౌహర్ బనా, కభీ ఆష్కబనా!'

*(వార్త దినపత్రిక 25 ఆగస్టు 2008 సౌజన్యంతో)*

ప్రకృతి-5

- డా॥ కొప్పుల హేమాద్రి

# సమన్యాయం!

మానవుడు తన ధీశక్తిని ఉపయోగించి చలన వేగాన్ని అపరిమితంగా పెంచగలిగాడు. ఇప్పుడు చందమామ చుట్టూ చక్కర్లు కొట్టి రావడమంటే పొరుగు దేశానికి విహారయాత్రకు పోయి వచ్చినంత సులువైపోయింది. పూర్వపు రోజుల్లోలాగ, కాశీ వెళ్ళినవాడికోసం జీవితాంతం ఎదురుచూస్తూ కూర్చోనవసరంలేదు. పొద్దున్నే బయలుదేరినవాడు, అక్కడ పనులు చక్కబెట్టుకుని, రాత్రికల్లా ఇంటికి చేరుకోవచ్చు. కాబట్టి, ఒకప్పుడు పొయ్యి 'రాజేసుకుని' వంట పూర్తి చెయ్యాలంటే గంటలకు గంటలు సమయం పట్టేది. ప్రస్తుతం నిమిషాల్లోనే భోజనం రెడీ!

ఓ శతాబ్దం క్రితంవరకూ, మానవులు వందేళ్ళు బ్రతికినా, 'అనుభవించింది' అందులో మూడోవంతైనా ఉండేదికాదు. కొందరైతే ఆ మాత్రానికీ నోచుకుని ఉండరు. ప్రస్తుత, అతి వేగవంతమయిన జీవన సరళిని గతంతో పోల్చి చూస్తే- అప్పుడు వందేళ్ళలో పొందిన సుఖాలను మనమిప్పుడు 30-40 సంవత్సరాలలోనే పొందుతున్న దశలో ఉన్నామనిపించి - మిగత 60-70 సంవత్సరాల బ్రతుకు కొనసాగింపు మానవుడికి అవసరమా? అన్న ఆలోచన చాలా కాలం క్రితమే కొందరి మస్తిష్కాలను దొలిచింది. నాలుగు దశాబ్దాలక్రితం బొంబాయిలోనో, విజయవాడలోనో - ఓ ఆంగ్ల చిత్రం చూశాను. దాని పేరు జ్ఞాపకం రావడంలేదుగాని, కాస్త అటూ, ఇటూగా ఆ చిత్రంలో చూపించిందేమిటంటే...

అనగనగా ఒక ఊరు. అది అత్యాధునికంగా భూగర్భంలో నిర్మించినది. అన్ని హంగులతో పకడ్బందీగా ఉన్న ఆ ఊరి జనాభా పదివేలు (అనుకుందాం). అక్కడి జనాలకు బాహ్య ప్రపంచమొకటి ఉన్నదన్న విషయమే తెలియదు. ఏతా వాతా, వారికి 'ప్రకృతి' గురించే తెలియదు! అసలు చెప్పుకోవలసిన సంగతేంటంటే- ఆ ఊరి జనసంఖ్య ఎప్పుడూ పదివేలే ఉంటుంది. సగం మంది పుంలింగం, మిగతా సగం స్త్రీలింగం. కులీనులూ, కుచేలురూ అంటూ ఉండరు. అంతా సమానులే! వారు 'అప్ టు-డేట్' చావు-పుట్టుకల జాబితా నిర్వహిస్తారు. ఏ రోజు ఎన్ని చావులో- అన్నే పుట్టుకలకు కూడ ఏర్పాట్లు ఉంటాయి. ఇదెలా సాధ్యమంటే-ఫలానా రోజున వందమంది 'పుట్టాలి' అనుకుంటే- ఆ రోజు 'ఇంక్యుబేటర్'లోంచి నవమాసాలు నిండిన వంద పిండాలను బయటకు తీస్తారు. అయితే అదే రోజున వందమంది చనిపోవాలి కదా? దానికీ ఏర్పాట్లు చేశారు. అక్కడి జనాలకు ఆడ, మగ-ఎవరికైనా జీవిత ప్రమాణం 30 సంవత్సరాలే. అలా అని చెప్పి, వాళ్ళు 30 యేళ్ళు నిండగానే 'భద్రాచల ప్రాంతంలో వడగాడ్పు కొట్టిన పిట్టల్లా' ఎక్కడ బడితే అక్కడ రాలిపోరు. మొత్తం పదివేల జనాభాలో ముప్పైయేళ్ళు నిండిన వారి అరచేతిలో ఒక 'చావు సిగ్నల్ బల్బ్' వెలుగుతుంది. అలా అరచేతిలో బల్బు వెలిగినవారు ఒక హాలులోకి చేరాలి. అందరూ చేరాక, 'డెత్-స్విచ్' 'ఆన్' కావడంతో వారంతో క్షణాల్లో మాడి, మసి అయిపోతారు!'

బాగుందికదూ సైన్స్ ఫిక్షన్? దీనివలన మనం గ్రహించవలసిన విషయమొకటే. 'పిండికొద్దీ రొట్టె' అని. ఆ ఊళ్ళో లభ్యమవుతున్న వనరులనుబట్టీ, శాస్త్ర పరిజ్ఞానాన్ని బట్టీ, అక్కడ 10వేలకన్నా ఎక్కువ జనాభాకు చోటులేదు. పైగా, 'కాకిలా కలకాలం బ్రతికేకన్నా హంసలా ఆరు నెలలు బ్రతకాలన్నట్లు- వందేళ్ళ జీవితంపై విరక్తి కలిగిన వారి పూర్వీకులు 30 ఏళ్ళనే 'సంపూర్ణ జీవిత ప్రమాణం'గా మార్చుకున్నారు. కాకపోతే ఇది ప్రకృతి విరుద్ధం. ఆ చలన చిత్రంలో కూడా కథా రచయితా, దర్శకుడు ప్రకృతికే ఓటు వేశారు. అదెలాగో చిత్రం చివరివరకూ చూస్తేనే తెలుస్తుంది.

ఇంతకూ ఏం జరిగిందంటే...

ఇద్దరు గడుగ్గాయిలు (ఒక అమ్మాయి, ఒక అబ్బాయి) - 'అరచేతిలో బల్బ్ వెలిగితే చనిపోవాలి' అనే సిద్ధాంతంలో ఏదో మతలబు ఉందన్న అనుమానం వచ్చి. సంగతేంటో తేల్చుకోడానికి ఆ 'అండర్‌గ్రౌండ్' నివాసం నుండి తప్పించుకుపోయి, బాహ్య ప్రపంచంలోకి వస్తారు. ఎప్పుడైనా సూర్యుణ్ణి చూస్తేగా? మొదటిసారిగా సూర్యకిరణాలు తాకిన వారిద్దరి నేత్రాలకూ బైర్లు కమ్ముతాయి. నెమ్మదిగా కొంచెం కొంచెంగా అలవాటుపడుతున్న వారి కళ్ళకు ఒక జీవుడు కనబడతాడు. దగ్గరకు వెళ్ళి చూస్తే అతడూ దాదాపు తమకులాగే ఉన్నాడు. కాకపోతే, తల ముగ్గు బుట్టలా, గెడ్డం చీకేసిన తాటి టెంకలా ఉన్నాయి. ఆ వృద్ధుడు చెప్పిన మాటలను బట్టి - అతడు నూరేళ్ళవాడనీ, వయసు పైబడినవారు వార్ధక్యం పొందుతారనీ, శరీరం ముడతలు పడుతుందనీ, అతని ఈడువారు ఇంకా అనేకమంది ఉన్నారనీ- ఇలా చాలా నిజాలు తెలుసుకుంటారు. దానితో వారిద్దరూ ఆయన్ని తమతోబాటు తీసుకుపోయి, తోటి భూగర్భ వాసులకు చూపించి, 'మనిషన్నవాడు వందేళ్ళు బతకవచ్చనీ, 30 యేళ్ళకే 'నూరేళ్ళు' నిండే ఆధారాన్ని అమలుచేసే ఈ భూగర్భవాసానికి సుముఖంగా లేమ'ని ఎదురు తిరుగుతారు. ప్రకృతిసిద్ధమైన సువిశాల ప్రపంచంలోకి అడుగుపెడతారు.




రచయిత ఫోన్: 09848296865

చిత్తూరు కత

# ఇత్తలిబిందె

ఎండపల్లి భారతి

**'బుజ్జమ్మా కుదుట్లో బింది ఏదే' నీళ్ల అరుగు కాడనింటి అరిసింది అమ్మ.**

**నేను బెప్పరపోతా అమ్మ దగ్గిరికి పోతి. నీళ్లరుగు మింద ఇత్తలిబింది లేదు. మమ్మల్ని యెక్కిరిస్తా కుచ్చోనుండాది ఉత్త చుట్టకుదురు.**

'**బు**జ్జమ్మా, కుదుట్లో బింది ఏదే' నీళ్ల అరుగు కాడనింటి అరిసింది అమ్మ.

+++

మా మాదిగిండ్లల్లో ఒకరిద్దరికి మటుకే ఉండాయి ఇత్తలిబిందెలు. వాటిని చూసినప్పుడల్లా మా అమ్మకు నిదరపట్టేది లేదు. 'బుజ్జీ, ఎట్లయినా ఒక ఇత్తలిబింది తేవల్ల పాపా' అనేది నాతో.

'అయితే అమా, నువ్వు కూలికిపోయి తెచ్చిన దుడ్లన్నీ కూడబెట్టు. నేను గుడకా ఈ పొద్దుటినింటీ చింతకాయిలూ కానక్కాయిలూ ఏరి, సెట్టి అంగట్లో అమ్మి ఆ దుడ్లు గుడకా ఇస్తాను' అంటి.

అదే శరత్తుగా రెయ్యనకా పగలనకా ఒళ్లు యించుకుని రూపాయి రూపాయి కూడేసి, మంగళారం సంతకు పొయ్యి ఇత్తలిబింది తీసుకుని వచ్చింది అమ్మ.

బింది మా ఇంటికి వచ్చిన పొద్దు, మా ఊర్లోవాళ్లంతా మా ఇంటికొచ్చి బిందిని చూసేసి పోయిరి. ఊరంతా మా బింది మాటలే. 'మల్లమ్మ ఇత్తలిబింది తెచ్చిందంటనే' అని ఒగరు, 'అవునమ్మో, నేను ఇబ్బుడే చూసేసి వస్తి, బలే బాగుంది' అని ఇంకొగరు. 'బలే పట్టుమింద ఉండి తెచ్చేసిందమ్మా, మనవల్ల అవతాదా' అని ఒగరు. 'మా తాగుబోతు నా బట్టకు ఎంత నోరు కొట్టుకుని చెప్పినా, పైసా మిగిలిస్తే కదా. కూలి దుడ్లంతా నా సాదు తాగేదానికే సరిపోతుండాదే' మూతి తిప్పతా ఇంకొగరు. మా ఇత్తలిబిందిని చూసి, తాకి, తడిమి, ఇచ్చుకుని, మెచ్చుకుని, కుళ్లుకుని, మురిసిపొయ్యింది మావూరు ఆడగుంపు.

మా అమ్మ మూతి పచ్చిపసుపు పూసుకున్నట్లు యెలిగిపోతా ఉండాది. మాకు రాజ్యాలు గెలిసినట్లుగా ఉండాది. నేను నా జతగత్తెల్ని అందర్నీ పిలిసి పిలిసీ బిందిని చూపిస్తా ఉండాను.

మా అమ్మ కొత్తబిందిని సంకన యేసుకుని నీళ్లబోరు కాడకి బయిదేలింది. నేను నా జతగత్తెలతో కలిసి మా అమ్మ యెనకాల్నే పోతా ఉండాను. నిన్నటివరకూ మా అమ్మ, మట్టి కడవను సంకనేసుకుని నడిసిన నడకకీ, ఈ పొద్దు ఇత్తలిబిందిని నడుముకు ఆనించుకుని నడస్తుండే నడకకీ ఎంతో వారా ఉండాది. అప్పుటి మా అమ్మ పోరులో ఓడిపొయిన పెట్ట మాదిరిగా ఒదిగి ఒదిగి నడిసేది. ఇప్పుటి మా అమ్మ, రాజ్యాన్ని గెలిసిన రాణి మాదిరిగా జంబంగా పోతుండాది. రాణికి పొడిగింపులు చేసే బంటుజనం మాదిరిగా యెనకాల మా పిల్లగుంపు.

మా అమ్మ బోరుకాడకి పొయ్యి, బోరు కుదుట్లో ఉండే నీళ్లను కాలితో పక్కకు తోసి, కుదుట్లో బింది పెట్టింది. నేను దడాబడామంటా బోరును కొడితిని. కోక కొంగును చుట్టచుట్టి తలమింద పెట్టుకుని, నిండిన బిందిని ఆ చుట్టమింద పెట్టుకుని ఇంటితట్టుకు అడుగులు యేసింది అమ్మ.

మావూరి కాపోళ్ల మడుల్లో నెమ్మరొడ్ల కోతకు పొయినప్పుడు, ఆ వరికసువు పొడువుగా ఉండాదని సందిడు ఎత్తుకోని వచ్చింది అప్పుడొకతూరి. ఆ కసువుతో చుట్టకుదుర్లు అల్లి, వాటిని అటవ పైనుండే ఒక కట్టికి తగలేసి ఉండిరది. నన్ను అటవ ఎక్కించి, ఒక చుట్టకుదురును దింపించింది. కొత్త చుట్టుకుదురును నీళ్లరుగు మింద పెట్టి, దానిమింద ఇత్తలిబిందిని పెట్టింది.

మా ఇంట్లో ఉండే కుండాసట్టీ అన్నీ మట్టివే, ఒకటో అరో అలవర బోకులు ఉండాయి. వాటి నడాన బంగారం మెరిసినట్లు మెరస్తా కుచ్చోనుండాది ఇత్తలిబింది.



మా అమ్మ ఇంట్లో ఉన్నెబ్బుడు ఎబ్బుడూ ఆ బిందికల్లానే చూసుకుంటా ఉండేది. ఎంత బతిమాలుకున్నా ఒక్క పొద్దన్నా నీళ్లు తెస్తానంటే, ఆ బిందిని మటుకు నా చేతికి ఇచ్చేది లేదు. 'నువ్వు కింద యేసేస్తావు బుజ్జమ్మా. సొట్టలు పడిపోతాది' అంటా నన్ను తాకనిచ్చేదే లేదు.

శివరేత్రి పండగబ్బుడు మావూర్లోని మొగోళ్లు చానామంది నక్కముట్టి ఆట ఆడతారు. అదొక జూదం. మా నాయినకు నక్కముట్టి ఆటంటే బలే బెమ. పండక్కు మూడునాళ్ల ముందుగానే నక్కముట్టి ఆటలో దుడ్లునంతా నీగేసుకున్నాడు. ఎల్లుండి పండగనంగా ఆపొద్దు రెయ్యి మా ఇంట్లో రచ్చ లేసింది. మా నాయిన మా అమ్మను దబ్బులు అడిగినాడు. మా అమ్మ లేవని చెప్పేసింది. అంతే మా అమ్మని దబీదబీమని రెండు గుద్దేసి, బయిటికి యెలబారిపొయినాడు మా నాయిన.

'దొంగనాబట్ట. కూలిదుడ్లని దినమ్మా ఆ సారాయంగిట్లో సల్లేసి వస్తాడు. సాలనిదానికి ఈ నక్కముట్టి ఆటొగటి' అంటా జారిపొయిన యెంటికల్ని ముడేసుకొనింది మా అమ్మ. మా నాయిన ఆపొద్దు రెయ్యి ఇంటికేరాలేదు.

తెల్లారి లేసి మా పనులు మేము చేసుకుని, సంగటిపొద్దుకు అమ్మ కూలికి పోతే, నేను ఆవుని యిప్పుకుని పోతిని. శివరేత్రి కాలం కదా, ఎండ బలస్తా ఉండాది. మోతకమాన్లు పూసి, ఎర్ర మన్నులో దొల్లాడిన ఎనుములు మాదిరిగా నిలుసుకోనుండాయి. వాడుబారిన పచ్చికసువును పరపర మేస్తా ఉండాయి పసరాలు.

మావిటాళ వరకూ ఆవుని మేపుకుని, ఇంటికి తిరుక్కుంటి. అబ్బుడే కూలిపని నింటి వస్తా దోవలో కలుసుకునింది అమ్మ. ఇద్దరమూ ఇంటికిపోతిమి. నేను ఆవుని గాట్లో కట్టేసి, కాళ్లూ చేతులూ కడుక్కుని ఇంట్లోకి వచ్చి 'అమా దప్పికయితా ఉండాది, రవన్ని నీళ్లీమా' అని అడిగితి. ఆ మాటతో మా అమ్మ చెంబెత్తుకుని నీళ్లరుగుకాడకి పొయింది.

'బుజ్జమ్మా కుదుట్లో బింది ఏదే' నీళ్ల అరుగు కాడనింటి అరిసింది అమ్మ.

నేను బెప్పరపోతా అమ్మ దగ్గిరికి పోతి. నీళ్లరుగు మింద ఇత్తలిబింది లేదు. మమ్మల్ని యెక్కిరిస్తా కుచ్చోనుండాది ఉత్త చుట్టకుదురు.

'బుజ్జీ, అడగతా ఉంటే నోరిప్పవేందే' అనింది అమ్మ.

'ఏమోమా, నేను చూడ్లేదు. పొద్దన్నే నువ్వట్ల పోతానే, నేను ఆవును పట్టుకుని పోతి' అంటి.

'నువ్వున్నెబుడు మీ నాయినేమన్నా వచ్చినాడా' అడిగింది.

'రాలేదు మా' అంటి.

అంతలికే బయిటినింటి మా యెనకింటామి మా అమ్మను పిలిసింది. మేమిద్దరమూ గబగబా బయిటికి వస్తిమి.

'మల్లమ్మా, మద్దేనము మేకలు నీళ్లుతాగే పొద్దులో, నీ మొగుడు ఇత్తలిబిందిని ఎత్తుకుని కదిరిగుట్ట తట్టు పోతా ఉంటే చూస్తి. 'యాడికన్నా బిందెత్తుకుని పోతా ఉండావు' అని అడగాలనుకుని, అడిగితే ఏమి దొబ్బులో లే అని గమ్మునయిపోతి' చెప్పేసి పొయిందా అమ్మ.

మా అమ్మకు గుండెలు పగిలినట్లాయె. ఇంట్లోకి పొయ్యి, తలకాయిమింద చేతులు పెట్టుకుని, నీళ్లరుగు కాడ కుచ్చునింది. కొంచెం సేపుటికి మెల్లింగా ఏడుపెత్తుకునింది.

'నేను కన్న అగసాట్లు పడి, కడుపుకు కూడు గుడకా లేక ఒడగట్టి ఒడగట్టి తెస్తినే. దానిని గుడకా ఎత్తుకుని పొయ్యి వాని ముండకాడ పెట్టుకున్నే. ఎట్ల నేను కాపరం చేసేది' అని నెత్తి కొట్టుకుని ఏడస్తా ఉండాది అమ్మ. ఆ పొద్దు మా ఇంట్లో పొయ్యి రగల్లా. పొద్దన కూడు అంతుంటే నేను తింటి. అమ్మ మెతుకు ముట్టలేదు. మా నాయిన ఆ రెయ్యిగుడకా ఇంటికి రాలేదు. తెల్లారి పొద్దుపొడిసే పొద్దుకు వచ్చినాడు.

'బింది ఏమయింది బా' అని అడిగింది అమ్మ.

'నాకు తెలీదు' అన్నాడు నాయిన.

'నీకు తెలీక ఇంగెవురికి తెలస్తాది. ఏ దొంగలు వచ్చిరి మనింటికి. నక్కముట్లో పోగొట్టేసి వస్తివే. దాన్ని ఎన్ని అగసాట్లు పడి తెస్తినో నీకేమి తెలుసు. మూడు నెల్లు నేనూ నా బిడ్డా కడుపు కట్టుకుని కూడేసిన దుడ్లతో తెచ్చిన బిందిని, నక్కముట్టాట కోసం నీ ఎదాన పెట్టుకుంటివే. నువ్వు బాగుపడతావా' అంటా అరిసింది అమ్మ.

'ఏందే నోరు సించుకుంటా ఉండావు లంజా' అంటా వచ్చి, అమ్మని కింద తోసి కాలాచేతా తన్నినాడు నాయిన. అడ్డం పొయిన నాకుగుడకా నాలుగు దెబ్బలు తగిలినాయి. ఇద్దర్నీ తన్నేసి ఆయన దోవన ఆయన పొయ్యేసినాడు.

పండగ ఆనందములో అందురూ ఒక్కపొద్దులు ఉంటే, బింది పొయిన ఏడుపులో నేనూ మా అమ్మా ఒక్కపొద్దు ఉంటిమి ఆపొద్దు.

---

ఇత్తలిబింది కతను రాసిన ఎండపల్లి భారతిగారిది దిగువ బురుజు అనే చిన్న పల్లెటూరు. చిత్తూరు జిల్లా పడమటి తావులోని నిమ్మనపల్లి మండలంలో ఉంటుంది ఈ వూరు. మారుమూల పల్లెటూరులో కడు లేమిలో పుట్టిన భారతి తనతోపాటు (స్వయంకృషితో) పలు రంగాలలో ఎదిగింది. పల్లెలో ఏడుతరగతుల వరకే చదువగలిగినా, ఆతరువాత పట్టుదలతో చదివిబి.ఎ. పట్టాను పొందింది. చిత్తూరు జిల్లాలో మహిళా సంగాలవారు కలిసి నడుపుకొంటున్న 'నవోదయం' అనే నెలపత్రిక సంపాదకజట్టులో ఒకరుగా పనిచేస్తున్నారు ఇప్పుడు. నవోదయం పత్రికలోనే వీరి తొలికత 'చావుకూడు' అచ్చయింది. ఈ కత చిత్తూరుజిల్లా కతల సంకలనంలోకి ఎంపికయ్యింది. ఇది రెండవ కత. పొడపొడక (ఫోటో(గ్రఫీ)పై కూడా మక్కువ ఉన్న వీరు, రెండు మూడు చిరుతెరాట (డాక్యుమెంటరీ)లను తీసిఉన్నారు. ఇప్పటి కొలతలనుపట్టి ఈ కత చిత్తూరుజిల్లాదే అయినా, కతలోని నుడికారం అంతా మొరసునాడు పలుకుతీరులో ఉంది. ఎందుకంటే నిమ్మనపల్లి తావు పాట మొరసునాడులోనిదే కాబట్టి భారతి గారు మరిన్ని మంచి కథలను రాయాలని కోరుకొందాం..

**రచయిత్రి ఫోన్ : 9652802460**

## జనవాణి జాతీయ పార్టీగా తెలుగుదేశం

**మే** నెల సంచికలో 'జాతీయ పార్టీగా తెలుగుదేశం' అనే త్రిపురనేని హనుమాన్ చౌదరి గారి వ్యాసానికి స్పందన ఇది.

'మా రాష్ట్రంలో వుండి మా సంక్షేమాన్ని పొందుతూ, రిజర్వేషన్లు అనుభవిస్తూ, మీ భాషా ప్రాతిపదికన పార్టీ పెట్టుకుని మాతో పోటీ చేస్తారా? మీరెలాగు అల్పసంఖ్యాకులు, మీభాషాభిమానంతో, మా ఉప్పుతింటూ మాకు వ్యతిరేకంగా పోటీచేసి మమ్ములను బలహీనపరుస్తారా?' అని వారడిగితే మన తెలుగు సోదరులు ఏవిధమైన జవాబు ఇవ్వగలరు?' అని ప్రశ్నించారు. అలాగే నేరం, వేర్పాటువాదం అనే పదాలు వాడారు. అయ్యా, ముందు మీరు మాకు ఈ విషయాలు చెప్పండి.

తమిళనాడుకు చెందిన ఎఐడిఎంకె ప్రాంతీయపార్టీ (ఆల్ ఇండియా అన్నా ద్రావిడ మునేట్ర కజగం) జాతీయపార్టీగా ఆవిర్భవించిన సందర్భంలో కర్నాటక శాసనసభ ఎన్నికల్లో పోటీచేసి ఒక ఎమ్మెల్యే సీటు గెలిచి ఏకంగా కర్నాటక అసెంబ్లీలో అడుగుపెట్టి చరిత్ర సృష్టించింది.

ఇక తెలుగువారి రాజధాని హైదరాబాదులో 'మజ్లిస్ పార్టీ గత కొద్ది సంవత్సరాలుగా తిరుగులేని విజయాలు సాధిస్తూ ఇటీవల ఇతర రాష్ట్రాలలో కూడా పాగా వేసింది. మరి వీరు నేరం చేసినట్టా? లేక 'వేర్పాటువాదులా'?

చిత్తూరు జిల్లాలో ఎంతో మంది తమిళులు వున్నారు. వారు ద్రావిడ పార్టీల శాఖలుపెట్టి తే.దే.పా.కి వ్యతిరేకంగా పోటీచేస్తే అంటూ మాట్లాడారు. ఇప్పటికే చిత్తూరు జిల్లాలో AIADMK పార్టీ శాఖ మొదలైంది. ఈ విషయంగా ఇటీవల చిత్తూరు జిల్లా సందర్శించిన తమిళనాడు రాష్ట్రమంత్రి ఒకడు తనను (తమిళనాడు ముఖ్యమంత్రి గారు) తెలంగాణలో పోటీ చేయమన్నా పోటీ చేస్తానన్నారు. ఈ విషయం తెలుగు పేపర్లలో కూడా వచ్చింది. మీరు గమనించగలరు.

ఇకపోతే మనదేశ సరిహద్దులు దాటి తమిళులు శ్రీలంక, మలేషియా, సింగపూరు లాంటి విదేశాలలోసైతం తమిళ జండాను ఎగురవేసి వాళ్ళ భాషను అధికారభాషగా చేసుకుని ఆయా దేశాల అభివృద్ధికి పాటుపడుతున్నారు. మరి వీరు ఎవరి 'ఉప్పు' తింటున్నారు,

ఎవరి 'పప్పు' తింటున్నారో మీరే చెప్పాలి.

ఇక మీరు అన్నట్టుగానే తమిళనాడులోని తెలుగు ప్రజలు ఇక్కడి స్థానిక పార్టీలు ప్రజలతో మమేకమై వున్నారు. కొందరయితే వీరే తమిళులుగా మారిపోయినారు కూడా. అయినా సరే కొంతమంది పనిగట్టుకుని తెలుగువారిని కులాల పేరునా, ఆచారవ్యవహారాల పేరునా మీరు తెలుగువారు 'వందేరిగళ్' (వలసవచ్చిన వారు), తమిళనాడులో తమిళమే మాట్లాడాలి, ఉగాది పండగ చేయకూడదు, తంజావూరు, మధుర నాయకరాజులు, స్వాతంత్ర్య సమరయోధుడు వీరపాండ్య కట్టబొమ్మన లాంటి తెలుగు రాజులను బందిపోట్లు, దొంగలు'... ఇలా ఏదోవిధంగా తెలుగువారికి అవమానాలు జరుగుతున్నాయి. ఇందుకు తగ్గట్టు ప్రభుత్వం కూడా తమిళనాడులో తమిళమే చదవాలని చట్టాలను చేసింది. దీనికి తోడు తమిళనాడులో తెలుగు టీ.వి. ప్రసారాలను సైతం నిలిపివేసింది. ఇటీవల కృష్ణగిరి జిల్లాలో తెలుగు/కన్నడ టీ.వి. ప్రసారాలను నిలిపివేసిన ప్రభుత్వం స్థానిక తెలుగు ఎమ్మెల్యేల చొరవతో మళ్ళీ ప్రసారాలు మొదలెట్టింది.

ఇలా ప్రభుత్వ, ప్రభుత్వేతర సంస్థల తెలుగు వ్యతిరేక పోకడలలో విసిగి వేసారిన తెలుగు ప్రజలు/ముఖ్యంగా నేటి తెలుగు యువత ఇప్పుడిప్పుడే 'అవును మేము తెలుగు వాళ్ళమే, అయితే ఏంటి?' అని ఎదురు ప్రశ్నలు వేస్తునారు. తమ అస్తిత్వాన్ని నిలుపుకునే దిశగా అడుగులు వేస్తున్నారు. ఇలాంటి సందర్భంలో తే.దే.పా జాతీయ పార్టీగా ఆవిర్భవించడం చారిత్రాత్మక ఘట్టంగానే మేము భావిస్తున్నాము. అయినా మాకు జరగవలసిన నష్టం ఎప్పుడో జరిగిపోయింది. తే.దే.పా. వల్ల ఏదో నష్టం జరుగుతుందనీ భావించడం లేదు.

ఇక కృష్ణగిరి జిల్లాలోనైతే నేటికీ వందలకొలది తెలుగు పాఠశాలలు కొనవూపిరితోనైనా వున్నాయి. ఇక్కడ వూరికొకరు ఛందోబద్ధంగా తెలుగు పద్యాలు చెప్పే కవులు వున్నారు, రచయితలు, కళాకారులు, భాషాభిమానులకు కొదవలేదు. ఎన్నో తెలుగు సినిమా హీరోల అభిమాన సంఘాలు వున్నాయి.

తెలుగు భాషాభిమానం మెండుగా వున్న హోసూరు, డెంకణీకోట శాసనసభ నియోజక వర్గాలలో ఇప్పటివరకు జాతీయ పార్టీలైన బి.జె.పి. కాంగ్రెస్, కమ్యూనిస్టు పార్టీల అభ్యర్థులే ఎమ్మెల్యేలుగా ఎన్నికైనారు. ఇప్పటికి ఒక్క ద్రవిడ పార్టీ కూడా ఇక్కడ ఎన్నికలో గెలుపొందలేదు. ఇలా చెప్పుకుంటూ పోతే చాలా విషయాలు వున్నాయి. ఇవ్వన్ని కూడా తే.దే.పా.కి అనుకూలించే అంశాలే.

భాషాపరంగా తమిళనాడులో తెలుగువారికి ఏవిధమైన ఇబ్బందులు వున్నాయో అదే ఇబ్బందులు ఇక్కడి సోదర కన్నడ, మలయాళ, ఉర్దూ భాషీయులకు వున్నాయి. ఈ విషయాన్ని తే.దే.పా. నాయకత్వం దృష్టిలో వుంచుకుని నిర్మాణాత్మకంగా పనిచేస్తే అనతి కాలంలోనే తే.దే.పా. ఎమ్మెల్యేలు పదుల సంఖ్యలో తమిళనాడు అసెంబ్లీలో అడుగిడుతారంటే అది అతిశయోక్తి కాదు.

కావున తమలాంటి వారు తమిళనాడులోని సుమారు రెండుకోట్లపైగా వున్న తెలుగు జనాభా అస్తిత్వాన్ని, భాషాభిమానాన్ని పరిగణనలోకి తీసుకోగలరని మనవి.

**- అగరం వసంత్,**
కృష్ణగిరి జిల్లా తెలుగు రచయితల సంఘం కార్యదర్శి,
హోసూరు, సెల్‌నం. 09488330209

# సివిల్స్‌లో తెలుగును 'ఆప్షనల్'గా తీసుకొంటే...?

కొంతమంది సివిల్స్ పరీక్షల్లో తెలుగు తీసుకొంటే కష్టమనీ, మార్కులు రావనీ దుష్ప్రచారం చేస్తున్నారు. ఈ సందర్భంగా ఇది తప్పు. వాస్తవాలను ఇక్కడ తెలుపుతున్నాము. దయచేసి సివిల్స్‌కు సిద్ధపడుతున్న విద్యార్థులంతా వీటిని గమనించాలి.

తెలంగాణ వాసులకైన, ఆంధ్రా వాసులకైనా అమ్మ భాష తెలుగే! తెలంగాణ తెలుగు, రాయలసీమ తెలుగు, ఉత్తరాంధ్ర తెలుగు, కోస్తా తెలుగు... ఏదైనా అమ్మ భాషకు పుట్టిందే. ప్రజాకవి కాళోజీ 'అన్య భాషలు నేర్చి ఆంధ్రంబు రాదంచు సకిలించు ఆంధ్రుడా చావవెందుకురా?' అని ఎప్పుడో జాతిజనులను నిలదీశారు. తెలుగును సివిల్స్ పరీక్షలో 'ఆప్షనల్'గా తీసుకొని ఎంతో మంది పరీక్షల్లో విజయాన్ని సాధించారు. తెలుగు భాషా సాహిత్యాలను ఆప్షనల్‌గా ఎందుకు తీసుకోవాలి? లాభమేమిటి? అనే ప్రశ్నలకి సమాధానాలే ఇవి – ఆలోచించండి!

- తెలుగు భాషా సాహిత్యాలు తీసుకొని మెయిన్స్‌కి సన్నద్ధమయ్యేవారి సంఖ్య మిగిలిన ఆప్షనల్స్‌తో పోలిస్తే చాలా తక్కువ. తెలుగును తీసుకుంటే కేవలం మన రాష్ట్ర అభ్యర్థులతోనే – అదీ మూడు, నాలుగు వందలమందితో మాత్రమే పోటీ పడాలి. అంటే మన వాళ్ళతోనే పోటీపడాలి. ఇది సౌలభ్యం కాదా? అదే ఇతర ఆప్షనల్ అయితే, దేశవ్యాప్తంగా –ఆంగ్ల మాధ్యమం వారితో–వేలాది మందితో పోటీపడాలి? ఇది కష్టం గదా! పోటీ బాగా ఎక్కువ గదా?
- ఏ ఆప్షనల్ అయినా కొత్తది అయినప్పుడు – చిన్నప్పటి నుంచి చదివింది. అంతో ఇంతో అవగాహన ఉన్నది – వినగానే చెవికెక్కేది అయిన తెలుగు తీసుకోవడం సమంజసమే గదా?
- తెలుగు ఆప్షనల్‌లో వ్యాకరణం ఉండనే ఉండదు. వాడుక భాషలో పత్రిక భాషలో సమాధానాలను స్వేచ్ఛగా రాయవచ్చు.
- తెలుగు సిలబస్‌కి లోబడే ప్రశ్నలు వస్తాయి తప్ప సిలబస్‌లో లేని ప్రశ్నలు రావు..
- తెలుగు ఆప్షనల్‌కి మెటీరియల్ ఎక్కడైనా దొరుకుతుంది.
- తెలుగు సిలబస్‌నుంచి కూడా జి.ఎస్.లో రాజులు, కవులు, రచనలపై అయిదారు ప్రశ్నలు తప్పకుండా ఉంటాయి.
- తెలుగు శిరోభారంగా, అయోమయంగా ఉండదు. హాయిగా వినదగేలా, ఆనందం కలిగేలా, ఆశ్చర్యం కలిగేలా ఉంటుంది. కాస్తంత శ్రద్ధ వహిస్తే'స్కోరింగ్' సంపాదించవచ్చు.
- మన మాతృభాష గురించి ఇలా అయినా నేర్చుకొంటున్నామన్న ఆత్మసంతృప్తి వుంటుంది.
- కంపల్సరీ క్వాలిఫైయింగ్ పేపర్‌అంటే భయం పోతుంది.
- తెలుగు ఆప్షనల్‌పై దుష్ప్రచారాన్ని నమ్మకండి.

**కొంపెల్ల శర్మ, ద్వానా శాస్త్రి, టి. రమేష్,**
హైదరాబాదు

# తెలుగుమాటలే లేవా?

అమ్మనుడిలో వచ్చిన 'బతుకు తెరువులను పట్టించుకోకుండా భాషను 'బతికించుకోలేం' అని శక్తి శివరామకృష్ణగారు ఇచ్చిన సమాచారాన్ని చదివినాను. చదవతా ఉండేటప్పుడు నాకు కొన్ని అరగల్లు (సందేహాలు) వచ్చినాయి. ఇంతకుముందు స.వెం. రమేశ్‌గారి ప్రళయ కావేరి కతలు చదివినాను. అప్పుడు ఆడ ఉండే బతుకులంతా తెలుగే అని తెలుసుకొని సంతోషపడినాను. అయితే సునామి వచ్చినప్పుడు తమిళ పత్రికలు నెల్లూరి పెవ్వంటెం(జిల్లా)లో సచ్చిపోయిన మీనవర్లు అందరూ తమిళులు అని రాసినాయి. అప్పుడు నాకు ప్రళయకావేరి తావులో ఎక్కువ ఉండేది తెలుగువారా, తమిళులా అని అరగలి వచ్చింది. ఇప్పుడు ఈ సమాచారాన్ని చదివినాక ఆ తావులో ఎక్కువగా ఉండేది తమిళులు ఏమో అని అనిపిస్తోంది. ఎందుకంటే ఆ సమాచారంలో ఉండిన తెలుగును బట్టి అవి తమిళ మాటలే అని తేటగా తెలిసి పోతాఉంది. అట్టయితే వాటికి తెలుగు మాటలే లేవా? ప్రళయ కావేరిలో తెలుగు వాళ్లే లేరా? ఉంటేనూ వాళ్లుకూడా ఈ తావు పేర్లను తమిళంలోనే చెప్పుతూ ఉండారా? తెలుగు పేర్లు ఉండి ఉంటే వాటిని కూడా ఇచ్చి ఉంటే బాగ ఉండును కదా. ఆ తెలుగు మాటలు కూడానూ పొదక (Record)అయి ఉండును కదా.

**– ఓట్ర పురుసోత్తం,** రాయవేలూరు, 096617868

# యాంకర్ సుమ మాటలను ఖండిస్తున్నాం

జూన్ మొదటి వారంలో ఈటీవీలో ప్రసారమైన దర్శకేంద్రుడి సినీ స్వర్ణోత్సవం కార్యక్రమంలో భాగంగా ఆరోజు రాఘవేంద్రరావు గారి కుటుంబసభ్యులతో కూడిన 'షో' ప్రసారమైంది. ఆ 'షో'లో యాంకర్ సుమ కోయంబత్తూరుకు చెందిన ఒకామెతో 'రండి... భోంచేయండి' అని అనడానికి మీరు ఎలా అంటారు అని అడిగింది. అందుకు ఆవిడ 'రండ.. రండ... కూసొండ, 'కూడు' తిని 'పొండ' అంటూ సమాధానం చెప్పింది.

వెంటనే సుమగారు తనదయిన స్టయిల్‌లో 'అబ్బో ఇదేదో బిచ్చగాళ్ళని పిలిచినట్లుంది' అంటూ హేళనగా మాట్లాడారు. ఇక్కడ ఎవరు బిచ్చగాళ్లు? పోనీ– ఎవరిది బిచ్చగాళ్ళ భాష! తినే తిండిని అంటే 'భోజనం' పదాన్ని సంస్కృత భాషలోనుంచి అరువు తెచ్చుకుని మాట్లాడిన వాళ్ళదా? లేక అచ్చతెలుగులో 'కూడు' అని మాట్లాడిన కోయంబత్తూరు ఆవిడదా? తెలుగు పెద్దలే తేల్చాలి. తెలుగు భాషలోని అన్ని ప్రాంతాల ప్రజల తెలుగు మాటలని, మాండలికాలను గౌరవించాలనే కనీస జ్ఞానం ఉండాలిగదా. ఇలా కొందరి అవివేకం, అహంకారాలే ఆంధ్రప్రదేశ్ చీలిపోవడానికి ఒక కారణమయింది. అయినా బుద్ధి తెచ్చుకోక ఏం పాపం చేశామని తమిళనాడు తెలుగు మాటలపై పడ్డారు! అచ్చతెలుగు మాటల్ని హేళన చెయ్యొద్దు.

అచ్చతెలుగు పదాలు ప్రజా 'పలుకుబడి' నుడిలో సేంద్రీయ ఎరువులుగా సహజమైన పెరనుడుల పదాలు 'బడిపలుకు' నుడులొచ్చినాక రసాయన ఎరువుల్లా కృత్రిమమైనవి. మనకు టీవిలొచ్చినాక యాంకరమ్మలనోట, 'పంటల్లో పార్థీనియం'లాగ కలుపునుడి ఐపోయింది. సకల కళాప్రవీణురాలైన సుమక్కయ్యగారికి తెలియనిదా?

**– నంద్యాల నారాయణరెడ్డి,**
తెలుగు భాషోద్యమ సమాఖ్య, హోసూరు.

## అమ్మనుడి విజయం సాధిస్తుంది

**'అ**మ్మనుడి' జూన్ సంచికలో ఆచార్య వెల్చేరు నారాయణరావు గారి వ్యాసము మన తెలుగు విశ్వవిద్యాలయములకు కనువిప్పు కావాలి. కొన్ని యం.ఫిల్‌ల సిద్ధాంత వ్యాసాలు చదువుతుంటే అవి కెరీఫిల్ వ్యాసాలా అన్న అనుమానం పొడసూపుతోంది. డా॥ కత్తి పద్మారావుగారి కవిత 'ఛిద్రమవుతున్న మానవతా విలువలను అన్ని జీవనరంగాలకు సంబంధించి ఎత్తి చూపింది. స్వచ్ఛభారత్ ఇంకా నినాదంగానే మిగిలిపోయింది. అనేక మంచి వ్యాసాలతో – బృహత్తర లక్ష్యంతో వస్తున్న 'అమ్మనుడి' విజయవంతం అవుతుందని నా నమ్మకం.

**– పరుచూరి శ్రీనివాసరావు,**
కోలవెన్ను

## తెలుగు కనుమరుగౌతోందా?

**'మనం** మాట్లాడడంలో, వ్రాయడంలో తెలుగు భాషను భ్రష్టు పట్టిస్తున్నాం. ఇది ఇలాగే సాగితే తెలుగు కనుమరుగౌతుంది. ఒకవేళ బ్రతికినా నేడు సంస్కృతం వలె మన యెదుట ఉండవచ్చునేమో! అసలయిన సిసలైన అమ్మనుడి పరిస్థితి ఏమవునో?

**– బుద్ధవరపు వేంకటరత్నం,**
సీనియర్‌జర్నలిస్టు హైదరాబాదు.



వంశీ ఆర్ట్ థియేటర్స్ ఇంటర్నేషనల్ ఆధ్వర్యంలో జూన్ 24న డా॥ ద్వా.నా. శాస్త్రి గారు 68వ ఏట అడుగుపెడుతున్న సమయాన 268 నిముషాల నిర్విరామ ప్రసంగంచేశారు. హైదరాబాద్ త్యాగరాయగాన సభలో జరిగిన ఈ కార్యక్రమంలో ఆంధ్రప్రదేశ్ మంత్రివర్యులు శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారి చేతుల మీదుగా 'జీనియస్ బుక్ ఆఫ్ రికార్డ్స్' పత్రాన్ని అందజేసి సత్కరించారు. ఈ కార్యక్రమంలో శ్రీ బైసదేవదాసు,శ్రీ ఆకెళ్ళ రాఘవేంద్ర, కళాబ్రహ్మ వంశీరామరాజు, శ్రీ బింగి నగేంద్రగౌడ్, డా॥ కళావేంకటదీక్షితులు పాల్గొన్నారు.



కరీంనగర్ ప్రెస్ భవనంలో మే 20న - చక్రేశ్వరీదేవి శతకాన్ని ఆవిష్కరిస్తున్న తెలంగాణ సంస్కృతి సారధి రసమయి బాలకిషన్. పక్కన జడ్‌పి చైర్మన్ తుల ఉమ, చరిత్రకారులు సంకేపల్లి నాగేంద్రశర్మ, రచయిత శ్రీనివాసరాజు తదితరులు.



మహాకవి శ్రీశ్రీ 32వ వర్ధంతి సందర్భంగా కిన్నెర ఆర్ట్స్ థియేటర్ ఆధ్వర్యంలో కిన్నెర శ్రీశ్రీ పురస్కారాన్ని ప్రఖ్యాత కవి డా॥ ఎన్. గోపికి హైదరాబాద్ త్యాగరాయ గానసభలో డా॥ సి. నారాయణరెడ్డి ప్రదానం చేస్తున్న దృశ్యం. చిత్రంలో డా॥ ఓలేటి పార్వతీశం, డా॥ ద్వానా శాస్త్రి, సారిపల్లి కొండలరావు, కిన్నెర కార్యదర్శి మద్దాళి రఘురాం, డా॥ పొరెడ్డి రంగయ్య, ఎస్.వి రామారావు ప్రభృతులు ఉన్నారు.

## 'అమ్మనుడి' లభించేచోట్లు

నవోదయ బుక్ హౌస్, ఆర్యసమాజ్ భవనం ఎదురుగా, కాచిగుడా. **హైదరాబాదు – 500 027.**
ఫోన్: 040–24652387

మైత్రీ బుక్ హౌస్, జలీల్ వీధి, కార్ల్‌మార్క్స్ రోడ్డు, ఏలూరు రోడ్డు, **విజయవాడ – 520 002.**
ఫోన్ : 9866211995

డా॥ ఈమని శివనాగిరెడ్డి
డా॥ మొవ్వా శ్రీనివాసరెడ్డి

# ప్రాకృత శాసనాల్లో కొన్ని తొలి తెలుగు పదాలు

**'ఆంధ్ర** వాఙ్మయ ఆరంభదశ అనే గ్రంథంలో దివాకర్ల వెంకటావధాని, కనమళ్ల ధనుంజయుని క్రీ.శ. 575వ సం॥పు శాసనమే తొలి తెలుగు శాసనమని చెప్పారు. ఇప్పటివరకూ వెలుగులోకొచ్చిన ప్రాకృతశాసనాల్లో క్రీస్తు శకారంభం నాటికే కొన్ని తెలుగు మాటలు చోటు చేసుకొన్నాయని ప్రముఖ పురాతత్త్వవేత్త డా. ఇంగువ కార్తికేయశర్మ తన పరిశోధనల్లో తేలిందన్నారు. నాణేలశాస్త్ర నిపుణుడైన డా. దేమె రాజారెడ్డి, కరీంనగర్ జిల్లా కోటిలింగాల తవ్వకాల్లో బయల్పడిన శాతవాహనులకంటె ముందు కాలానికి చెందిన స్థానిక రాజులైన గోబద, సిరివాయ, సమగోప, కంవాయలు వారి పేర్లతో విడుదల చేసిన నాణేలపై వారిపేర్లు తెలుగు పదాలే (గోబద (బద్రయ్య) సమగోప (గోపయ)నని పేర్కొన్నారు. కొన్ని తొలి పాలకృత శాసనాల్లో వేపూరు అనే తెలుగు పేరు క్రీ.పూ. 1వ శతాబ్దికి చెందిందని తిరుమల రామచంద్ర తన 'లిపి పుట్టుపూర్వోత్తరాలు'లో రాశారు. తెలుగు భాష, వ్యాకరణ విషయంలో కె. మహదేవశాస్త్రి, బూదరాజు రాధాకృష్ణలు తమ పరిశోధనల్లో, రేనాటి చోళ రాజైన ఎరికల్ ముతరాజు క్రీ.శ. 575లో వేయించిన కనమళ్ల శాసనమే పూర్తిగా తెలుగులోనున్న తొలి శాసనమని తేలిందన్నారు.



డా॥ ఐ..కె. శర్మ పరిశోధనల్లో (1975నాటి మాట) ప్రకాశం జిల్లా, మాలెకొండ గ్రామంలో క్రీ.పూ. 3వ శతాబ్ది (అశోకుని కాలాని)కి చెందిన బ్రహ్మీ లిపిలోనున్న ప్రాకృత శాసనంలో కూడా తెలుగు పదాలు దొర్లాయన్నారు. మాలెకొండ వద్ద గల రాతిని తొలచి మలచిన గుహల్ని స్థానికులు పార్వతిగుహ అని పిలుస్తారు. ఆ గుహ గోడపైన 'అరవాలకులస నందశెఠి పుతస సిరివీరి శెనోదాన' అన్న క్రీ.పూ. 3వ శతాబ్దపు బ్రాహ్మీలిపి శాసనముంది. ఈ శాసనంలో దాతపేరు అరవకుల సిరివీరిశెఠి అని ఉంది. సిరివీరిశెఠి అరవకులానికి చెందినవాడనీ, తమిళులను అరవవారని పిలుస్తారు గాబట్టి, ఈ 'అరవ' అనేమాట తెలుగు మాటేనని, క్రీ.పూ. 3వ శతాబ్దికే తెలుగు వాడుకలో ఉందని ఈ శాసనం రుజువు చేస్తుందని ఆయన అన్నారు. పైగా ఈ గుహ బౌద్ధులకో, జైనులకో ఆవాసమై ఉంటుందని, తరువాతి కాలంలో పార్వతిగుహగా పిలిచారని శర్మగారన్నారు.

శ్రీకాకుళం జిల్లాలోని శాలిహుండమనే బౌద్ధ స్థావర తవ్వకాల్లో బయల్పడిన కుండపెంకులపై గల ఒక భిన్నమైన శాసనం శక కాలంలో దానం' అని ఉండటాన, 'నకు' (ఉదా: విహారమునకు దానం) అనేది అచ్చ తెలుగు పదమే. లిపిని బట్టి ఈ శాసనాక్షరాలు క్రీ.పూ. 2వ శతాబ్దికి చెందుతాయని రాయప్రోలు సుబ్రహ్మణ్యం తెలియజేశారు. పశ్చిమ క్షాత్రపులనాణేలపై గ్రీకు, ఖరోష్టి, బ్రాహ్మీలిపుల్లో ప్రాకృత, సంస్కృత భాషల్లో చిన్న శాసనాలుండటం వారి ప్రత్యేకత. శాతవాహనులు విడుదల చేసిన శాసనాలపై కేవలం బ్రాహ్మీలిపిలో అటు ప్రాకృతం, ఇటు తెలుగు భాషల్లో చిన్న శాసనాలున్నాయి. శాతవాహన రాజైన గౌతమీపుత్ర శాతకర్ణి మొదటిసారిగా తన బొమ్మలున్న వెండినాణేలను విడుదల చేశాడు. అలాగే తమ నాణేలపై పులుమావి, శాతకర్ణి, యజ్ఞశ్రీ శాతకర్ణిలు కూడా పేరుమార్పుతో అదే శాసనాన్ని ముద్రించుకొన్నారు.



**1. పులుమావి నాణేలపై:**
బొమ్మ భాగంపైన: రాణా వాసెఠి పుతస సిరిపులుమావిస
బొరుసు భాగంపైన: అరహణకు వాహిట్టి మాకకు తిరుపులు మావికు.

**2. శాతకర్ణి నాణేలపై:**
బొమ్మ భాగంపైన: రాణా వాసిఠి పుతన సిరిశాతకణిస
బొరుసు భాగంపైన: అరహణకు వాహిట్టి మాకకు తిరుహతకణికు

**3. యజ్ఞసిరి శాతకర్ణి:**
బొమ్మ భాగంపైన: రాణా గౌతమీ పుతన సిరియనశాతకణిస
బొరుసు భాగంపైన: అరహణకు గౌతమీపుతకు తిరుయనహతకణికు

పై మూడు నాణేల బొమ్మ భాగంపైన శాసనం ప్రాకృత భాషలో ఉండగా, బొరుసు భాగంపైన గల శాసనంలో ద్రావిడ భాషల్లోని తెలుగు, తమిళ ఛాయలు కన్పిస్తున్నాయన్న ఐ.కె.శర్మ అభిప్రాయంతో ఏకీభవించాలి.

కొన్ని పదాలు పుష్యంతములుగా, 'కు' అన్న అక్షరంతో ఉండటం ఈ శాసనాల ప్రత్యేకత. ఉదాహరణకు: అరహణకు (అరసనకు). ప్రాకృతంలో హ,స అక్షరాలు అటూ ఇటూ మారుతుంటాయి. అరసనకు అంటే రాజుయొక్క లేక రాజునకు అని అర్థం. కన్నడంలో ఈ అరసు అన్న తమిళ పదం రానురాను అర్సు (దేవరాజ్ అర్స్)గా మారింది. మకనకు అంటే మకన్(డుకు) అనీ, తరువాతికాలంలో ఇదేపదం ఏకవచనంలో మగన్డు, బహువచనంలో మగన్డుగా మారిందనీ, అనగా కొడుకు, కొడుకులు అన్న కనుమరుగైన తెలుగు పదాలేనని వేటూరి ప్రభాకరశాస్త్రి 'తెలుగు మెఱుగులు' అన్న పుస్తకంలో పేర్కొన్నారు.



క్రీ.శ. 1వ శతాబ్దినాటి అమరావతిలోని "సిద్ధం కుమారనివాసికస నాగ'స' అనే శాసనంలో 'కుదూరు (గూడూరు)' అన్న తెలుగు పదముంది. దివి ప్రాంతంలోని కోదూరని కొంతమంది గుర్తించారు. అమరావతిలోని మరో శాసనంలో ధనగిరి వత్తవనాగబుద్ధివనియంపుతో నకసిరి బహినియపుసే' అని ఉండగా నాగబుద్ధి అన్నపేరులోని నాగబు'ను తొలి తెలుగు పదంగా వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పొరబడినారు. మరో



శాసనంలో మొదటి లైనులో 'నాగబు', రెండో లైనులో 'ద్దినో' అని ఉంటాన బహుశ అలా చదివి ఉండవచ్చు.

ఇంకో అమరావతి శాసనంలో

'భగవతొకవురూరె నత్తవియా' అని ఉంది. ఇందులో కవురూరు తెలుగు పదమే.

విశాఖజిల్లా తొట్లకొండ బౌద్ధారామం వద్ద బయల్పడిన క్రీ.శ. 1వ శతాబ్దినాటి బ్రాహ్మీ శాసనాల్లో కొన్ని తెలుగు పదాలున్నాయి. 'హసదానం చత కొతూరగిరి నివాసిన' అన్న శాసనంలో కొత్తూరగిరి యలమంచిలి దగ్గరున్న గిరికొత్తూరుగా గుర్తించవచ్చు. కొత్తూరు తెలుగు పదమే.

అమరావతి దగ్గరున్న వడ్లమానులో దొరికిన క్రీ.పూ. 1వ శతాబ్దినాటి చిన్న శాసనంలో 'భోక వడ్డమాన పవతె' లో 'వడ్డమాను' అచ్చ తెలుగు పదమే. 'వధమాన నివాసికసధముతిససమాతుకస పితుకస సభాతుకస చుల ధముతికస' అన్న మరో శాసనంలో కూడ వడ్డమాను అన్న పదముంది. నందాయపాలెంలో దొరికిన క్రీ.శ.1వ శతాబ్ది బ్రాహ్మీశాసనం 'గోలినివాస' గోలిగ్రామంలో ఉండే నాగవర్మను ప్రస్తావిస్తుంది. ఇందులోని గోలి పల్నాడులోని గోలి. ఇదికూడా తెలుగు పదమే.

ఇలా తొలి శాసనాల్లో అనేక తెలుగు పదాలున్నాయి. అంటే క్రీ.పూ.3-2 శతాబ్దాలకే తెలుగు భాష వాడుకలో ఉందని చెప్పటానికి ఈ ఆధారాలు ఉపయోగపడతాయి.

---

రచయితలు డా॥ ఈమని శివనాగిరెడ్డి (ది కల్చరల్‌సెంటర్ ఆఫ్ విజయవాడ) ఫోన్: **9848598446** ; **డా॥ మొవ్వా శ్రీనివాసరెడ్డి** (లయోలా కాలేజి, విజయవాడ, ఫోన్: **9490333488**

---

చర్చ

- శ్రీ వుప్పల నరసింహం

# బుద్ధుని బోధనలకు ఇంత ప్రాధాన్యమెందుకు?

**నేడు** బౌద్ధానికి ప్రాసంగికత లేదు. అయినప్పటికీ అదే పనిగా బౌద్ధంపై ప్రచారం చేయడం సరైందికాదు. భాషోద్యమానికి ప్రాసంగికత ఉంది అంతేకాని బౌద్ధోద్యమానికి కాదు. క్రీస్తుపూర్వపు బుద్ధుని బోధనలపై 21వ శతాబ్దంలో అదేపనిగా చర్చ చేయడం సబబుకాదు.

మనిషి జీవితం తృప్తిగా, సంతోషంగా గడవాలి... దీని చుట్టూనే ఎన్నో ఇజాలు, సిద్ధాంతాలు పురుడు పోసుకున్నాయి. అయినప్పటికీ నేడు మనిషి తృప్తితో సంతోషంగా మనగలుగుతున్నాడా?...లేదనే సమాధానమొస్తుంది. ఎందుకని... అంటే? తృప్తి... సంతోషం సాపేక్షికాంశాలు. అవి, అంగట్లో దొరకవు. మనిషి ఇంద్రియాలపై నియంత్రణపైనే అవి ఆధారపడి ఉంటాయి. ఈ ప్రాథమిక సూత్రాన్ని విస్మరించి ఎన్ని పిరమిడ్లు కట్టి ధ్యానం చేసినా, ఎన్ని చైత్యాలు నిర్మించి బోధ చేసినా, ఎన్ని ఆరామాలు వెలసినా అంతగా ప్రయోజనం కనిపించదు. ఈ విషయాన్ని రెండున్నర వేల సంవత్సరాల బౌద్ధమతమే తెలుపుతోంది. అయినప్పటికీ అందులో అత్యద్భుతమైన 'సంజీవిని' ఏదో ఉందని అనుకోవడం, బోధ చేయడం నిరర్ధకం. నిజాయితీ అసలే అవదు.

మనిషి సహజాతాలైన అరిషడ్వర్గాలను పూర్తిగా జయించడం సాధ్యంకాదు. నూటికో, కోటికో ఒకరు పాక్షికంగా వాటిని జయితే జయించవచ్చు. బౌద్ధం సహితం అరిషడ్వర్గాలను జయించాలని చెప్పినా ఆచరణలో అది సాధ్యంకాదని ఆ యిజం 18 పాయలుగా చీలిపోవడమే చెబుతోంది. అష్టాంగ ధ్యానం చేసినా ఎవరికీ 'ముక్తి' లభించలేదు. లభించదు.

ముక్తి, విముక్తి అనే పదాలే మానవ జీవితానికి అన్వయమవని పదాలు. కాని బౌద్ధం వాటి గూర్చి మాట్లాడటంలో అసంబద్ధత వ్యక్తమవుతోంది. ఇటీవల అమరావతి ఎక్కువగా వినబడుతోంది. దానికి కారణం వేరైనా అందులో బౌద్ధం నిబిడీకృతమవుతోంది. అమరావతి మ్యూజియంలో వందల సంవత్సరాల క్రితపు బౌద్ధం ఆనవాళ్ళు, శిల్పాలు వగైరా కొలువై వున్నాయి. అందులో బుద్ధుని ఆనవాళ్ళు, శిల్పాలు వగైరా కొలువై వున్నాయి. అందులో బుద్ధుని పాదాల ముద్రలని చెప్పబడుతున్నవి కూడా ఉన్నాయి. ఆ పాదాలకు చక్రాలు చెక్కి పవిత్రతను ఆపాదించి చూపుతున్నారు. ఎంతటి మౌఢ్యంతో బౌద్ధ ప్రచారానికి పూనుకుంటున్నారో ఈ ఒక్క ఉదాహరణ చాలు. బుద్ధుని పాదాలకు చక్రాలు ఉండడమేమిటని ఏ ఒక్కరు ప్రశ్నించకపోవడం విచిత్రం.

భౌతికవాది, హేతువాది బుద్ధుడు అని విశ్వసించిన వారే అదే అమరావతిలో ఐదారు సంవత్సరాల క్రితం 'కాలచక్ర' క్రతువును భారీ ఎత్తున నిర్వహించారు. ఆక్రతువు పూర్తిగా మంత్ర తంత్రాలతో కూడుకున్నవి. అనేక బలులు(!) అందులో ఇమిడి ఉన్నాయి. ఇది పరమ పవిత్రమైనదని ప్రపంచవ్యాప్త బౌద్ధ అభిమానులు దీనికి హాజరయ్యారు. ఈ మంత్ర తంత్రాలు భౌతిక వాదాన్ని, హేతువాదాన్ని బలపరుస్తున్నాయా?... దేన్ని సూచిస్తున్నాయి?

మనిషి దుఃఖానికి, క్లేశానికి అతని కోర్కెలే కారణమన్న బుద్ధుడు విశ్లేషణ, వెంగడింపు చేస్తూ దీన్ని జయించడానికి అష్టాంగ మార్గాన సాధన చేసి 'ముక్తి'ని పొందాలని సూచించాడు. ఇవి మనిషితత్వాన్ని విస్మరించి, మనిషి ఆవరణం వెలుపల నిలుచుని చెప్పిన మాటలు, చేసిన బోధ తప్ప మరొకటి కాదు.

మనిషినుంచి అరిషడ్వర్గాలను వేరు చేయడం సాధనా కాదు. అవి సహజాతాలు. వాటిని సాధన ద్వారా జయించి ముక్తి పొందడం 'ప్రజల పరిధిలోకి రాని విషయాన్ని ఎట్లా బోధించినా ఏమిటి ప్రయోజనం? ఒక పరిణామక్రమంలో ఒక అంశం ఉబికి వస్తే ఆ అంశమే సర్వోత్కృష్టమైనది. దానికి పూర్వం అంతా మకిలి... మైల... పనికిమాలినది అని చెప్పుకోవడం ఆత్మ సంతృప్తికే బాగుంటుంది తప్ప సత్యం ప్రకాశించినట్టవదు.

బుద్ధునికి పూర్వపు సమాజమంతా వైదిక ధర్మమయమైలేదు. అనేక జనపదాలున్నాయి. బలమైన, శక్తిమంతమైన వైదికేతర జనపదాలున్నాయి. ఆయా జనపదాలు, నమ్మకం, విశ్వాసం, జ్ఞానం - విజ్ఞానం వెలుతురులో అవి మనగలిగాయి. కేవలం వైదిక ధర్మంలోనే బలులు ఇచ్చే సంస్కృతి ఉందనుకోవడం పొరపాటు. ప్రకృతితో సహజీవనం చేస్తున్న మానవ సమూహాల విశ్వాసం - నమ్మకం ఆధారంగానే తమ ప్రీతిని వ్యక్తం చేసే వైనం ఆ బలి క్రతువుల్లో కనిపిస్తుంది. వైదిక అంటు-సంటులేని అనేక తెగలు-సమూహాలు ఇప్పటికీ ఆ విశ్వాసంతో కొనసాగుతున్న విషయం విస్మరించరాదు.

బుద్ధుడు తొలి భౌతికవాది అని నిర్ధారణకొచ్చి ఆయన బోధనలకు ప్రాశస్త్యాన్ని కలిగించాలని ఆరాటపడటం అసమంజసం. ఇహం-పరం అన్న వైదిక ధర్మాన్ని ఎదుర్కొనేందుకు అష్టాంగసాధనద్వారా ముక్తిని సాధించమని చెప్పడం ఎలా భౌతికవాదమనిపించుకుంటుంది?.. బుద్ధం శరణం గచ్ఛామి అన్న మాటలోనే భౌతికవాద విరుద్ధాంశం దాగుంది. సంఘం శరణం గచ్ఛామి అన్న బోధ జనపదాల ప్రాథమిక సూత్రం. అసంఖ్యాక జనపదాలు బుద్ధునికి ముందు ఈ సూత్రం ఆధారంగానేమనుగడ సాగించాయి. వాస్తవానికి కొత్తగా బుద్ధుడు చెప్పింది ఏమీ కనిపించదు. కొంతమందికి కొన్ని మాటల వల్ల సాంత్వన కలుగుతుంది. కొందరి మాటలవల్ల ప్రేరణ కలుగుతుంది. బుద్ధుని బోధనలవల్ల కొందరికి సాంత్వన కలిగింది. ఈ సాంత్వనే ముక్తిమార్గం అని భ్రమిసేలా బోధ చేయడం సరైనదికాదు.

తల్లి-తండ్రి, గురువు, అనుభవజ్ఞుల మాటలవల్ల కూడా సాంత్వన కలుగుతుంది. ఆయా పరిధులకు లోబడి, ఆ మాటలను ఆస్వాదిస్తారు. అలాగే బుద్ధుని మాటలు కూడా అంతేగాని ఆయన మాటలు 'అల్టిమేట్', ఆ అనంతరం ఇంకేమి మిగిలిలేదు అని భావించడం భావదారిద్ర్యం తప్ప మరొకటి కాదు.

మానవ మహాప్రస్థానంలో నీటి బుడగలా వచ్చిపోయిన బౌద్ధానికి శాశ్వతత్వం ఆపాదించి పెట్టే ప్రయత్నం, ప్రయత్నాలు అంత అమోదనీయం కాదు. ఒక కాలంలో సాంత్వన పొందడానికి ఉపకరించేసి వాటికి శాశ్వతత్వం సమకూర్చి పెట్టాలనుకోవడం ఒక రకమైన అజ్ఞానం తప్ప మరొకటి కాదు.

మానవ జీవన ప్రహేళికకు అంతిమ సమాధానం కనిపించదు. ఆ క్రీడ అలా కొనసాగుతుంది. కొనసాగాలి... ఆ క్రీడకు, ఆటకు ప్రాథమిక నియమాలు పెద్దగా మారవు. పైపైన దిద్దే మెరుగులు మారుతాయి అంతే! ఈ తత్వం బోధపడితే చాలు!

రచయిత ఫోన్: 9985781799

గోదావరి లోయలో
కొండరెడ్ల
బతుకు కతలు - 5

– శ్రీ పల్లాల బొర్రంరెడ్డి

# దుంపలు

**వైయుముదుంప:** అడవిలో ఉంటది. కొత్త అమావాస్య నెలకి భూమిలో మొలకెత్తుతది. కణుపులవద్ద ముళ్ళు ఉంటవి, సన్నపు తీగె. ఒక ఆకు మూడుభాగాలు. పువ్వులు, పిందె తయారులో విడిచిన మామిడిపువ్వు ఆకారంలో ఉంటవి. కొన్ని తట్టలు/ కాయలు ఉల్లిపొరలాగ అంటుకొని ఉంటవి. డిశంబరు, జనవరి, మార్చివరకు తవ్వుకొని తినవచ్చు. భూమిలోపల ఉంటది. గచ్చెలతో తవ్వి తీయవలె. దుంపను అగ్గిమంటలో కాల్చి ఉడికించి తింటరు. తెల్లదుంప రుచి. కాల్చినప్పుడు ఉడికిన అన్నం రూపంలో ఉంటది.



దుంప చెక్కలుచేసి నిప్పులో ఉడికిస్తరు. పీచు ఉంటది. పైభాగం బొచ్చుంటది. నలుపు రంగులో ఉంటది. దుంపలో నీరు దురద. ఉడికించాక ఆ దురద ఉండదు. అన్నంలేని సమయంలో ఈ దుంపలు తిని జీవించవచ్చు. నరాల బలహీనతకి మంచివైద్యం. మంచి బలం, హాని ఏమీలేదు. అడవిపందులు ఈ దుంపలు తిని బలిసిఉంటవి. అడవినేదులు అసలు విడిచిపెట్టవు.

వైయుం అనగా కోసేటప్పుడు 'కయుం' అని శబ్దం వస్తది. వెంటనే నీరు వస్తది అందుకే ఆ పేరు. మాయపంది అనికూడా అంటరు. సంతానం లేనివారికి పిల్లలను నిల్పుటకు ఈ వైయుం దుంపను బలిఇస్తరు. అడవిలో అన్నిచోట్ల దొరుకుతది. పువ్వులువేస్తే పువ్వులవైయుం, తట్టలువేస్తే తట్టలవైయుం అని పిలుస్తరు. దుంపలో ఉన్న పీచు నమిలి జల్లవలె. మెత్తని దుంప తినవలె. తాటితేగవలె ఇది పిల్లలు పెట్టుతది. జూన్‌లో మొలకెత్తుతది.

**రాచవైముం:** అడవిలో అన్ని ప్రాంతాలలో ఉంటది. తెలుపురంగు. దుంపలోపల మొత్తం పీచు. గుండ్రంగ ఉంటది. పిల్లలు పెట్టదు. ఒంటరిజాతి. తీగచెట్టు. కణుపులవద్ద ముళ్ళు ఉంటవి. జనవరి, ఫిబ్రవరి, మార్చినెలలలో తవ్వితింటరు. చెట్టుకు మూడు తీగెలు ఉంటవి. కణుపులో ఒక ఆకు ఉంటది. దుంపలలో ఇది పెద్దది. ఒక దుంప అందుకే రాచవైము అని పేరు. నిప్పులో కాల్చిన, కుండలో ఉడికించిన, దుంప విరిచిన, గిన్నెలో చిదుము అన్నంలాగున ఉంటది. బలమేతప్ప అనారోగ్యం లేదు. అన్నంతో సమానం. దురద ఉంటది. చేపకువలె ముళ్ళు ఎక్కువ. చెట్ల సహాయంతో పైకి పెరుగుతది. పువ్వు పూస్తది. దుంప నాటవచ్చు. జూన్‌లో మొలకెత్తుతది.



**పాట:** 'ఒక్క తల్లి పిల్లవైతే కో – కోడలమ్మా – బొక్కలోని తట్టల వైములా'

**పిడిదుంప:** పర్వతభాగంలో అధికం. ఈ దుంప దుంపలకి రాజు. అందరు ఎక్కువగా ఇష్టపడతరు. కారణం దుంపలో పీచు ఉండదు. చిలకడదుంపలా ఉంటది. నాలుగుముక్కలు(బొంగలు) తింటె చాలు కడుపు నిండుతది. మంచి రుచి. కాల్చుకొని, వండుకొని తినవచ్చు. కాని, బొడ్డులోతు గుంట తవ్వాలి. గుంట మడిదీయాలి – కొంతవరకు గొయ్యి తవ్వి, తవ్వినమట్టి తీయుటకు చేయి అందని యెడల, ఒక మెట్టు తయారు చేయవలె. దానినే మడి అంటరు. దీన్ని నరికి, భూమిలోపల కత్తిరించి, కన్నిగెకి తీగెతలకి మధ్య కోసి, ఆ మధ్యలో ఆకులుపెట్టి మట్టికప్పిన భూమికి 5 అంగుళాలలో ఊరును.



పిల్లలు పెట్టుతది. దుంప చివరిభాగం బొడ్డు, తలభాగం ముచ్చె. విత్తునుండి ఉత్పత్తి. మొక్కల ఆకులు సన్నం. ఏప్రిల్‌లో మొలకెత్తుతది.

**పాట:** 'గరిసెడు మన్ను తోడవలె – గామెడు చిదుము ఏరవాలె'

**తేగదుంపచెట్టు:** అన్ని అడవులలో దొరకుతది. తీగెజాతి. చెట్లకొమ్మలమీద పెరుగుతది. ఏఫ్రియల్‌నెలలో మొలకెత్తుతది. పుంత (వేళ్ళ)నుండి దుంప ఊరుతది. తెలుపురంగు. బొచ్చు ఉంటది. వగరు హెచ్చు. సుమారు 1సంవత్సరంలో 5 కేజీలవరకు దుంపలు వచ్చుతవి. దుంపలు పొర్సుపొర్సున విరుగుతవి. కన్నెనెలలో పంటకి వచ్చుతది. కరువు సమయంలో ఆహారంగ తింటరు. మునుకోలు, కన్నెనెలలు కరువునెలలు. కొర్రకొత్త పండుగ ఈ తీగలతోపాటు గుమ్మడికూర, కాయలు, మొక్కజొన్నకాయలు కలిపి పండుగచేస్తరు. కొత్తపంటలు తవ్వి, కోసి తినుటకు ఈ పండుగ ముఖ్యం.



దుంపలు చాలా తీపి. కాల్చి వండి తినవచ్చు. కూరకూడ వండవచ్చు. ఉప్పు, కారం, మసాల, పసుపు వేసి వండవచ్చు. జనవరి, ఫిబ్రవరినెలలో ఈ దుంపలు చాలా రుచిగ ఉంటవి. మంటలో ఉడికించినవి చాలా రుచి. కాల్చి, కాలిన పైపొర గీసుకొని, తినాలి. వీటిని అడవిపందులు, నేదిపందులు తింటవి. గచ్చెలితో తవ్వి తీసుకొనవలె. బండరాయిమీద బాగా ఊరుతది. ఆరుఅంగుళాల భూమిలో ఊరుతది. భూమినుండి మట్టిని చీల్చుకొని ఎగబొడిచి ఉన్న దుంపలను గొడెగలు అంటరు. విత్తునుండి ఉత్పత్తి. జూన్‌లో

మొలకెత్తుతది. ఆకులు సన్నం. లేతచిడిగ అనగా చేనుచేసి విడిచిన భూములలో అధికం.

**చవిదెదుంప:** అడవిలో అన్నిచోట్ల ఉంటది. దుంప తెలుపు, భూమిలో లోతుగ ఉంటది. పిల్లలు పెట్టదు. ఒంటిదుంప. ఆకు దళసరి, నునుపు. ఒంటిఆకు, ఒకే తీగ. తీగకి ముళ్ళులేవు. కాయలు కాస్తది. కాడలలో అక్కడక్కడ బొచ్చు ఉంటది. కాయలు నాటితే మొక్కలువచ్చి దుంపలు పండుతవి. అనారోగ్యం ఏమీ లేదు. చెట్లలో తీగెలు పాకును. జూన్‌లో మొలకెత్తుతది. బందభూములలో ఎక్కువగా ఉంటది. కూర చేసి తినవచ్చు. బంగాళదుంపలు వండినట్లు వండి తినవచ్చు. దుంపలు తీపి, వంటికి కరుము. కరుము మనును నిప్పులో కాల్చి తినవచ్చు. డిశంబరు మొదలు మేవరకు తినవచ్చు.



**గింటుగుదుంపలు:** ముఖ్యంగా కాలువ ఉన్నచోట ఉంటది. నీటిలో ఇష్టం. తల్లికి పుట్టిన కన్నిగెలు అన్నీ దుంపలుగా మారుతవి. చెట్టు మొదలుకు 1మీటరు దూరంలో దుంపలు ఊరుతవి. ఆకులు సన్నం, తీగె కణుపుకణుపులో ముళ్ళు ఉంటవి. పచ్చిదుంప తెలుపు. కాల్చిన తర్వాత ఎరుపురంగు వస్తది. విత్తులునుండి, భూమినుండి వస్తది. దుంప నాటితే మొక్కవస్తది. చాలా తీపి, కాల్చి వండి తినవచ్చు. నష్టం ఏమీలేదు. ఆకలికి ఆహారం మాత్రమే. తీగెచెట్లకు ఎక్కి పెరుగుతది. పువ్వులు పూస్తది. తట్టలు వేస్తది. జూన్‌లో మొలకెత్తుతది.



**నారదుంప:** అన్నిచోట్ల ఉంటది. ఎర్రగచ్చునేల ఉన్న బంద(చెలక) భూములలో అధికంగా ఉంటది. దుంపనిండా పీచే. కడిగి కాల్చి తింటరు. అడవిపందులు అధికంగా తింటవి. నిప్పులో కాల్చిగాని, ఉడికించిగాని తినవలె. ఉడికిన తర్వాత కత్తితో ముక్కలుచేసి తినవలె. దుంప నమిలి, కంకి ఉమ్మి జల్లవలె. భూమిలో 1అంగుళం లోతులో ఊరుతది. దుంప ఒక మీటరుపొడవు ఉంటది. చెట్టుకు 10-15 దుంపలు ఉంటవి. కన్నిగెకొక దుంప ఊరుతది. జిగురు, ఉడికిన జిగ్గజిగ్గగ ఉంటది. చాలా రుచి. తీగెజాతి, తీగ కణుపులలో ముళ్ళు ఉంటవి. నరికి విడిచిన చేను చిడిగలలో అధికంగా ఉంటది. బాగా పెరుగుతది. పువ్వులు పూస్తవి. తీగెగాని, దుంపగాని ఉత్పత్తికి వీలులేదు. విత్తులద్వారా ఉత్పత్తి. ఒకదఫా చనిపోతే పాతస్థలంలో మరల పుట్టదు.



**పాట:** 'నారు దుంపల దొడ్డిలోన నడుమురాగ జల్లుకున్నరా'

**చేదదుంప:** చేదు ఉండుటవలన ఆపేరు వచ్చింది. దుంప నలుపు. పైన బొచ్చు ఉంటది. ఒకే ఆకు ఉంటది, ఒకే తీగ, పువ్వులు పూస్తవి. కాయలుద్వారా ఉత్పత్తి. ఒకచెట్టుకు ఒకటే దుంప. ఏప్రిల్‌లో మొక్క మొలుస్తది. తీగెకు ముళ్ళులేవు, ఆకులు నునుపు. అడవిపందులు, నేదిపందులు అధికంగా తింటవి. భూమికి మూడుఅంగుళాల లోతులో ఊరుతది. నీళ్లల్లో ఉడికించి, బద్దలుకొట్టి, పల్చటి జన్నెలుకోసి, బుట్టలలోపెట్టి, కాలువలో ఊరించితే, దానిలోని చేదుపోయి తియ్యబడతది అప్పుడు తింటరు. కాల్చుకొని తినవచ్చు, చేదు ఉంటది. తాత్కాలికంగా ఆకలి తగ్గించుకొనుటకు ఉపయోగపడుతది. కడుపులో ఉండు పురుగులకు మందు, అవి చనిపోతవి. కేన్సర్, గుండెమాదలు రావు.



**వెర్రిచేద:** అడవిలో ఉంటది. గ్రామములో కూడ పండించవచ్చు. తీగె తెలుపు. తీగె బుడిపెలలో ముళ్ళు ఉంటవి. తవ్వి చంద కోసి, ఆ చంద ఉడికించి, పారుతున్న కాలువకి అడ్డంగ ఉదయంపెట్టి సాయంత్రం తీసుకొనవలెను- చేదు, వగరు పోతది. చేదు పూర్తిగ పోతది. గుండెజబ్బులు(గుండెమాదలు), కేన్సరు, కురుపులు, నులిపురుగులు నాశనం అగుతవి. యధాతధంగా కాల్చి తింటే పేగులు ముక్కలు అవుతవి అంటరు. భరించలేని విషం, చేదు మింగలేం. నీటిలో బద్దలు ఊరబెట్టుకొని తింటే ఏ ఇబ్బంది ఉండదు, ప్రాణహాని ఏమీలేదు.



దీనిని కల్లుదొంగలకి కల్లుఒగ్గులో గుండకట్టి వేస్తారు. త్రాగినప్పుడు 3గ్లాసులు త్రాగితే పగలంత పడి ఉంటరు. ప్రాణంపోదు. కల్లు దక్కనీయకుండా ఆ పని చేస్తరు. ఎవరు దొంగతనం చేసింది తెలిసిపోతది. పచ్చిదుంప కుళ్ళగొట్టి కల్లుఒగ్గులో కల్పినప్పుడు మాత్రమే నిషా పట్టును. వెర్రి ఎత్తుతది. ఉడికించినది ఉండదు. పచ్చిది తిన్నవాడు వెర్రిగ కళ్ళు తెరవకుండా ఉంటడు, కావున వెర్రిచేద అంటరు. తాత్కాలికంగా టిఫిన్‌లాగున తింటరు. నేదులు, అడవిపందులు అధికంగా తింటవి. పెద్దఆకు, పూవులు పూస్తది. అన్నిచోట్ల విచ్చలవిడిగ దొరకుతది. దీనిని పెంచుతరు.

**నూలెదుంప:** పర్వతంలో, కొండకోరెంలలో ఉంటది. ప్లాస్టిక్‌గుడ్డ నూలువలె ఉంటది. కాల్చితింటె, తీయగ ఉంటవి. నమిలితే పీచు నోటిలో ఉంటది. ఊట మింగి, కంకి ఉమ్మి జల్లవలె. మంచి రుచి. అడవికి వెళ్ళినప్పుడు, ఆకలికి తాత్కాలికంగా టిఫిన్‌లాగున అక్కడే తవ్వుకొని నిప్పులో కాల్చి తింటరు. నూలు ఆకారంలో నూలుదుంపనుండి

వచ్చుటచేత ఆ పేరు. ఒంటితీగె, చిన్నఆకు, తేగ ఆకురూపాలలో ఉంటది. 1, 2 దుంపలు ఊరుతది. దుంప నలుపు.

**పాట:** 'నులుపులది నూలిగడ్డ – వలపుతోడి వంగదీద్ద రా'

**చారి/చేమదుంప:** పెద్దఆకులు ఉంటవి. భూమిలో ఊరుతవి, చిదరిగ ఉంటవి. దుంపలు నూగు, దురద. జూన్‌లో పాతి, డిశంబరులో తవ్వి తీస్తరు. కొమ్ములు, పిలకలు పెచ్చు. ఒక దుంపకుదురు రెండుకేజీలవరకు ఊరుతది. దుంపలు తవ్వి ఉడికించి పైతొక్కతీసి చింతపులుపు, కారం, ఉప్పు, కందిపప్పు, పెసరపప్పు కలిపి వండి తింటరు. పైత్యం తగ్గుతది. ఒంటికి బలం. రకాలు – విరిచారి, గురిడెచారి, తియ్యచారి, రామచారి.

**పిరిచారి:** పిల్లలు ఎక్కువ పెట్టుతది. కొమ్ములు – దుంపనుండి వచ్చే పిలకలు. మంచి రుచి. దుంపమీద దూదివంటి మెత్తటి పొరలు ఉంటవి. పిరిలాగ పొరలు వస్తవి. దీని ఆకులు, దుంపలు, నల్కలు అన్ని కందిపప్పులో వేసి కూర వండుకోవచ్చు. బిదరి ఎక్కువ. దురద ఉంటది.

**గురిడెచారి:** ఇది ఒకే దుంప. పైపొరమీద ఎర్రటి గీతలు ఉంటవి. దురద ఉంటది. పిలకలు తక్కువ ఉంటవి.

**తియ్యచారి:** గురిడెచారిని పోలి ఉంటది. చాలా అరుదు. కాల్చుకుని తినవచ్చు. దురద ఉండదు. దుంప చంటిపిల్ల తొడలావు ఉంటది.

**రామచారి:** పాలచారి అనికూడ అంటరు. ఆకులు నులుపు. పాలు ఉంటవి. తియ్యగ ఉంటది. కాల్చుకుని లేక కూర వండుకుని తినవచ్చు. పసిపిల్లల తల్లులకు పాలుకొరకు వాడుతరు. మే, జూన్‌నెలలో నాటాలి.

**రెండవ పద్ధతి:** దుంపఆకులు దసరానెలలో తింటరు. ముదిరిన చారిఆకులు కోసి అది ముక్కలుగ తరిగి చింతపండు, ఉప్పు, కారం, ఎండురొయ్యలు వేసి వండాలి, నూనెలో తాలింపు పెట్టి తింటరు. నిమ్మపులుపు శ్రేష్ఠం. బాగా మగ్గి ఉడికిన కూరలో నిమ్మకాయలు పులుపు పిండాలి. ఒక తెల్లు(ర్లు) తెర్లనివ్వాలి. ఈకూర చాలా చలవ. ఒంటికి చల్లదనం. దాహం వేయదు. చెట్టునుండి కోసి 3, 4 దినములులో వాడినాక. 4వ రోజున వండాలి. మంచి రుచి. కూరలో కందిపప్పు, పెసరపప్పు కలిపి వండి తినవచ్చు. రుచులు కావాలంటే ధనియాలు, మసాలసామాన్లు, ఉల్లి, నూనె, కారం, ఉప్పు కలిపి వండి తినవచ్చు. దురద పోవుటకు పులుపు అధికంగా వాడవలెను. నాటిన చారికూర మాత్రమే. అడవిలో ఉండు దబ్బచారి. కాలువ ఒడ్డులో ఉండు ఊబుసారికూర. పట్నంలో మురికికాలువలవద్ద ఉంటది, పొలంలో ఉంటది. ఎంతైనా, ముఖంమొత్తేవరకు తినవచ్చు. పులుపు తప్పకూడదు.

**పిడెం – కొమ్ము – వెదురుకొమ్ము:** పిడెం అనగా వెదురు. కొండవెదురు, ముల్సవెదురు, జారెవెదురు, ఒడవెదురు, గంగవెదురు.



1. కొండవెదురు – కన్నులు దూరంగా ఒక మూర పొడవు ఉంటవి.
2. జారెవెదురు – కన్నులు చాలపొడవు.
3. ఒడవెదురు – కన్నులు మూరపొడవు. వెదురు లోపలకన్నం పెద్దది. పొగగొట్టంవలె వాడతరు.
4. ములసవెదురు – ముల్లు ఉంటది.
5. గంగవెదురు – తెలుపుగా ఉంటది.

సాలెగూళ్ళు, పెద్దకన్నాలు వెదురులో ఉంటవి. కొండవెదురు, జారెవెదురు కొమ్ములు తింటరు. వెదురుపిడెం కొమ్ములు ఆగస్టు నెలలో వస్తవి. దుంపకొమ్ములు అనగా ఒకమూర ఎత్తు పిడెం పుంతలు వచ్చివున్నవి. కత్తితో కోసి తీసి పైనఉన్న తొప్పికెలు తీస్తరు. ఊసికత్తితో పల్చగ చందలు తరుగుతరు. తరిగిన చందకొమ్ములు నీటిలోవేసి తపాల, కుండలోగాని వేసి, ఏక తాటిగ మంటపెట్టాలి. 3 గంటలవరకు ఉడికించాలి. తర్వాత దింపాలి. అందులోఉన్న నీరు వంచి పారబోయాలి. చందకొమ్ములను నీరులేకుండా పిండాలి. కందిపప్పు ఉడికించాలి. ఆ పప్పులో ఈ కొమ్ములు వేసి కలపాలి. ఈ రెంటిని కలిపి ఉడికించాలి. ఉప్పు, కారం, ఉల్లి వేసి తాలింపు. అన్నంతో కూర కలిపి తినాలి. యమ రుచి.

**పాట:** 'పిడెముచాటు పిట్టవేట – పిట్టకు వేసో చిన్నయతమ్మ
విల్లులాగి చూసిగూడ – మిట్టవేసి దెబ్బ తీతువా'

*(తరువాయి వచ్చే సంచికలో...)*

**రచయిత ఫోన్లు : 08864244873, 8500935424**

-డాక్టర్ సామల రమేష్‌బాబు

# కథానికకు విశ్వవిఖ్యాతి తెచ్చిన పాలగుమ్మి

**ఆంధ్ర** భారతి, ప్రబుద్ధాంధ్ర లాంటి పత్రికలతోబాటు భారతి, ఆంధ్ర పత్రిక కూడా కథానికకు చక్కటి ఊతమిచ్చాయి. భారతి మాసపత్రిక తృతీయశ్రేణి కథానికల్ని కాకుండా రచయితల నుంచి ప్రథమ, ద్వితీయ శ్రేణి కథానికలు వచ్చేలా చూడాలనే సంకల్పంతో నెల నెలా కథానికల పోటీని పెట్టింది. కానీ అన్నీ తృతీయశ్రేణి కథానికలే రావడంతో 1947లో ఒక నెలతోనే ఆ పోటీని విరమించుకొంది కూడా.

ఒక్కసారి కొత్త కెరటంలా పైకి లేచిన కథానిక క్రిందకి దిగింది. కథానికలోనే కాదు ఆంధ్ర సాహిత్యంలోనే స్తబ్ధత ఏర్పడింది. అటువంటి సందర్భంలో 1952 ఆంధ్రపత్రిక ఉగాది సంచికలో ఓ వార్త వెలువడింది.

"ఆంధ్ర సాహిత్యం స్తబ్ధస్థితిలో ఉందని నిస్పృహ చెందేవారికి ఈ సంవత్సరం తెలుగు కథానిక ప్రపంచ బహుమతిని అందుకుందన్న విషయము, మన సాహిత్యం ప్రగతి ముఖంగానే ప్రపంచంతోబాటు పురోగమిస్తోందని ఉత్సాహం కలిగించక తప్పదు. మన తెలుగు కథానికలు ప్రపంచ కథానికలకు తీసిపోవన్న విషయంతో, విశ్వాసంతో ఆంధ్రపత్రిక ప్రపంచ కథానికల పోటీలో పాల్గొడానికి తెలుగు కథకులను ఆహ్వానించింది. మా ఆశయానికనుగుణంగా పాలగుమ్మి పద్మరాజుగారి 'గాలివాన' ప్రపంచ గౌరవాన్నందుకోవడం మాకు, తెలుగులో సాహితీపరులకు గౌరవ కారణమైంది. పద్మరాజుగారికి అభినందనలు'. ఈ వార్త అందర్నీ ఆనందంలో ముంచెత్తింది. 1951లో న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ ప్రపంచ స్థాయిలో కథానికల పోటీని నిర్వహించాలని మొదటిసారిగా తలపెట్టింది. భారతదేశం తరపున ఈ పోటీని హిందూస్థాన్ టైమ్స్ పత్రిక నిర్వహించింది. మన రాష్ట్రం తరపున ఆంధ్రపత్రిక ఈ బాధ్యతని నిర్వహించింది. ఆంధ్రపత్రిక తెలుగు నుంచి నాలుగు కథానికల్ని ఎంపిక చేసి, హిందూస్థాన్ టైమ్స్ పత్రికకు పంపించింది. ఇలా మనదేశంలోని అన్ని రాష్ట్రాలనుంచి నాల్గేసి కథానికల్ని ఎంపిక చేసి, జాతీయ స్థాయి పోటీకి పంపారు. హిందూస్థాన్ టైమ్స్ పత్రిక జాతీయస్థాయిలో రెండు కథానికల్ని ఎంపిక చేసి, న్యూయార్క్ హెరాల్డ్ ట్రిబ్యూన్ పత్రికకు పంపించింది. వాటిలో 'గాలివాన' ఉండడం విశేషం. ఈ పోటీలో 23 దేశాలు పాల్గొన్నాయి. చివరివరకు 59 కథానికలు నిలిచాయి. ఈ పోటీని నిర్వహించిన అమెరికా పాల్గొనకూడదని, ఏ దేశం కూడా తమ దేశానికి సంబంధించిన కథానికకు ఓటు వేయకూడదని నిర్ణయించుకుంది. దాంతో 4 దేశాల కథానికలకు రెండేసి ఓట్లు వచ్చాయి. 14 దేశాల కథానికలకు ఒక్కో ఓటు వచ్చింది. 'గాలివాన' కథానికకు ఆస్ట్రియా ఓటు వేసింది.

ఏ ఒక్క కథానికకు ఉత్తమ బహుమతి రాకపోవడంతో రెండేసి ఓట్లు వచ్చిన నలుగురికి ఆ బహుమతిని సమంగా పంచారు. ఒక్కో ఓటు వచ్చిన 14 దేశాల కథానికల నుంచి రెండవ బహుమతిని ఎంపిక చేయడానికి ఇద్దరు న్యాయనిర్ణేతల సహకారం తీసుకున్నారు. వాళ్లు పద్మరాజుగారి 'గాలివాన'ను ద్వితీయ బహుమతికి ఎంపిక చేశారు.

ఈ సందర్భంగా భారతి మాసపత్రికలో ఓ వ్యాసాన్ని రాస్తూ 'రవీంద్రనాథ్ ఠాగూర్ తర్వాత మన భారతీయ సాహిత్యం ప్రపంచ పోటీలో బహుమతి పొందడం ఇదే రెండవసారి! మన తెలుగు కథానిక భారతీయ భాషల్లోనే కాదు, ప్రపంచ భాషల్లో కూడా గౌరవాన్ని సంపాదించింది' అని ప్రకటించింది. యాదృచ్ఛికం ఏమిటంటే కథానికకు ఆద్యులైన గురజాడ అప్పారావుగారు 1915లో ఈ లోకం నుంచి నిష్క్రమిస్తే, పాలగుమ్మి పద్మరాజుగారు అదే సంవత్సరంలో జన్మించి, తెలుగు కథానికకి అంతర్జాతీయ స్థాయిలో గుర్తింపు లభించేలా చేశారు.

బెనారస్‌లో కెమిస్ట్రీలో ఎమ్మెస్సీ చేసేటప్పుడు పాశ్చాత్య సాహిత్యంలో మంచి పట్టు దొరికింది. 1937లో 'సుబ్బి' అనే కథానికని మొదటి కథానికగా రాశారు. కథానిక, నవల, వ్యాసం, విమర్శ కవిత్వాలలో పట్టుంది. ఆకాశవాణి జాతీయ నాటక పోటీలలో కూడా బహుమతి పొందారు. 1983 ఫిబ్రవరిలో ఆకాశవాణి పోటీ (న్యూఢిల్లీ)లకు న్యాయనిర్ణేతగా వెళ్లి, 17వ తేదీన హఠాత్తుగా గుండెపోటుతో మరణించారు. మరణానంతరం 1985లో గాలివాన కథానికా సంపుటికి కేంద్ర సాహిత్య అకాడమీ అవార్డు వచ్చింది.

పాలగుమ్మి పద్మరాజుగారి గాలివానకు అంతర్జాతీయ బహుమతి వచ్చేవ్పటికి ఆయన వయస్సు 36 సంవత్సరాలే! అప్పుడాయన భీమవరం కళాశాలలో కెమిస్ట్రీ లెక్చరర్‌గా పనిచేస్తున్నారు. తర్వాత చెన్నైకి మకాం మార్చి ఎన్నో చలన చిత్రాలకు రచనా సహకారాన్నందించారు. అనువాదాలూ చేశారు. రక్తకన్నీరు నాటకాన్ని తెలుగులోకి అనువదించినవారూ ఆయనే!

మిగతా ఎంత సాహిత్య కృషి చేసినా ఆయనకు, తెలుగు కథానికకు కూడాగాలివాన మంచి పేరు తెచ్చిందన్న సంగతిని ప్రత్యేకంగా చెప్పుకోవాలి.

గాలివాన కథానికలో రావు మనస్తత్వమూ, ముష్టెత్తుకునే మనిషి మనస్తత్వమూ చాలా సునిశితంగా ధ్వనిస్తాయి. రావు ఒక సూత్రబద్ధంగా నడిచేవ్యక్తి. గాలివానలో ఆ బాహ్య సూత్రాలన్నీ పటాపంచలయ్యాయి. ఈ కథానికలో శిల్పము, సంఘటన, భావము పోటీపడతాయి. సమన్వయంతో చివరిదాకా నడుస్తాయి. ప్రకృతి వికృతి రూపంతో మానవ కృత్రిమ ధోరణిని దెబ్బతీసి మానవత్వానికి పట్టం కడతారు. ఈ కథానికలో వాతావరణం, మనస్తత్వాల బంధాన్ని గొప్పగా చెప్పారు. 'వాతావరణం భయపెడుతోంది..' అంటూ ప్రారంభిస్తారు 'గాలివాన' కథానికని.

రావుగారికి కొన్ని ఖచ్చితమైన అభిప్రాయాలున్నాయి. అవి గాలివానలో ఎలా క్రమంగా కొట్టుకుపోయాయో కథానిక ప్రారంభంనుంచి చాలా వ్యంగ్యంగా చెబుతారు.

ఆస్తిక సమాజంవారు ఏర్పాటు చేసిన సభలో పాల్గొనడానికి ఆ రోజు రైల్లో బయల్దేరతారు రావుగారు. గాలి నిరంతరంగా కిటికీ

అద్దాలమీద మొత్తుతోంది. ఉన్నట్టుండి మూడు గంటలకి చీకటి పడినట్లు మారిపోయింది వాతావరణం.

గాలి పిచ్చిగా అరుస్తోంది. జల్లు ప్రారంభమై గాలివానగా మారింది. వాన జోరు హెచ్చింది. గాలిహోరులో రైలు మోత మరుగున పడిపోయింది. గాలి, వాన ఒక్కుమ్మడిగా రైలు పెట్టెమీద దాడి చేయసాగాయి.

రైలుపెట్టె తలుపు తెరిచేసరికి వానతోబాటు సగం చిరిగిన తడిబట్టలతో ఓ ముష్టిది లోపలికి వచ్చి, రైలు తలుపేసింది. తడి గుడ్డల్ని పిండుకుంటూనే ఓ మూల నిల్చుంది. పేదవాళ్ళంటే రావుకి జాలే. కాని బిచ్చమెత్తుకోవడం ఆయన సిద్ధాంతానికి విరుద్ధం. ఆమె తన వైపు వస్తుంటే 'పో'... అంటూ కసిరాడు.

గాలివాన జోరు పెరిగింది. రావు దిగాల్సిన స్టేషన్ దగ్గరికొచ్చేస్తోంది. ఆమెకి ఆ పెట్టెలో ఉన్నవారందరూ ఎంతో కొంతిస్తారు రావు తప్ప!

రైలాగింది. పెట్టె తలుపు తీసేసరికి గాలి వాన రావుని, ఆయన గొడుగునీ కూడా ఎగురగొట్టబోయింది. అంత గాలివానలో నడవడమే కష్టంగా వున్న ఆయనకి సామాన్లు బండిలోంచి దింపి సాయం చేస్తానంటుంది ముష్టిది. ఆయన అభ్యంతరం చెప్పకపోవడంతో ఆమె సామాన్లని వెయింటింగ్ రూమ్‌కి చేరుస్తుంది. అక్కడికి ఆయన జాలి తలచి కొంత డబ్బివ్వాలనుకుంటాడు. కానీ తీసుకోకుండా వెళ్లిపోతుంది. విసిరేస్తున్న గాలిలో నిలబడడమే కష్టమౌతుంటుంది, బ్యాటరీ లైట్‌సాయంతో బ్యాగ్‌లోనుంచి పొడిగుడ్డలు తీసి మార్చుకుంటాడు. స్టేషన్ మాస్టారు, పోర్టర్ మాత్రమే అక్కడ కనిపిస్తారు. 'ఊళ్ళోకి వెళ్ళడం ఎలా' అని వాళ్ళనడుగుతాడు. 'ఇప్పుడు లాభం లేదు'. ప్రతీ అడుగుకీ చెట్టు, ఎలక్ట్రిక్ స్తంభాలు, టెలీఫోన్ స్తంభాలు పడిపోయాయి. గాలివాన ఇంకా బాగా పెరుగుతుందని వార్తలు వస్తున్నాయి. ఈ రాత్రికి వెయిటింగ్ రూమ్‌లో ఉండడమే మంచిది' అని వాళ్ళు వెళ్లిపోతారు.

గాలివాన ఉధృతంగా ఉంది. వెయిటింగ్‌రూం తడిసిపోతోంది. ఇంతలో ఏదోనీడ కదులుతున్నట్లనిపిస్తుంది. ఒంటరిగా వున్న రావుకి, బ్యాటరీలైట్ వేసి చూస్తే ముష్టిది. గాలి పిచ్చిబలంతో మూసిన తలుపుల్ని కొడుతోంది. రావు తన పొడి లుంగీని ఆమె మీదకు విసిరేశాడు. ఆమె దాన్ని చుట్టుకుని తడి చీర తీసేసింది. ఆమె అంటే రావుకి చిరాకు కలగడంలేదు. ఆ గాలివానలో తోడు దొరికినందుకు ధైర్యంగా అనిపించింది. తన బ్యాగ్‌లోని బిస్కెట్లు తను కొన్ని తిని ఆమెకు కొన్నిచ్చాడు.

ఇంతలో గాలివానకు తలుపు విరిగిపడింది. భయంతో ముష్టిదాన్ని పట్టుకున్నాడు రావు. ఆమె భయం లేదన్నట్లుతన ఒడిలోకి లాక్కుని మరోమూలకి వెళ్లింది. ఆమె తప్ప తనకు దిక్కులేనట్లు పట్టుకున్న రావు ఏదో కాని పని చేసినట్లు వెంటనే వదిలేసాడు. ఆమె మాత్రం అతడినింకా దగ్గరకు లాక్కుంది– గాలివాన తగలకుండా, అతి సహజంగా, ఏమాత్రం సంకోచం లేకుండా! ఆ సమయంలో రావుకి గుర్తున్నదల్లా ఆమె వెచ్చటి స్పర్శే. ఆమెకు ఊపిరి సలపనంత బలంగా హత్తుకున్నాడు మగతగా! ఆయనకి తెలివి వచ్చేసిరికి గాలి వాన తగ్గింది గాని ఆమె కనిపించలేదు.

జేబులో పర్స్‌లేదు. శిథిలాలకింద ఓ ఆకారం కదలకుండా వుంది. ఆ ముష్టామె ఒక చేతిలో నోట్లు చిల్లర కనిపించాయి. బహుశా వీటిని టికెట్ కలెక్టర్ జేబులోంచి తీసుంటుందా ముష్టామె అనిపించిందతనికి. రెండో చేతిలో తన పర్స్‌ని గమనించాడు. ఆ నోట్లు చిల్లర తీసుకొని టికెట్ కలెక్టర్ జేబులో వేశాడు. ఆమె రెండో చేతిలోని తన పర్స్‌ను తీసుకోవాలనిపించలేదు. కాకపోతే దాంట్లోవున్న తన కార్డ్‌ని తీసివేశాడు. గాలివాన తగ్గింది. తెలతెలవారుతోంది...అనడం – తిరిగి ఎవరి వేషాల్లోకి వాళ్లు వెళ్లిపోయారని అర్థం స్ఫురిస్తుంది.

ఆడ, మగ – గాలివాననేసరికి సాధారణంగా వచ్చే ఆలోచనలకు భిన్నమైన ఆలోచనలు, చలితో ఒత్తుకుపోయే వణికిపోయే అతడికి వెచ్చదనమిచ్చి బతికించడానికి ఒళ్ళోకిలాక్కుంటుంది తల్లిలా! రావుకీ ఆ అభిప్రాయం రాకుండా ఆయన కూతుళ్ళని, తన కుటుంబ ప్రసక్తిని కూడా తీసుకొస్తుంది బిచ్చగత్తె. భయంకరమైన వాతావరణంలో మానవుడు బహిర్గతంగా నిర్మించుకున్న సూత్రాలు చిన్నాభిన్నమై మానవత్వం దగ్గరకు చేరుస్తుంది. చివరికి నిలబడాల్సింది మనిషికి మనిషే! రియలిజమ్... మనిషి పరిస్థితులకనుగుణంగా ఎలా మారతాడో చెప్పిన గొప్ప కథానిక.

అంతకుముందు వచ్చిన ఏ కథానికా దీనికి స్ఫూర్తికాదు. అలాగైవుంటే అంతర్జాతీయ పోటీలో గెలిచినప్పుడే గోల అయ్యేది. ఇప్పుడు కొందరు అనవసర చర్చలు తెస్తున్నారు. దీనికి ఆయన జీవితంలో జరిగిన సంఘటన ఆధారమని ఆయనే చెప్పుకున్నారు. 1948 సంవత్సరంలో ఓ రాత్రి గాలివానకు ఉన్న ఇల్లు కూలి, శిథిలాలక్రింద ఆయన భార్య నాలుగ్గంటలుండిపోయింది.

అంతర్జాతీయ బహుమతి 800 డాలర్లు పంపుతూ హిందూస్థాన్ టైమ్స్ పత్రిక రాసిన ఉత్తరంలో...'The success of the story in the world is an achievement of which the whole country can be proud'.... ఆంధ్రపత్రిక తెలుగు కథానికకి అంతర్జాతీయ ఖ్యాతి తెచ్చారని పొగుడుతూ పాలగుమ్మి పద్మరాజుగారికి ఉత్తరం రాశారు. ఆయన సాధించిన విజయానికి అభినందన సభ నిర్వహించడానికి మీకు అనుకూలమైన తేదీని తెలుపమని ఆ ఉత్తరంలో అడిగారు.

మరో సంగతి– ఓ విదేశీ ప్రచురణ సంస్థ భారతీయ గ్రామీణ జీవితాన్ని ప్రతిబింబింపజేసే 13 కథానికలతో –మీ సంపాదకత్వంలో ఓ సంకలనాన్ని తెమ్మని పోలెండ్‌లో ఉన్న భారతీయ రాయబారి కె. నట్వర్‌సింగ్‌ని కోరింది. ఆయన చేసిన సంకలనంలో మొదటి కథానిక రవీంద్రనాథ్ ఠాగూర్‌దైతే, ఆఖరి కథానిక పాలగుమ్మి పద్మరాజుది. అది 'పడవ ప్రయాణం' (ఆన్ ది బోట్). జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో కూడా ఆయన ప్రయత్నాలు లేకపోతే 'తెలుగు' కన్పించేది కాదేమో! ఇదీ ఆయన సాహిత్యానికి తెలుగు భాషకి చేసిన సేవ.

దేశభాషలందే కాదు, ప్రపంచభాషల్లో కూడా తెలుగు మిన్న అని నిరూపించిన పద్మరాజుగారి శతజయంతి ప్రభుత్వానికి గుర్తుకూడా లేకపోవడం వింతగా లేదూ?

***ఆంధ్రభూమిదినపత్రిక (23-6-2015) సౌజన్యంతో...***

తెలుగు రాష్ట్రాల ప్రభుత్వాలు పట్టించుకోకపోయినా ప్రజలే నిర్వాహకులుగా విజయవంతమైన

# పాలగుమ్మి పద్మరాజు శతజయంతుత్సవాలు



**తె**లుగు భాషకు, సాహిత్యానికే కాదు - భారతీయ సాహిత్యానికే అంతర్జాతీయ పోటీల్లో బహుమతి తెచ్చిన వారిలో రెండవ వ్యక్తి పాలగుమ్మి పద్మరాజు ('గాలివాన' కథానిక) మొదటి వ్యక్తి బెంగాల్‌కి చెందిన రవీంద్రనాథ్ ఠాగూర్... పోలెండ్‌లోని భారత రాయబారి కె. నట్వర్‌సింగ్‌ని ఓ అంతర్జాతీయ ప్రచురణ సంస్థ భారతదేశ గ్రామీణ వాతావరణాన్ని ప్రతిబింబింపజేసే 13 కథానికలతో ఓ సంకలనాన్ని తెమ్మంది. ఆ సంకలనంలో ముందు కథానిక రవీంద్రనాథ్ ఠాగూర్‌దైతే ఆఖరి కథానిక పాలగుమ్మి పద్మరాజు కథానిక పడవ ప్రయాణం (ఆన్‌దిబోట్). ఇలా జాతీయ అంతర్జాతీయ స్థాయిలలో తెలుగు కథానికకు స్థానం కల్పించిన రచయితేకాదు, రవీంద్రనాథ్ ఠాగూర్ సరసన నిలవగలిగిన రచయిత. తెలుగు రాష్ట్రాలు ఆ అంతర్జాతీయ తెలుగు కథకుణ్ణి పట్టించుకోకపోయినా తెలుగు రథం, శ్రీ వేదగిరి కమ్యూనికేషన్స్ సంస్థలు 2014 జూన్ 24న హైదరాబాద్‌లో పద్మరాజు గారి శతజయంతిని ప్రారంభించి రెండు తెలుగు రాష్ట్రాలలోనేకాకుండా చెన్నై, బెంగుళూరు, ఢిల్లీ నగరాలలో కూడా స్థానిక సాహిత్యసంస్థల సహకారంతోమొత్తం 28 ప్రదేశాలలో జరిగింది. రాజమండ్రి, విశాఖపట్నం, గజపతినగరం, పార్వతీపురం, విజయవాడ, గుంటూరు, తెనాలి, నరసారావుపేట, ఏలూరు, భీమవరం, కాకినాడ, మహబూబ్‌నగర్, కర్నూలు, అనంతపురం మున్నగుచోట్ల శతజయంతి సభలను జరిపి ముగింపు సభను ఈ జూన్ 24న త్యాగరాయ గానసభ ప్రధానమందిరంలో నిర్వహించడం జరిగింది.

ఈ కార్యక్రమానికి ముఖ్య అతిథిగా సిక్కిం మాజీ గవర్నర్ శ్రీ వి.రామారావు విచ్చేసి బంగారుపాప శతజయంతి సంచికను ఆవిష్కరించారు. ప్రత్యేక ఆహ్వానితులుగా మాజీ ఛీఫ్ సెక్రటరీ శ్రీ మోహన్ కందా విచ్చేసి అంతర్జాతీయ కథకుడు పాలగుమ్మి గ్రంథాన్ని ఆవిష్కరించారు. ఈ రెండు పుస్తకాలకు సంపాదకులు డా॥ వేదగిరి రాంబాబు. ముగింపు కార్యక్రమాన్ని ప్రారంభిస్తూ ప్రముఖ రచయిత పరిశోధకులు డా॥ పోరంకి దక్షిణామూర్తి 'పాలగుమ్మి పద్మరాజు గొప్ప కథానిక రచయిత, సమాజాన్ని మనం చూడని కోణాలలో చూసి, తన రచనల ద్వారా ఆవిష్కరించారన్నారు'.

ఈ సందర్భంలో విడుదలైన రెండు గ్రంథాల్ని ప్రముఖ రచయితలు విహారి, డా॥ వాసా ప్రభావతి సభకి పరిచయం చేశారు. ఆకాశవాణి నాటికా నాటక రచనలలో పాలగుమ్మి ప్రత్యేకతల్ని మాజీ ఆకాశవాణి సంచాలకులు డా॥ కె.వి.గోపాలం వివరించారు. చలనచిత్ర సేవల్ని ప్రముఖ చిత్ర దర్శకులు రేలంగి నరసింహారావు వివరించారు. 'సాహిత్యాన్ని సాహితీ వేత్తల్ని గౌరవించలేని పరిస్థితులు ఎంతో దురదృష్టం అన్నారు. డా॥ వేదగిరి రాంబాబు, కొంపెలశర్మ సభని నిర్వహించారు. ఈ సభలో పాలగుమ్మి పద్మరాజుగారి కుమార్తెలు సీత, రత్న పాల్గొని తండ్రి వ్యక్తిత్వం, ప్రత్యేకతల్ని మననం చేసుకున్నారు.

# 'అమ్మనుడి' నిర్వహణలో తెనాలి సభ



తెనాలి ఇస్కస్ కార్యాలయంలో జూన్ 24వ తేదీన జరిగిన పాలగుమ్మి పద్మరాజు శతజయంతి ముగింపు సభకు అమ్మనుడి ప్రచురణకర్త డా॥ సామల లక్ష్మణబాబు అధ్యక్షత వహించారు. ముఖ్యఅతిథిగా ప్రముఖ వైద్యులు, రచయిత డా॥ పాటిబండ్ల దక్షిణామూర్తి పాల్గొన్నారు. ముఖ్యవక్తగా తెలుగు భాషోద్యమ సమాఖ్య కోశాధికారి డా॥ వెన్నిసెట్టి సింగారావు పాల్గొన్నారు. శ్రీ యుతులు యర్రంశెట్టి హనుమంతరావు, డి. ఎల్. కాంతారావు, యం. వి. రఘునాథరావు, గోలి ఆంజనేయులు, ముత్తేవి రవీంద్రనాథ్, వెంకట్రామరాజు, బొల్లిముంత కృష్ణ తదితరులు మాట్లాడారు.

## పుస్తక సమీక్షలు

# మూర్ఖత్వాన్ని ప్రశ్నించే 'ధిక్కార స్వరాలు'




దేశమంతా బాబాలు, స్వాములు, అమ్మలు. వారి కటాక్ష వీక్షణాలకోసం పాకులాడే భక్తులు. దొంగస్వాముల గూర్చి, వారి మోసాలగూర్చి ఎన్నో పచ్చినిజాలు బయటపడినా ప్రజల్లో మాత్రం మూర్ఖత్వం పోదు. కర్మ సిద్ధాంతాన్ని పట్టుకు వేలాడే భారతదేశప్రజల్లో మూఢభక్తి, అజ్ఞానం ఎక్కువే.

మానవుడు తనలోని శక్తులను గుర్తించకుండా బాబాదయ అని, అమ్మకరుణ అని నిష్క్రియాపరులుగా తయారవడం చూసి సహించలేని కొంతమంది హేతువాదులు ప్రజలను జాగ్రుతులను చేయాలని సంకల్పించారు. బూటకపు స్వాములు చేసే మాయల గురించి బట్టబయలు చేసారు. స్వామివారి భక్తులు ఇలా చేసినందుకు నానావిధాలుగా హింసించారు. ఐనా వారి కార్యక్రమాలకు విరామచిహ్నం పెట్టలేదు.

అలాంటి 20 మంది హేతువాద ఉద్యమ కారులగురించి శ్రీ గౌరవ్‌గారు రచించిన పుస్తకం ధిక్కార స్వరాలు. దీనిలో నాస్తిక వ్యంగ్య రచయిత డి.ఆర్.ఇంద్ర, శతాధిక గ్రంథకర్త డా॥ మలయశ్రీ, శాస్త్రీయ రచయిత పసల భీమన్న, నాస్తికోద్యమ నాయకులు రావిపూడి వేంకటాద్రి, సి.వరహాల్రావు (సి.వి) జయగోపాల్, క్రాంతికార్, కెమేరా విజయకుమార్, రావెల సోమయ్య, డా॥ విజయం, ఇసనాక మురళీధర్‌గారి జీవన రేఖా చిత్రాలు ఉన్నాయి. ఇరవై మందిలో ముగ్గురు మాత్రమే మహిళలు వుండడం పురుషాధిక్య ధోరణిని ప్రతిబింబిస్తుంది. వీరందరినీ ఎన్నో కష్టనష్టాలకోర్చి, ఇంటర్వ్యూలు చేసి ఎన్నో ఆసక్తికర విషయాలను ఈ పుస్తకంలో మనకందించారు.

ఒకప్పుడు భారతదేశపటంలో దూబగుంట పేరు మారు మోగిపోయింది. ఒక మామూలు స్త్రీ తన గ్రామంలో ఆరోగ్యం కోసం సారా నిషేధ ఉద్యమం ప్రారంభించి ప్రభుత్వాన్ని పెట్టుబడిదారులను ముచ్చెమటలు పట్టించింది. చివరికి వారి గ్రామంలో ఒక్కసారా కొట్టుకూడా లేకుండా మూయించిన వివరాలు చదువుతుంటే ఒళ్ళు గగుర్పొడుస్తుంది. ఈనాడు ఆవిడ వృద్ధాప్యంలో బాధపడుతూ, ప్రభుత్వ సహాయమేమీలేకుండా ఒంటరి పక్షిలా బ్రతకడం చూస్తే మన వ్యవస్థపట్ల ఆగ్రహం కలుగుతుంది.

ఈనాడు కొందరు బీదలకు ఏదో దానం చేస్తున్నట్లు మీడియాలో, పేపర్లో ఫోటోలు వేయించుకొని ప్రచారం చేసుకోవడం చూస్తున్నాం. ఈ ఇరవైమంది ఉద్యమకారులు ఏ కీర్తిచాపల్యానికి లొంగకుండా తాము నమ్ముకొన్న సిద్ధాంతంకోసం ప్రజల్లో చైతన్యంకోసం ప్రతిఫలాపేక్ష లేకుండా ఉద్యమించడం ఎందరికో 'స్ఫూర్తిదాయకం.

ఈ పుస్తకం చదివిన ప్రతివారు మూఢవిశ్వాసాలకు వ్యతిరేకంగా ఆలోచించి సమాజంలో మార్పు తేగలిగితే ఈ పుస్తకం ప్రయోజనం సిద్ధించినట్లే. ఉద్యమకారుల ఛాయాచిత్రాలతో ముఖచిత్రాన్ని ప్రచురించి పాఠకుల్లో ఉత్తేజం కలిగించిన గౌరవ్‌గారు అభినందనీయులు.

ధిక్కారస్వరాలు, వెల: రు.30/-; ప్రాప్తిస్థానం: యం.కె.గౌరవ్, ఉప్పాడరోడ్, పిఠాపురం, తూ.గో.జిల్లా-533450. సెల్:9032094492, 9441089829

**- మందరపు హైమవతి**

# పరిమళించే కవిత్వ జ్ఞాపకాలు




కొంతమంది కవులు ఒకటో రెండో పుస్తకాలు రాసి ఆగతవైభవంలోనే బ్రతికేస్తూ వుంటారు. కొంతమంది మాత్రం నిరంతరం వెలిగిస్తూనే వుంటారు కవితా దీపాలు. అలాంటి కవి డా॥ ఎన్. గోపీ గారు. ఇటీవల కేంద్ర సాహిత్య అకాడమీ, భారత విదేశాంగశాఖ సౌజన్యంతో జర్మనీకి వెళ్ళిన సందర్భంగా ప్రచురించిన పుస్తకమే 'జర్మనీలో కవితాయాత్ర'.

జర్మనీ అనగానే సంస్కృత పండితుడు మాక్సుముల్లర్, కాళిదాసు శాకుంతలాన్ని చదివి ఆనందం పట్టలేక నాట్యం చేసిన గేటె, నీషె, హెగెల్‌మార్క్స్, బెఖ్ట్ మొదలైన మహామహులు గుర్తుకు వస్తారు. 'హ్యాంబర్గ్' యూనివర్శిటీలో హ్యాలే నగరంలో, బెర్లిన్‌లో ఇండియన్ ఎంబజీలో, హైడల్‌బర్గ్‌లో 'సౌత్ ఏషియన్' ఇనిస్టిట్యూట్‌లో జరిగిన కవితాగోష్ఠిలో కవితలు వినిపించడం, అక్కడ శ్రోతలు ,చక్కగా ఆస్వాదించడం చదువుతుంటే మనంగూడ అక్కడే వున్నట్లు మురిసిపోతాం.

ఈ పుస్తకంలో ఆయా నగరాల్లో జరిగిన కవితాగోష్ఠి వివరాలతోపాటు ఆయానగరాల చారిత్రక ప్రాధాన్యాన్ని, అక్కడి యూనివర్శిటీల్లోని గ్రంథాలయాల విశిష్ఠతను కవి వివరిస్తారు. గోపీగారు భావుకులు. ప్రతి చిన్న విషయానికి స్పందించి కవితగా పల్లవిస్తారు. 'హిమాలయ్‌కి గోద్‌మే' కవితలో తన కడుపులోనే కత్తులు మొలిచాయి. తపస్సులు తమస్సు తామున్నాయి. బూడిద పూతల్‌పై రక్తరేఖలు దిద్దుకొన్న పరమశివుడిలా వుంది' అని హిమాలయాలపై కూడా హింస చెలరేగడాన్ని వ్యాఖ్యానిస్తారు. అక్కడ చదివిన కవితలతో పాటు కొన్నిటి ఆంగ్లానువాదాలు కూడా ఇచ్చారు. ఈ పుస్తకంలో అక్కడక్కడ పొందుపరచిన కొన్ని చారిత్రక ప్రదేశాల ఛాయా చిత్రాలు మనకు కనువిందు చేస్తాయి. ఈ యాత్రాపుస్తకం చదువుతుంటే కవిగారు మన ఎదుట కూర్చొని మాట్లాడుతున్నట్లు, మన చేయి పట్టుకొని జర్మనీ అంతా చూపించినట్లు అనిపిస్తుంది. కవిత్వ ప్రేమికులు తప్పక చదవదగిన పుస్తకమిది.

వెల: రు.100/-; ప్రతులకు ఎన్. అరుణ, ఇం.నెం.13-1/5, బి. శ్రీనివాసపురమ్, రామంతపూర్, హైదరాబాద్-500013, ఫోన్:040-27037585, 09391028496.

**- మందరపు హైమవతి,**

# కాలంతోపాటు ప్రవహిస్తూ...




నిఖిలేశ్వర్‌గారు అనగానే దిగంబర కవిత్వోద్యమం గుర్తుకు వస్తుంది. అప్పటివరకు భావకవితా ప్రవాహంలో కొట్టుకు పోతున్న తెలుగు కవిత్వాన్ని ఒక కుదుపు కుదిపింది దిగంబరకవిత్వం. అవినీతితో, అక్రమాలతో, కుళ్లు రాజకీయాలతో భ్రష్టుపట్టిపోయిన సంఘంపై అగ్నిజ్వాలలవంటి అక్షరాలతో దాడి చేసారు దిగంబర కవులు. ఈ ఉద్యమ కవులలో ఒకరైన నిఖిలేశ్వర్‌గారు నాటినుండి నేటివరకు ఐదు దశాబ్దాలపాటు కవితా ప్రయాణం సాగిస్తున్నారు. ఇందులో భాగంగానే వెలువరించిన కవితా సంపుటి 'కాలాన్ని అధిగమించి'.

సమాజంలో పెచ్చుమీరుతున్న ఉగ్రవాదం తరిగిపోతున్న మానవతావిలువలు, పడగెత్తిన సామ్రాజ్యవాద అహంకారం, పెరుగుతున్న పేదరికం గురించి ఎక్కుపెట్టిన 70 కవితాస్త్రాలు ఈ పుస్తకంలో ఉన్నాయి. 'కాలాన్ని అధిగమించి' కవితలో 'గ్రహాంతరాలవైపు; దూసుకెళ్ళే రోదసి జ్ఞానం; మనచేతుల్లోనే; అయినా ఇప్పటికీ ఇక్కడే; కాసిన్ని నీళ్ళకోసం; అంగుళం జాగా కోసం; పరస్పరం గొంతులు కోసుకొనే సంస్కృతిలో' అని అంటారు. భారతదేశానికి స్వాతంత్ర్యం వచ్చి 60 ఏళ్ళు దాటినా మనిషికి ప్రాథమికావసరాలైన నీళ్ళకోసం, గూడుకోసం పరస్పరం చంపుకొనే దుస్థితిలోనే ప్రజలు ఉన్నారని ప్రస్తుతం పరిస్థితులకు అద్దం పట్టారు.

ఇప్పుడు ప్రపంచమంతా ఉగ్రవాదం విస్తరించింది. దీనికి మసీదులు, మందిరాలు, పాఠశాలలు, ఆస్పత్రులు అన్న భేదాలు లేవు. పిల్లలు, స్త్రీలు, రోగులు అనే విచక్షణ లేదు. ఎక్కడబడితే అక్కడ బాంబులు వేసి మారణహోమం చేయడం గురించి ఒకచోట ఇలా ప్రస్తావిస్తారు. 'మానవ హాహాకారాలతో విందులు చేసికొనే; ఉగ్రవాదుల చేతుల్లో; దేవుడు ప్రవక్తలు మతగ్రంథాలు; ధర్మసూక్తులన్నీ కీలుబొమ్మలే;' అని కరడుగట్టిన ఉగ్రవాదం గురించి ఆక్రోశిస్తారు.

ప్రపంచీకరణ నేపథ్యంలో మనిషి ఒక వినియోగదారుడు, ఒక మార్కెట్ సరుకుగా మారిపోయిన వైనాన్ని పాశ్చాత్యదేశాల సరుకుల; బేరసారాలమనస్తత్వం; మనిషినే ఒక వాడకం దినుసుగా; అంతర్జాతీయ విపణిలో అడ్వర్టైజ్ చేసింది;' అని అంటారు.

కవిగారు పాశ్చాత్యదేశాలను పర్యటించిన సందర్భంలో స్వేచ్ఛాప్రతిమను గురించి ఇలా అంటారు. 'బహుళజాతి కంపెనీల లెక్కలను; నరిచేసే కంప్యూటర్ కూలీలు; కలలుకనే డాలర్ మాయానగరంది; అని ధనికదేశంలో విజృంభించిన పేదరికం మరో రూపం గురించి వాస్తవిక దృశ్యాన్ని కళ్ళకు కట్టేటట్లు వర్ణిస్తారు.

ఈ పుస్తకంలో వర్ష మరణ మృదంగం, గాజు పలకలవాన, చినుకుల నెత్తుటి గాజుముక్కలు, అగ్నికిరీటాల గుల్‌మొహర్, మాటల వంతెన, వానవాసన మొదలగు రూపకాలు మనసును అలరిస్తాయి. వర్తమాన ప్రపంచ పోకడలు తెలుసువాలనుకొనేవారు చదవదగిన పుస్తకం. కాలాన్ని అధిగమించి నిలచిన కవిత్వాన్ని సృజించిన నిఖిలేశ్వర్ అభినందనీయులు.

కాలాన్ని అధిగమించి: వెల: రూ. 100లు. ప్రతులకు నిఖిలేశ్వర్, 2-2-647/185/1, శారదానగర్ (బాగ్ అంబర్‌పేట), హైదరాబాదు 500013. విశాలాంధ్ర, ప్రజాశక్తి, నవోదయ మొదలగు ప్రచురణాలయాలు.


**- మందరపు హైమవతి,**

**ఫోన్: 9441062732**


**కవిత**

# చిగురించిన వేపచెట్టు

వీధుల్లో అస్తవ్యస్తంగా వేలాడే విద్యుత్ తీగలు
అడ్డుగా ఉన్నాయని వేపచెట్టు కొమ్మలు నరికారు
ఇష్టంగా పెంచడం నరకడం పరిపాటైపోయింది.
ఆకుపచ్చదనం లేని మ్రోడును మిగిల్చారు.
అంతమాత్రాన చెట్టు అనామకం కాదు
ఆకారం కోల్పోయి జీవచ్ఛవంలా నిలబడ్డ మ్రోడు
చూడటానికి వికృతంగా కనబడుతున్న మ్రోడు
వెన్నెల రాత్రుల్లో దిష్టిబొమ్మలా నిబ్బరంగా ఉన్న మ్రోడు
నిర్లిప్త సమాధిలో ధ్యానంలో మునిగిన మ్రోడు
గొడుగు లాంటి నీడను కోల్పోయి బోసిపోయిన మ్రోడు
ఇంకెక్కడ చిగురిస్తుందని అందరూ పెదవి విరిచిన వాళ్లే
నిస్పృహలేదు, నిట్టూర్పులు లేవు, ధృఢ నిశ్చయంతో
మట్టిలో లోతుగా కూరుకుపోయిన తల్లివేరు
అష్టవంకర్లతో మెలికలు తిరిగిన పిల్లవేర్లు
ఉన్నచోటే కదలకుండా గుసగుస లాడుకొన్నాయి
తల్లివేరుకు బాసటగా ఉంటామని బాసలు చేసి
ఊగిపోయి ఉబికివచ్చిన చైతన్య సంబరం
అగోచరమైనా ఆద్యంతం రమణీయమే
అది నిజానికి ఒక బలీయ జీవశక్తి చమత్కారమే
పర్యవసానం వేపచెట్టు పునరుత్పత్తికి సిద్ధపడటమే
శ్రమైక సాధనా ఫలం చెట్టు చిగురించడమే
సమిష్టిగా సంకల్ప బలాన్ని సమీకరించి
మ్రోడుపై ఆదమరచి ఊగే పచ్చని చిగుళ్లు
పల్లవించిన పచ్చదనంతో నిగనిగలాడుతూ
రెట్టించిన తపనతో శాఖోపశాఖలై
శిరసెత్తిన వేపచెట్టు ఉత్సాహంగా నిలిచింది.
సంకల్పం సమన్వయం సమపాళ్ళలో ఉంటే
చిగుళ్లు వేసిన వేపచెట్టు అందరికీ ఆశ్చర్యమే.


**- ఆచార్య పసుల వెంకటరెడ్డి**

సెల్‌నం. 9966884047



Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL/2015/62362

